అపరాధ పరిశోధన అనుబంధం—112

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## పిశాచి కోరిక
రచన : వసుంధర

## డేగ కళ్ళు
రచన : బొమ్మిడి అచ్చారావు

## కసి
రచన : టెంపోరావ్

## కపాలం పగిలిన కలప వ్యాపారి
రచన : సికిందర్

అపరాధ పరిశోధన సప్లిమెంట్—112
ఏప్రెల్, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వి. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# పిశాచి కోరిక

## వసుంధర

"వచ్చే సోమవారం నాటికి నేను తిరిగి వచ్చేస్తాను. నువ్వు జాగ్రత్తగా ఉండు. భయమనిపిస్తే పక్కింటి వాళ్ళమ్మాయిని పడుకో బెట్టుకో సాయంగా—" అన్నాడు ప్రసాదరావు.

"మీరు పక్కన లేరన్న దిగులు తప్పితే నాకు భయమేమిటండీ—" అంది విమల.

ప్రసాదరావు వెళ్ళిపోయాక విమల తలుపులు వేసుకుని గదిలోనికి వెళ్ళి పుస్తకాల బీరువాలోంచి ఓ నవల తీసింది.

అది ఇంగ్లీషు నవల. పేరు "నైట్ మేర్". రచయిత పేరున్నవాడు కాదు. కానీ పాతపుస్తకాల వాడివద్ద అట్టమీద బొమ్మ చూసి ఆ నవల కొన్నది విమల. అట్ట మీద ఒక భయంకరాకారం ఉన్నది. ఆధునిక దుస్తులు వేసుకున్న భూతంలా వున్నది ఆ ఆకారం. ఆ కారం ముందు అమాయకత ఉట్టిపడే ముఖంతో ఓ అందమైన

యువతి ఉన్నది.

విమలకు కళ్ళు జలదరింపజేసే సాహిత్యమంటే ఇష్టం. అలాంటి పుస్తకాలు ఆమె రాత్రిళ్ళు చదువుతుంది. ఏ మాత్రమూ భయపడదు. ఇంకా చెప్పాలంటే ఆమె భర్త ప్రసాదరావుకు చీకటి అంటే భయం. విమల పుట్టింటికి వెడితే పేకాట వంకన అతడు స్నేహితులనేనా తనింటికి తెచ్చుకుంటాడు. తనైనా స్నేహితుల ఇళ్ళకు వెడతాడు. ఒంటరిగా ఉండలేడతడు. విమల చదివే నవల సారాంశం వినడం కూడా అతడికిష్టముండదు.

విమల భర్త భయాన్ని వేళాకోళం చేస్తుంది. రాత్రి పడుకునేటప్పుడు మామూలు కథలా మొదలుపెట్టి కథలోకి దెయ్యాన్ని తీసుకుని వస్తుంది. ప్రసాదరావు ఒకోసారి భయాన్ని కోపంగా మార్చితే తప్ప అల్లరి భరించ వీలుకాదు.

అయితే విమలకు భర్త అంటే చాలా ఇష్టం. స్వతహాగా చిలిపిని కావడంవల్ల అతడిని ఏడిపిస్తుంది తప్పితే నిజంగా అతడి మనసు నొచ్చుకుంటే ఆమె భరించలేదు.

విమల "నైట్ మేర్" నవలను తెరిచింది. ఆ నవల చాలా భయంకరంగా వుంది. అప్పటికి తను యాభై పేజీలు చదివింది. నవల మొత్తం మూడువందల డెభ్భై ఆరు పేజీలు వుంది. ఆమె ఏ నవలనైనా శ్రద్ధగా చదువుతుంది. ఒకసారి చదివిన నవల నామె మళ్ళీ మర్చిపోదు. కానీ ఏ నవలనూ ఏకబిగిని పూర్తిచేయలేదామె. అందులోనూ ఇంగ్లీషు నవలలైతే చెప్పనే అక్కర్లేదు. ఇంతవరకూ చదివిన ఆ యాభై పేజీలు కూడా—మూడు రోజుల్నించి చదవగా పూర్తయ్యాయి.

# 5

ప్రసాదరావుకు ఆఫీసు పనిమీద టూర్ తగిలింది. మళ్ళీ అయిదు రోజులదాకా రాడతను. ఎనిమిది గంటల ప్రాంతాల రాత్రి భోజనం ముగించుకుని అతడు వెళ్ళి పోయాడు.

'ఆయన వచ్చేలోగా ఈ పుస్తకం పూర్తిచేయాలి—' అనుకుంది విమల మంచంమీద పడుకుంటూ. కానీ ఆ రాత్రికి మాత్రం ఎన్నో పేజీలు చదవలేకపోయింది. పట్టుమని రెండు పేజీలు చదివిందో లేదో నిద్ర ముంచుకు వచ్చిందామెకు. అలా జరుగుతుందన్న అనుమానం ఆమె కున్నది.

ఆ రోజంతా ఆమె ఎంతో శ్రమపడింది. భర్తకు మూడు జతల బట్టలు ఇస్త్రీ చేసింది. పొరుగూరిలో తినడం కోసం స్వీట్సు తయారుచేసింది. మళ్ళీ ఇంటి భోజనం ఎప్పటికోనని ఆ రాత్రి విందు భోజనం ఏర్పాటు చేసింది. ఉదయం లేచింది మొదలు వంచిన నడుం ఎత్త కుండా పనిచేసింది. భర్త వెళ్ళిపోయేదాకా ఆమెకు అలసట తెలియలేదు. అతడు వెళ్ళగానే ఆమె కనులు బరువెక్కినట్లనిపించింది.

అందుకే ఆమె ముందు వీధి తలుపులు వేసింది. ఆ తర్వాతే నవల తీసింది.

ఆమెకు నవల చదవాలనే వున్నది. కానీ అలసట ఆమె కోరికను జయించింది. కొద్ది క్షణాల్లోనే వళ్ళెరుగని నిద్ర ఆమెను ఆవహించింది.

## 2

ఒక రాత్రివేళ ఉన్నట్లుండి విమలకు మెలకువ వచ్చింది. గదిలో బల్లమీద నుంచి ఏదో గ్లాసు జారిన చప్పుడయింది.

## 6

విమల కళ్ళు తెరిచింది. వెంటనే ఆమెకు ఏమీ కనిపించలేదు. ఒక్క నిమిషం కళ్ళు నులుముకుంది. అప్పుడు మంచంమీద లేచి కూర్చుంది. బెడ్ లైట్ వెలుతుర్లో ఆమెకు అన్నీ కనిపిస్తున్నాయి.

ఉన్నట్లుండి విమల ఉలిక్కిపడింది.

గదిలో ఓ మనిషి అటూ యిటూ పచార్లుచేస్తున్నది.

భయమంటే ఎరుగని విమల గుండెలు ఒక్కసారి గుభేలుమన్నాయి. ఎందుకంటే ఆమె చూస్తున్నది సినిమా దృశ్యంకాదు. కథలోని కల్పన కాదు. వాస్తవం!

ఆ మనిషి విమలను చూడలేదు.

తెల్లచీర కట్టుకున్నది. జుత్తు విరబోసుకుని వున్నది. మనిషికి సుమారు యాభై సంవత్సరాలుండవచ్చునని పిస్తుంది. కళ్ళు ఎటో శూన్యంలోకి చూస్తున్నట్లున్నవి.

ఆమె అటూ యిటూ తిరుగుతున్నది. అలా తిరగడంలో ఒకసారి బల్లకు కాలు తగిలి దానిమీద గ్లాసు క్రిందపడినట్లున్నది. గ్లాసు ఇంకా నేలమీదనే వున్నది. ఆ ముసలిదీ విషయం పట్టించుకున్నట్లు లేదు.

ఇంకా అలా అటూ యిటూ తిరుగుతూనే వున్నది.

ఎవరామె? ఈ గదిలోకి ఎలా వచ్చింది? తను అన్ని వైపులనుంచీ తలుపులు వేసింది. అయినా లోపలకు ఎలా రాగలిగింది? గదిలో అర్థంలేకుండా పచార్లు చేస్తున్నదేం?

విమలకు చాలా సందేహాలు కలిగాయి. ఆమె గొంతు పెగలడానికి కొంతసేపు పట్టింది.

"ఎవరున్నువ్వు?" అంది విమల.

ఆ ముసలిది వినలేదు. ఆమె అటూ యిటూ పచార్లు చేస్తూనే ఉన్నది.

"ఎవరున్నువ్వు?" మరి కాస్త గట్టిగా అన్నది విమల.

ముసలిది ఉలిక్కిపడి విమలవైపు చూసింది. ఆమె కాళ్ళు కదలడం ఆగిపోయినవి.

"మెలకువ వచ్చిందా తల్లీ!" అందామె. ఆ కంఠం చాలా తమాషాగా ఉంది. అయితే అందులోంచి ఆప్యాయత ధ్వనిస్తున్నది.

"ఎవర్నువ్వు? ఈ గదిలోకి ఎలా వచ్చావు?" అంది విమల.

ముసలిదామె మంచాన్ని సమీపించింది. తనూ మంచం మీద విమలకు దగ్గరగా కూర్చుని-"నా పేరు చంద్రమ్మ" అంది.

"ఊఁ" అంది విమల. ఆమె మనసుకింకా పూర్తిగా ధైర్యం చిక్కబట్టలేదు. ఆమె మేకపోతు గాంభీర్యాన్ని వహించింది.

"నన్ను చూస్తే నీకు భయంగా వుందా?" అంది చంద్రమ్మ.

"భయమెందుకు?" అంది విమల.

"నా అదృష్టంకొద్దీ నువ్వు దొరికావు. నువ్వు తప్పక నా కోరికను తీర్చగలవు—" అంది చంద్రమ్మ.

"అసలు నువ్వెవరివి?" అంది విమల మళ్ళీ.

"ఎవరినని చెప్పను? పుట్టకముందు నువ్వెవరివో నీకు తెలుసా? పోయాక నువ్వెవ్వరివో నీకు తెలుస్తుందా?" అన్నది చంద్రమ్మ.

"నేను చావుపుట్టుకల గురించి అడగడంలేదు. ఇప్పుడు నువ్వెవరివో చెప్పు!" అంది విమల.

"పుట్టుకకూ చావుకూ మధ్య నా పేరు చంద్రమ్మ. అందుకని ఇప్పుడూ అదే పేరు చెబుతున్నాను. కానీ ఇప్పుడు నేనెవరినంటే నేనేం చెప్పను?"

విమల ఉలిక్కిపడింది — "అంటే?" అన్నది. కానీ చురుగ్గా పని చేసే ఆమె మెదడుకు ఏదో అర్థమవుతోంది.

చంద్రమ్మ నవ్వింది — "తెలివైనదానివి. నీకు వేరే అన్నీ చెప్పాలా? తీరుస్తానని మాటిస్తే నీకు నా కోరిక చెబుతాను—"

విమల ఆశ్చర్యంగా ఆమెవంక చూసింది—"అసలు నీ కోరిక ఏమిటో చెప్పు!"

"చెబుతాను. కానీ ఈ రోజు కాదు...." అంటూ మళ్ళీ నవ్వింది చంద్రమ్మ.

"నీకు ఓ రోజంతా వ్యవధిస్తాను. ఆలోచించుకుని నా కోరిక తీర్చాలన్న మంచి నిర్ణయానికిరా. రేపు రాత్రి నీకు మళ్ళీ కనిపిస్తాను. అప్పుడు నా కోరిక తీరుస్తానని మాటివ్వు. నీకు అన్నీ వివరంగా చెబుతాను—...."

విమల ఏదో అనాలనుకుంది. కానీ ఉన్నట్లుండి ఆమెకు మళ్ళీ నిద్ర ముంచుకువచ్చింది.

# 3

కాలింగ్ బెల్ చప్పుడుకు విమలకు మెలకువవచ్చింది. ఉలిక్కిపడి లేచి టైము చూసుకుంది. ఏడయింది.

ఆమె సాధారణంగా ఉదయం అయిదున్నరకల్లా లేచిపోతుంది. అంత మొద్దు నిద్ర ఎలా పట్టిందో!

విమల వరుసగా ఒకో తలుపే తీసుకుంటూ వచ్చింది. వీధి తలుపు తీసి పనిమనిషిని లోనికి ఆహ్వానించింది. కాసేపామె ఇంటిపనుల్లో మునిగిపోయింది. అప్పుడామెకు రాత్రి జరిగింది గుర్తుకు వచ్చింది. అంతే!

చేస్తున్న పని వదిలేసి పడకగదికి వెళ్ళింది. మొత్తం గది అంతా క్షుణ్ణంగా పరిశీలించింది. గదిలోనికి ఎవరూ రావడానికి వేరే దారి ఏమీ లేదు.

ఆమె పేరు చంద్రమ్మ అని చెప్పింది.

గదిలోనికి ఎలా వచ్చింది?

కొంపదీసి తను కలగానీ కనలేదు కదా!

రాత్రి తను నైట్ మేర్ నవల చదువుతూ పడుకుంది. చదివిన ఆ రెండు పేజీల్లోనూ దెయ్యం ప్రసక్తి వున్నది. తనకలాంటి కల రావడానికి ఆ నవల చదవడమే కారణమా?

అయితే అది కలలాకాక అనుభవంలాగున్నది. అది కలకాక నిజంగా అనుభవమే అయితే

విమలకు ఒళ్ళు జలదరించింది.

భోజనం చేశాక ఆమె పక్కింటికి వెళ్ళింది. తనకు వచ్చిన కల గురించి చెప్పాలనే ముందు అనుకున్నది. కానీ చెప్పలేదు. ఎందుకంటే ఆ రోజామె పక్కింటి వాళ్ళమ్మాయి కళ్యాణిని సాయంగా పడుకోబెట్టుకోవాలని అనుకుంటున్నది. ఈ కల విషయం చెప్పడం వల్ల రెండు విధాల నష్టం.

కళ్యాణి భయపడి సాయం రాననవచ్చు.

తను ఒంటరితనానికి భయపడుతున్నదనుకోనవచ్చు.

విమల మొదటిది భరించగలదు కానీ రెండవది భరించలేదు.

ఆమె కళ్యాణిని సాయం పడుకోబెట్టుకోవాలనుకుంటున్న కారణం వేరు. రాత్రి తనకు నిజంగా కల వచ్చిందా—లేక చంద్రమ్మ కనిపించిందా?

చంద్రమ్మ కనిపించడమే నిజమే అయితే ఆమె ఈ రోజున మళ్ళీ కనబడతానంది. ఆమె ప్రభావం కారణంగా తనకు మళ్ళీ ఆ కల కొనసాగినా కొనసాగవచ్చు. తను భ్రమపడిందా—అది నిజమా అన్న విషయం—మరో

మనిషి తోడు వుంటేగానీ తెలియదు. ఇద్దరు మనుషులు భ్రమపడడం—అందులోనూ ఒకే విధంగా భ్రమపడడం అన్నది అరుదుగా జరుగుతూంటుంది.

పక్కింటావిడ విమలను చూసి నవ్వుతూ-"ఏమిటమ్మా మీ ఆయనకోసం బెంగకానీ పెట్టుకున్నావా—అప్పుడే అదోలా కనబడుతున్నావు!" అంది.

విమల కూడా నవ్వేస్తూ-"బెంగ సంగతి ఎలాగున్నా నిన్న రాత్రి రోజూకంటే బాగా నిద్రపట్టింది. ఏడింటికి పనిమనిషి కాలింగ్ బెల్ కొట్టేవరకూ మెలకువే రాలేదు—" అంది.

"అవునులే-రోజూ మీ ఆయన నిన్ను నిద్రపోనివ్వడం లేదనుకుంటాను. అందుకే అన్నిరోజుల నిద్రా ఒక్కసారి పట్టేసినట్టుంది—" అందావిడ.

విమల కాస్త సిగ్గుపడింది.

కాసేపు అవీ యివీ కబుర్లయ్యాక—"రాత్రికి సాయం పడుకుందుకు మీ కళ్యాణిని పంపిస్తారా?" అంది.

పక్కింటావిడ నవ్వుతూ—"దానికేం—తప్పకుండా పంపిస్తాను. కానీ ఏమిటి విశేషం? ఒక్కర్తినీ పడుకునేందుకు భయంగా ఉందా లేక పక్కలో రెండో మనిషి లేకపోతే నిద్రరానంటోందా?" అంది.

ఆవిడకు ఎప్పుడూ భార్యాభర్తల గురించి మాట్లాడ్డం సరదా. ఆవిడ మాటలు వినడానికి ఒకోసారి సరదాగానూ వుంటాయి-ఒకోసారి చిరాకును కలిగిస్తూంటాయి. ఆవిడ ఎదుటివాళ్ళ గురించి పట్టించుకోదు. తన ధోరణి తనదే!

"చాలా థాంక్సండీ-" అంది విమల ఆవిడ ప్రశ్నలకు బదులివ్వకుండా.

“థాంక్స్ నేనే నీకు చెప్పాలి—” అందావిడ.

“అదేంటండీ?” అంది విమల ఆశ్చర్యంగా.

“అవునమ్మా—అబ్బాయేమో పొరుగూళ్ళో, ఇంజనీరింగు చదువుతున్నాడు. అమ్మాయికి పద్నాలుగేళ్ళొచ్చి గుర్రంలా ఎదిగింది. ఆయనేమో పగలంతా అతలాకుతలమై రాత్రింటికొస్తారు. యింట్లో వున్నవి రెండు గదులు. పెద్ద పెద్ద అద్దెలు పోసి ఎక్కువ గదులుండే ఇళ్ళు తీసుకోలేము. ఏదో నీలాంటివాళ్ళు పిల్లను సాయం పేరు చెప్పి తీసుకుని వెడితే తప్ప మాకూ కాస్త ఏకాంతంలో అచ్చటా ముచ్చటా చెప్పుకునే వీలేదీ— అందుకే నీకు థాంక్స్ చెబుతున్నాను. నేను మర్చిపోయినా నువ్వే గుర్తుచేసి దాన్ని తీసుకువెళ్ళాలి సుమా!” అందావిడ.

“ఛీ—ఈవిడకి బొత్తిగా సిగ్గులేదు—” అనుకుంది విమల.

“ఏమ్మా—మాట్లాడవు....” అందావిడ.

విమల నవ్వుతూ—“నో మెన్షన్!” అని అక్కణ్నించి వెళ్ళిపోయింది.

## 4

రాత్రి కళ్యాణి తన ఇంటికి వచ్చేలోగా విమల ఇల్లంతా మరోసారి పరిశీలించి చూసి జరిగినదంతా మరోసారి గుర్తు తెచ్చుకుంది.

అసలేం జరిగింది?

రాత్రి తను పుస్తకం చదువుతూ నిద్రపోయింది. అంటే లైటు వేసే పడుకుని వుంటుంది. అయితే చంద్రమ్మ ఉన్నప్పుడు గదిలో బెడ్ లైటు వెలుగుతోంది. అదెలా జరిగింది? చంద్రమ్మ అసలు దీపం ఆర్పి బెడ్ లైట్

వేసిందా? బెడ్ లైటు వేయడంలో ఆమె ఉద్దేశ్య మేమిటి? తను గుర్తింపబడకూడదనా?

అలా అనుకునేందుకూ లేదు. చంద్రమ్మ రూపం తన మనసులో స్థిరపడిపోయింది. ఆమెనిప్పుడు తను మరెక్కడ కనిపించినా గుర్తించగలదు.

ఇంతకీ ఆ చంద్రమ్మ ఎవరు? మనిషా, దయ్యమా?

ఆమె తనను ఏదో కోరాలనుకుంటున్నది. అందుకు మళ్ళీ వస్తానన్నది. ఆమె కోరిక ఏమిటో తెలుసుకోవాలి. తను తీర్చాలనుకుంటే తప్ప చంద్రమ్మ తన కోరిక ఏమిటో చెప్పదు. అందువల్ల తీర్చుతాననడం మంచిది.

ఇంతకీ చంద్రమ్మ మళ్ళీ వస్తుందా?

తను నిజంగా చంద్రమ్మను చూసిందా లేక కల గన్నదా?

విమల ఆలోచనల్లో వుండగానే కళ్యాణి వచ్చింది. విమల ఆమెకు తన అనుభవం గురించి సుతరామూ చెప్ప లేదు. ఇద్దరూ చాలా సేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు.

కళ్యాణి విరిసీ విరియని మొగ్గ. ఆమెలో ఎన్నో సందే హాలున్నాయి. తల్లి నడగడానికి మొహమాట పడుతుంది. విమలను ఆమె చాలా కాలంగా అడగాలనుకుంటున్న ప్రశ్నలు కొన్ని వున్నాయి. ఒక ఆడపిల్ల అయిన వారందర్నీ వదిలి మరో పురుషుడివెంట ఎలా వెళ్ళ గలుగుతుంది? కళ్యాణి కళ్ళతో చూసిన కొత్త దంపతు లందరూ సంతోషంగానే కనిపించారు. అందుకు కారణం తెలుసుకోవాలని ఆమె తహతహలాడుతున్నది.

విమల ముందామెకు ఓపికగానే జవాబు చెప్పింది. కానీ కొంతదూరం వెళ్ళేసరికి విమలకా సంభాషణ నచ్చ లేదు.

"చూడు కళ్యాణీ! అడిగి తెలుసుకునేవి కొన్ని వుంటాయి. అనుభవంతో తెలుసుకునేవి కొన్ని వుంటాయి. పెళ్ళి గురించి ఇంక నువ్వేమీ నన్నడక్కూడదు—" అంటూ ఆమె సంభాషణ త్రుంచివేసింది.

ఇద్దరూ రాజకీయాల గురించి మాట్లాడుకోబోయారు. కళ్యాణి ఆవులించింది.

ఇద్దరూ తొందరగానే నిద్రపడ్డారు. ఇద్దరికీ కూడా వళ్ళు తెలియకుండా నిద్రపట్టింది. ఒక రాత్రివేళ ఎవరో వీపు తట్టినట్లయి విమలకు మెలకువవచ్చింది. ఆమె కళ్ళకు ఎదురుగా చంద్రమ్మ.

విమల కళ్యాణిని నిద్ర లేపబోయింది.

"ఆమెను లేపి ప్రయోజనం లేదు. నా ప్రభావంతో నిద్ర పోతున్నదామె. మాట్లాడుకోనవలసింది మనమిద్దరమూ. నీ నిర్ణయం ఏమిటి?" అంది చంద్రమ్మ.

కలా, నిజమా అన్న సందిగ్ధంలో విమల కొద్ది క్షణాలపాటు మాట్లాడకుండా వుండిపోయింది.

"నీ నిర్ణయం కోసం ఎదురు చూస్తున్నాను" మళ్ళీ అన్నది చంద్రమ్మ.

"నీ కోరిక తీరుస్తాను—" అన్నది విమల.

చంద్రమ్మ చటుక్కున వంగి విమల బుగ్గమీద ముద్దు పెట్టి—"నువ్వు నా బంగారు తల్లివి!" అంది.

"నీ కోరికేమిటో చెప్పు!" అనడిగింది విమల.

"నేనొక దురదృష్టవంతురాలను. పెళ్ళయిన నాటి నుంచీ నా భర్త నాకు దూరంగా వున్నాడు. కట్నమివ్వలేదని కోపం. చివరకు ఆ కోపంతోనే రెండో పెళ్ళి కూడా చేసుకున్నాడు. ఆయన ఆదరణ లభించక, వేరే పురుష సంపర్కం పెట్టుకోలేక—మోడువారిన జీవితం

అనుభవించి అదృష్టవశాత్తూ చావు పరిచయంగా ఇప్పుడిలా మోహినీ పిశాచినయ్యాను. నా కోరిక తీరితే తప్ప నేను ఈ రూపంనుంచి విముక్తి పొందలేను. ఒక్కసారి ఏ పురుషుడికైనా నా సాంగత్యం లభించిందంటే వాడు నాకోసం పిచ్చివాడౌతాడు. నేను లేనిదే బ్రతకలేడు.

అందుకని నేను నిన్ను బ్రతిమలాడుకుంటున్నాను. నావల్ల ఎవరి జీవితాలూ నాశనం కాకూడదన్నది నా కోరిక. కాబట్టి నువ్వు కొన్ని రాత్రులు నన్ను నీ స్థానంలో నీ భర్త పక్కన మసలనివ్వాలి. నీ భర్తకు తాననుభవిస్తున్నది నన్నని తెలియదు. అందువల్ల నా కోసం పిచ్చివాడయ్యే బాధ లేదు. నేను మానవ స్త్రీని కాను. కాబట్టి నీ భర్త శీలం చెడిందన్న బాధ నీకులేదు. మోజు తీరేదాకా సుఖాలనుభవిస్తే నాకు మోక్షం లభిస్తుంది. నువ్వు తప్పక అంగీకరిస్తావు కదూ!" అంది చంద్రమ్మ.

విమల ఆమె కథను ఆశ్చర్యంగా విన్నది. ఏదో కాశీ మజిలీ కథ చదువుతున్నట్లున్నది. మోహినీ పిశాచి ఏమిటి? తన గదిలోనికి రావడమేమిటి? వచ్చి ఇలా కోరడమేమిటి?

"ఈ ప్రపంచంలో ఎక్కడా పురుషులే లేనట్లు నువ్వు నా భర్తనే కోరుకోవడమేమిటి?" అంది విమల ఆశ్చర్యంగా.

"నేనీ యింటినే ఆవహించుకుని వున్నాను. ఈ ఇల్లు దాటి బయటకు రాలేను నేను. అందుకే నేను ఈ ఇంట్లో వున్న నీ భర్తను కోరాను—" అంది చంద్రమ్మ.

"ఏ ఆడదీ చూస్తూ చూస్తూ తన భర్తను పరాయి ఆడదానికి అప్పజెప్పలేదు. నువ్వు మానవ స్త్రీవి కాక

పోయినా ఈ పని నావల్ల కాదు—" అంది విమల.

"మాటిచ్చావు—" అంది చంద్రమ్మ.

"దానిదేముంది—ఇప్పుడు మాట తప్పుతాను" అంది విమల.

"నేను మాట తీసుకున్నదెందుకు? నీ సచ్ఛీలతను నమ్మడంవల్ల. ఒకసారి నువ్వు మాటిచ్చాక నీ భర్త నా వశమైనట్లే! జగన్మోహినీ రూపంతో అతణ్ణి నేను సులభంగా వశపర్చుకోగలను. ఎటొచ్చీ ఆపైన అతడు నీకు ప్రాణాలతో దక్కడు. నా మోహంలో పడిపోయి ఈ ప్రపంచాన్నే విస్మరిస్తాడు. అందుకే నీమీద అభిమానంతో నేను నేనని తెలియకుండా అతడి పొందు లభించే ఉపాయం నీకు చెబుతున్నాను. అంతా నీ ఇష్టం. బాగా ఆలోచించుకో. పండంటి కాపురాన్ని చేజేతులా పాడు చేసుకోకు. నేను నిన్ను మళ్ళీ కలుస్తాను. ప్రస్తుతానికి సెలవు—" అంది చంద్రమ్మ.

ఉన్నట్లుండి విమలకు నిద్ర ముంచుకువచ్చింది.

## 5

కళ్యాణి, విమల—ఇద్దరు కూడా కాలింగ్ బెల్ విన్నాకనే లేచారు.

"అబ్బా — ముద్దు నిద్దర పట్టేసింది—" అంది కళ్యాణి.

"నాకూ అంతే...." అంది విమల. అప్పుడామెకు తన కల గురించి గుర్తుకు వచ్చింది. కళ్యాణి వంక చూస్తూ "రాత్రిగానీ నీకు ఆసక్తికరమైన కలేదైనా వచ్చిందా?" అనడిగింది.

"ఆఁ" అంది కళ్యాణి.

"ఏమిటది?" కుతూహలంగా అడిగింది విమల.

"కలలోకి రఘు వచ్చాడు...." అని ఆగిపోయింది కళ్యాణి.

"రఘు ఎవరు?"

"కాలేజీలో మాకు సీనియర్...." అంది కళ్యాణి. "మనిషి సినిమా హీరోలకంటె బాగుంటాడు!"

"చంద్రమ్మ అనే ముసలిది కల్లోకి రాలేదా?" అనడిగింది విమల.

"ఛీ—మా కల్లో అసలు ముసలాళ్ళే లేరు. మొత్తం మేమిద్దరమే! ఆ కల కూడా కలలా లేదు. అచ్చం నిజంగా జరిగినట్లే వుంది—" అంది కళ్యాణి. ఆమె బుగ్గలు ఎందువల్లనో ఎరుపెక్కాయి.

"అచ్చం జరిగినట్లే వుందా — ఏం జరిగిందేమిటి?" అంది విమల.

"ఛీ—ఎలా చెప్పేది అంటీ...." అంది కళ్యాణి సిగ్గుపడుతూ.

"సిగ్గెందుకు? రాత్రి నాకూ కల వచ్చింది. అదీ జరిగినట్లే వుంది. కల అంటే ఇప్పటికీ నమ్మబుద్ధి కావడం లేదు—...." అంది విమల.

"మీకు అంకుల్ వచ్చారా కలలోకి—" అంది కళ్యాణి.

"కాదు—చంద్రమ్మ అనే ముసలిది...."

"వచ్చి ఏం చేసింది?"

"తను మోహినీ పిశాచాన్నని చెప్పింది...."

"అమ్మ బాబోయ్—ఇంకెప్పుడూ మీ యింటికి వచ్చి పడుకోను—" అంది కళ్యాణి భయంగా.

"మధ్య నీకు భయమెందుకు? పిశాచి నా కల్లోకేగానీ నీ కల్లోకి రాలేదు గదా—" అంది విమల.

"ఏమో—ఈ రోజు నీ కల్లోకి వచ్చింది—రేపు నా కల్లోకి రావచ్చు...."

"వసేరాని—కలలోకే గదా—భయమెందుకు?"

"ఏమో నాకు పిశాచాలంటే భయం—" అని కళ్యాణి వెళ్ళిపోయింది.

విమలకు ఏం చేయాలో పాలుపోలేదు. తనకు వచ్చినది కలలా లేదు. కల ఇంత ఖచ్చితంగా రెండు రోజులపాటు కొనసాగదు. కళ్యాణిని తను సాయపడుకో బెట్టుకోనడం వల్ల ప్రయోజనమేమీ కనబడలేదు.

ఇప్పుడు తనేం చేయాలి?

మరో రాత్రి మళ్ళీ ఆ పిశాచి దర్శనం చేసుకోవాలా?

విమలకు వళ్ళు జలదరించింది. తను నిజంగా పిశాచితో మాట్లాడిందా—లేక ఎవరో పిశాచినని తన్ను భ్రమ పెడుతున్నారా లేక- మొత్తమంతా తన ఊహా సంజనితమా?

అది ఊహ కాకపోతే?

పిశాచికి తన భర్తను అప్పగించాలా?

విమల మనసు బాధగా మూలిగింది. అది అసాధ్యం! ఆ పని తనవల్ల కాదు.

మరి తానీ పిశాచి బారినుండి తప్పించుకోవాలంటే వేరే ఏదైనా ఉపాయమున్నదా?

తనీ ఇంటిని ఆవహించుకుని ఉన్నాననీ—ఆ యిల్లు వదిలి వేరెక్కడకూ రాలేననీ ఆ పిశాచి అన్నది. తను ఇల్లు మారితే ప్రయోజనముంటుందా?

మోహినీ పిశాచి కన్ను తన భర్తమీద పడింది. అది తమను వదిలిపెడుతుందా? ఏదో విధంగా అది తన

భర్తను ఆకర్షించుకుని తనవద్దకు రప్పించుకోదా?

విమలకు ఏం చేయాలో పాలుపోలేదు.

తన భర్త సోమవారం మధ్యాహ్నానికి వస్తాడు. ఈ రోజింకా గురువారం. ఇక్కడుంటే రోజూ రాత్రి తనకు ఆ చంద్రమ్మ దర్శనం తప్పదు.

విమలకు భయం తక్కువే! కానీ చంద్రమ్మ గురించి ఆలోచిస్తూంటే భయం వేస్తోంది. ప్రతిరోజూ రాత్రి ఆమె తనముందు ప్రత్యక్షమవుతున్నది. ఎలా వస్తున్నదో తెలియడంలేదు. మానవాతీత శక్తి అనే అనిపిస్తున్నది. అందుకే భయం వేస్తున్నది.

మానవాతీత శక్తులను నమ్మకపోవడం వేరు. వాటిలో ప్రత్యక్షానుభవం పొందడం వేరు.

విమల ఆ పూటే పుట్టింటికి ప్రయాణం కట్టింది. ఆమె పుట్టిల్లు ఆ ఊర్నుంచి మూడు గంటలు ప్రయాణం మాత్రమే!

# 6

"పందెంలో నేను పాతికరూపాయలు గెల్చుకున్నాను. ఎవరికేం కావాలో చెప్పండి—కొనిస్తాను—" అన్నాడు రమేష్.

"ఏమి పందెంరా అది—" అంది రమేష్ తల్లి సుందరమ్మ.

"ఏ సినిమాలోనైనా సరే ఒక నిమిషానికి మించి కనిపించిన ఏ నటుడి పేరైనా నేను చెప్పగలనన్నాను. నా స్నేహితుడు పాతిక రూపాయలు పందెం కాశాడు. ఆ పందెం నెగ్గాను నేను—" అన్నాడు రమేష్.

"బాగుంది. ఈ తెలివితేటలు చదువులో చూపిస్తే బాగుండేది—" అంది సుందరమ్మ.

"చదువులో మాత్రం నేను తక్కువేం చేశాను! క్లాసులో ఫస్టు వచ్చానుగా—"

సుందరమ్మ మాట తప్పిస్తూ—"పాతిక రూపాయలవు ఏమొస్తాయిరా?" అంది.

"మిమ్మల్నందర్నీ సినిమాకు తీసుకుని వెడతాను. హోల్లో కూల్ డ్రింక్స్ ఇప్పిస్తాను. సాయంత్రం నాన్నగారాఫీసు నుంచి తిరిగివచ్చేలోగా మనమంతా మ్యాట్నీకి వెళ్ళి వచ్చేద్దాం—" అన్నాడు రమేష్.

"అలా చేద్దామే అమ్మా—" అంది రమేష్ చెల్లెలు స్మిత.

"మీరు వెడితే వెళ్ళండి. నేను రాను ..." అంది సుందరమ్మ.

"నాకంటే పెద్దవాళ్ళొకరూ—చిన్నవాళ్ళొకరూ—ఇద్దరుంటే బాగుంటుందని అనుకున్నాను. అమ్మా—నువ్వెప్పుడూ అంతే! నా పథకాలన్నీ పాడు చేస్తూ వస్తావు. అక్కయ్యున్నా బాగుండేది...." అన్నాడు రమేష్.

"అరే — అంతా ఇంట్లోనే వున్నారా — ఏరా స్కూల్కిప్పుడు సెలవా ఏమిటి?" అంది విమల అప్పుడే ప్రవేశిస్తూ.

"అక్కయ్యొచ్చిందోచ్—" అంది స్మిత ఉత్సాహంగా.

"అక్కా—ఇప్పుడే నీ గురించి అనుకుంటున్నాం. నీవు వెయ్యేళ్ళాయుష్షు ..." అన్నాడు రమేష్.

"ఏమిటే—హఠాత్తుగా ఇలా వచ్చావ్ ....కొంపదీసి అల్లుడుగారితో ఏమైనా గొడవ పడలేదుగదా—" అంది సుందరమ్మ కంగారుగా.

"అదేం లేదమ్మా—ఆయనూళ్ళో లేరు. సోమవారం దాకా రారు. ఒక్కదానికీ అక్కడ తోచడంలేదు. వెంటనే బయల్దేరి వచ్చేశాను...." అంది విమల.

"మంచి పని చేశావక్కా-పద-సినిమాకు పోదాం.." అన్నాడు రమేష్.

"సినిమా ఏమిట్రా!" అంది విమల.

రమేష్ తన పందెం గురించి చెప్పాడు.

"ఇప్పుడే ప్రయాణం చేసి వచ్చిందా—అది సినిమాకేం వస్తుందిరా—" అంది సుందరమ్మ కొడుకుని మందలిస్తూ.

"ఓస్ — మూడు గంటల ప్రయాణం కూడా ఓ ప్రయాణమేనా?" అన్నాడు రమేష్ తీసిపారేస్తూ.

"ప్రయాణం సంగతికేంగానీ — నువ్వు అక్కా చెల్లెళ్ళతో కలిసి చూడ్డానికి వీలుపడే సినిమాలేమైనా అసలూళ్ళో ఆడుతున్నాయా?" అంది విమల.

"బాగుందక్కా — నాయకులు చెడ్డవాళ్ళని దేశం వదిలిపెట్టి పోతామా? సినిమాలు నీటుగా లేవని మనం చూడ్డం మానేస్తామా?" అన్నాడు రమేష్.

"సినిమాలు మారేదాకా మనం చూడ్డం మానేయాలి—" అంది విమల.

"సినిమాలు మారవక్కా! మనమే మారాలి....అనవసరంగా కాలయాపన చేయకు. అవతల టైమైపోతోంది. శంకరాభరణంలాంటి సినిమాకు తీసుకుని వెడతాను. సరా?" అన్నాడు రమేష్.

మొత్తంమీద ఆ ముగ్గురూ సినిమాకు బయల్దేరారు. ముగ్గురూ కాస్త పాత సినిమాకే వెళ్ళారు.

సినిమా చూస్తూండగా విమల ఉలిక్కిపడింది. అందులో ఆమెకు చంద్రమ్మ కనబడింది.

అదే రూపం. అదే వయసు. అదే నవ్వు. అదేమాట..

ఓ పల్లెటూర్లో హీరోకు ఆశ్రయమిస్తుందో వృద్ధురాలు. ఆ వేషం చంద్రమ్మది.

అప్రయత్నంగా తమ్ముడి భుజం తట్టింది విమల.

"ఏంటక్కా!" అన్నాడు రమేష్ కాస్త విసుగ్గా.

"ఆమె ఎవర్రా?" అంది విమల.

"ఆమె అంటే?"

"అదే—చంద్రమ్మ!" అంది విమల.

"చంద్రమ్మెవరే?" అన్నాడు రమేష్.

విమల నాలిక్కొరుచుకుని—"ఈ సినిమాలో ఆమె పేరు నర్సమ్మ—" అంది.

"ఓహ్—అదా—ఆమె పేరు భద్రమ్మ. చాలా సినిమాల్లో ముసలి వేషాలు వేసింది. నేను కాబట్టి చెప్పగలిగాను కానీ ఆమె పేరు ఎవ్వరికీ తెలియదు. వయసు మళ్ళిపోయింది కూడా ఉండదట. పాపం కొందరి అదృష్టం అలాంటిది. ఏ సినిమాలోనూ రెండుమూడు నిమిషాలకు మించి కనిపించదు...." అన్నాడు రమేష్.

"ఇంకా నటిస్తోందా?" అంది విమల.

"తాజాగా రిలీజైన సినిమాల్లో కనబడ్డంలేదు. ఇప్పుడు మనం చూస్తున్న సినిమా మూడేళ్ళ క్రితంది-" అన్నాడు రమేష్.

"సరేలే—సినిమా అయ్యాక మాట్లాడుకుందాం—" అంది విమల. కానీ ఆమె సినిమాపైన దృష్టిని కేంద్రీకరించలేకపోయింది. ఆమెకు చంద్రమ్మ ముఖం బాగా గుర్తున్నది. నిస్సందేహంగా ఆ సినిమాలో మనిషి చంద్రమ్మే! మరి ఆ మనిషి రోజూ తనింట్లో యెలా కనబడుతున్నదో అర్థంకావడంలేదు.

విమలకు తెలిసిన చంద్రమ్మ ఆ సినిమాలో రెండు మూడుసార్లు కొద్ది క్షణాలపాటు కనిపించడమేకాక చిట్ట చివర గ్రూపు ఫోటోలోకి కూడా వచ్చింది.

సినిమా పూర్తికాగానే—"నువ్వా భద్రమ్మ అడ్రసు సంపాదించగలవా?" అంది విమల.

"ఎందుకే?" అన్నాడు రమేష్.

"అన్నీ చెబుతాను. ముందు నాకు ఆమె వివరాలు కావాలి—"

"వివరాలు తెలుసుకోనడం పెద్ద కష్టం కాదు. అభిమాన సంఘాలవారి నడిగితే చెబుతారు—" అన్నాడు రమేష్.

"భద్రమ్మకూ్కడా అభిమాన సంఘాలున్నాయా?" అంటూ విమల ఆశ్చర్యంగా అడిగింది.

"అభిమాన సంఘాలంటే ప్రత్యేకంగా అది కాదనుకో! ప్రముఖ హీరోలకీ హీరోయిన్ లకీ వేర్వేరుగా ఉంటాయి. అయితే పేరున్న దేవుళ్ళ గుళ్ళలో చిల్లర దేవుళ్ళకు స్థలాలు కేటాయించినట్లు ప్రతి అభిమాన సంఘం వాళ్ళకీ కూడా చిల్లర అభిమాన నటులుంటారు. ఆ విధంగా చూస్తే సినిమాల్లో కనబడ్డ ప్రతివాడికీ అభిమాన సంఘాలుంటాయి. మన ప్రజల సినిమా పిచ్చి నీకు తెలియందేముంది!" అన్నాడు రమేష్.

అతడు రాత్రికి రాత్రి భద్రమ్మ వివరాలు సంపాదించుకుని వచ్చాడు.

భద్రమ్మ 1970 లో సినిమాల్లో ప్రవేశించింది. సుమారు పది సంవత్సరాల్లో రెండువందల చిత్రాల్లో నటించింది. వాటిలో నిమిషానికి మించి కనిపించిన సినిమాలు పన్నెండుంటాయి. వయసులో చిన్నదైనా

అన్నీ వయసు మళ్ళిన పాత్రలనే ధరించింది. మంచి నటి. దురదృష్టంకొద్దీ పెద్ద నటి కాలేకపోయింది. రెండు సంవత్సరాల క్రితం ఆమె సినీ ఫీల్డును వదిలిపెట్టింది. ఏమైందో తెలియదు. ఆత్మహత్య చేసుకున్నదన్న పుకారు వుంది.

"ఈ భద్రమ్మను నేను రోజూ చూస్తున్నాను—" అంటూ విమల తమ్ముడికి తన అనుభవం చెప్పింది.

"చాలా చిత్రంగా ఉన్నదే!" అన్నాడు రమేష్.

"జరిగింది కలో, నిజమో కూడా నాకు తెలియకుండా పోతున్నది. కానీ ఈ రోజు సినిమాలో ఆమెను చూసేక ఏదో నాటకం జరుగుతున్నదని అనుమానం వస్తున్నది—" అంది విమల.

"గదిలో రెండో మనిషిని ఉంచుకుంటే!"

"అదీ చేశానుగా—కళ్యాణి వళ్ళు తెలియకుండా నిద్రపోతూ— వేరే కలలు కంటున్నది—" అంది విమల.

"గదిలో కాక గది బయటనుంచి చూస్తే!"

"అయిడియా—" అంది విమల—"అయితే ప్రస్తుతం నీకెలాగూ సెలవులే అంటున్నావు. మీ బావ వచ్చే వరకూ నువ్వు నాతో వచ్చి ఉండకూడదూ—"

రమేష్ ఉత్సాహపడ్డాడు. స్మిత కూడా వస్తానన్నది. కానీ ఆమె పిరికిది. అందుకని విమల ఆమెను మరోసారి తీసుకుని వెడతానన్నది.

మర్నాడుదయమే టిఫిను చేసి బస్సులో బయల్దేరారు అక్కాతమ్ముళ్ళిద్దరూ.

## 7

రమేష్ ఆ యింటినంతా ఒక డిటెక్టివులా పరిశోధించాడు.

అక్కా తమ్ముళ్ళిద్దరూ చాలాసేపు చర్చించారు.

ఇద్దరికీ దెయ్యాలమీద నమ్మకంలేదు. అందువల్ల చంద్రమ్మ మనిషే అయుండాలి. ఆమె మనిషే అయిన పక్షంలో ఆమైనా కొన్ని పరిమితులుంటాయి. ముఖ్యంగా ఆమెకు రమేష్ ఇంట్లో వున్నట్లు తెలియకూడదు.

అందుకని ఆ రోజుకు రమేష్ బయటకు వెళ్ళిపోయి రాత్రికి రాదలిచాడు. రమేష్‌కోసం విమల దొడ్డి తలుపు గడియ వేయకుండా వుంచుతుంది. రమేష్ వచ్చి అక్క గదిలో ఏం జరుగుతున్నదీ బయటనుంచి చూస్తాడు. అందు గురించి విమల తలుపుకు కన్నం చేసింది. ఆ కన్నం లోంచి అన్నీ స్పష్టంగా కనబడుతున్నదీ లేనిదీ ఇద్దరూ పరీక్షించి తెలుసుకున్నారు.

మామూలుగా రాత్రి అయింది. ఆపైన అర్ధ రాత్రి అయింది.

రమేష్ దొడ్డిదారిన ఇంట్లో ప్రవేశించాడు. ఎక్కడా చప్పుడవకుండా జాగ్రత్తపడ్డాడు. ఓపికగానూ, నిశ్శబ్దంగానూ అక్క గదిలోనికి చూడసాగాడు.

టైము గడుస్తోంది.

గదిలో ప్రకాశవంతంగా బల్బు వెలుగుతున్నది. విమల మంచంపైన ఆదమరిచి నిద్రపోతున్నది.

"అక్కకు అంతలా ఎలా నిద్రపడుతోందో!" అనుకున్నాడు రమేష్.

ఇంతలో గదిలో మొత్తం చీకటైపోయింది. రమేష్ కళ్ళు నులుముకున్నాడు. ఏం జరిగింది? కరెంట్ పోయిందా, లేక....

అతడాలోచిస్తూండగానే గదిలో బెడ్ లైట్ వెలిగింది. అప్పుడు లోపలి దృశ్యం చూసి ఆశ్చర్యపోయాడు

రమేష్.

గదిలో ఒక ముసలిది అటూ యిటూ పచార్లు చేస్తున్నది.

రమేష్ గుండె ధైర్యం గలవాడు కాబట్టి కానీ మరొకరికైతే గుండెలవిసిపోయి వుండేవి.

ఆ ముసలిదాన్ని భద్రమ్మగా గుర్తించాడు రమేష్.

ఆమె గదిలోకి ఎలా వచ్చింది. లైట్లు వాటంతట ఎలా ఆరిపోయాయి? మెయిన్ స్విచ్ తనున్న చోటికి దగ్గరలోనే వుంది. ఎవ్వరూ దాని జోలికి వెళ్ళలేదు. స్విచ్ నొక్కిన చప్పుడు కాకుండా గదిలోని దీపం ఆరిపోయింది. స్విచ్ నొక్కిన చప్పుడు కాకుండా గదిలో బెడ్ లైట్ వెలిగింది. కరెంట్ పోయిందనుకుందామన్నా ఏ చిరుసవ్వడీ లేకుండా ఓ దీపం ఆరి మరో దీపం ఎలా వెలిగింది? అంతా మిస్టరీగా వుంది.

రమేష్ గదిలోనికి చూస్తున్నాడు. ముసలిది పచార్లు చేయడం ఆపి విమలను సమీపించింది. ఆమె విమలకు ముక్కువద్ద ఏదో ఉంచుతోంది.

అప్పుడు విమల కాస్త కదిలింది.

ముసలిది విమలను తట్టి లేపింది.

విమల కళ్ళు నులుముకుంటూ లేచి — "నువ్వా, చంద్రమ్మా."

"ఏమిటో—రోజూ నువ్విలా కనబడుతూంటే నాకు భయం వేస్తోంది. నిన్న మా ఊరెళ్ళి వచ్చాను. నా తమ్ముణ్ణి సాయం తెచ్చుకున్నాను. కానీ వెధవ.... సినిమాకని పోయి ఇంతవరకూ రాలేదు...." అంది విమల.

"ఎవరు సాయం వచ్చినా ప్రయోజనముండదు. నేను

మానవాతీత శక్తిని. నన్నెవ్వరూ ఏమీ చెయ్యలేరు. నువ్వు నాకు మాటిచ్చావు. ఆ మాట నిలబెట్టుకో. నాకు చాలా అనుమానంగా వుంది. నేనీ ఇల్లు వదిలి బయటకు రాలేని అసహాయురాలినని తెలిసి నువ్వీ ఇల్లే వదిలే ప్రయత్నాలు చేస్తున్నావని. కానీ అది న్యాయంకాదు. నేను నిన్ను వేడుకుంటున్నాను. నువ్వలాంటి పని చేయవద్దు. ఈపాటికి నువ్వు గ్రహించే వుంటావు. ఒకరికి హాని చేసే స్వభావం కాదు నాది. లేకపోతే ఈపాటికి.."
అని ఆగిపోయింది చంద్రమ్మ.

"నా భర్త సోమవారంనాడు వస్తాడు. దయచేసి అంతవరకూ నువ్వు నాకు కనిపించకూడదు...." అంది విమల.

"రోజూ ఒకసారి కనబడి నిన్ను హెచ్చరించకపోతే నాకు మనఃనిమిశం వుండదు. నువ్వు మాత్రం నా కోరిక తీర్చాలి—" అంది చంద్రమ్మ.

"అలాగే నన్నానుగా—" అంది విమల.

"రేపు మళ్ళీ వస్తాను...." అంది చంద్రమ్మ.

ఉన్నట్లుండి విమల కు రెప్పలు బరువెక్కాయి. చూస్తూండగా ఆమె వెనక్కు వాలిపోయి నిద్రపోయింది.

ఏం జరుగుతుందోనని రమేష్ ఆత్రుతగా చూస్తున్నాడు.

గదిలో బెడ్ లైట్ ఆరిపోయింది. అంతా చీకటి!

కొద్ది క్షణాల్లో మళ్ళీ బెడ్ లైట్ వెలిగింది.

గదిలో ముసలమ్మ లేదు. వేసిన తలుపులన్నీ వేసినట్లే వున్నాయి.

ఆమె ఎలా మాయమయిందో రమేష్‌కు అంతుబట్ట లేదు.

కొద్ది క్షణాలాగి అతడు దబదబా తలుపులు బాదాడు. విమల కదల్లేదు. అక్కా, అక్కా అని పిలిచాడు. ఆమె కదల్లేదు. అయిదు నిమిషాలసేపు నిర్విరామంగా ప్రయత్నించి అలసిపోయి రమేష్ తన ప్రయత్నం విరమించుకుని దొడ్డిదారిన మళ్ళీ వీధిలోనికి వచ్చి కాలింగ్ బెల్ అదే పనిగా ప్రయోగించాడు.

ఆఖరుకు విమల లేచి తలుపు తీసింది.

"అబ్బ-ఏం నిద్ర నీది! ఇందాకట్నుంచి చస్తున్నాను" అన్నాడు రమేష్.

"ఏమోరా—చీమ చిటుక్కుమంటే లేచే స్వభావం నాది. నీకు తెలియదు గనుకనా—ఈ దెయ్యం కనబడ్డం ప్రారంభించినప్పట్నించీ ఇలా నిద్ర పట్టేస్తోంది—" అంది విమల.

"నీకు వస్తున్నది కలకాదక్కా—నీ గదిలో ముసలి దాన్ని నేనూ చూశాను. అది నీతో మాట్లాడిన మాటలన్నీ కూడా విన్నాను. గదిలోకి చూస్తూండగా లైటు ఆరిపోయాయి. ఆ తర్వాత ఏ చప్పుడూ లేకుండా బెడ్ లైట్ వెలిగింది. ముసలిది గదిలో పచార్లు చేస్తోంది. దాన్నలా చూస్తూంటే నాకు గుండెలవిసిపోయాయనుకో" అంటూ తను చూసిందంతా విమలకు చెప్పాడు రమేష్.

చంద్రమ్మను చూడడం తన మనసు కల్పించిన భ్రమ కాదని తెలియగానే ఆమె మనసు రవంత తేలికపడింది.

"వ్యవహారం చూస్తూంటే ఇది నాటకంలా లేదు. ఆ భద్రమ్మ చచ్చి దెయ్యమయిందేమోనని నాకు అనుమానంగా వుంది—" అన్నాడు రమేష్.

"అయితే ఏం చేయాలంటావ్!" అంది విమల.

"ఈ ఇల్లమ్మకుని పోవడం మంచిది—"

"బాగుందిరా — అమ్మకుంటే మళ్ళీ ఇలాంటిల్లు దొరుకుతుందా—ఆ దెయ్యం బాధైనా ఎలాగో భరిస్తాను కానీ ఈ ఇల్లు వదిలిపెట్టలేను—" అంది విమల.

"నాకు మాత్రం ఈ యిల్లు వదిలిపెట్టడమే మంచిదని పిస్తోంది. దెయ్యాలతో వ్యవహారం మాటలుకాదు. మనుషులైతే ఎప్పుడేం చేస్తారో ఊహించుకోనవచ్చును. కానీ దెయ్యాలకు అపూర్వ శక్తులుంటాయి. తిక్క రేగిందంటే అవి తమ శక్తుల్ని ఉపయోగించడం మొదలు పెడతాయి. ఇంతకాలం నేను దెయ్యాలు లేవనే నమ్ముతున్నాను. ఈ దెబ్బతో ఆ నమ్మకం అదిరింది. నా మనసు బెదిరింది....మతి చెదిరింది" అన్నాడు రమేష్.

"ఏరా-నువ్వు నన్ను బెదరగొట్టాలనుకుంటున్నావా-దెయ్యాల్ని నమ్ముతున్నావా?" అంది విమల.

"నువ్వు నమ్ముతున్నావో లేదో చెప్పు!" అన్నాడు రమేష్.

"నమ్మాలో నమ్మకూడదో తెలియడంలేదు. నాకేమీ పాలుపోవడంలేదు...." అంది విమల.

"మన నమ్మకం సంగతి ఎలాగున్నా-ముందీ సమస్యకు పరిష్కారం చూడాలిగదా—" అన్నాడు రమేష్.

"ఎలా?"

"ఎవరైనా డిటెక్టివును ఆశ్రయిస్తే!" అన్నాడు రమేష్.

"ఏమో-వాళ్ళెంతలేసి ఫీజులు అడుగుతారో ఏమో." అంది విమల.

"పోనీ—పోలీసులకు చెబితే—"

"అదేదో ఆయనకు చెప్పకుండా చెయ్యడం నాకిష్టం లేదు. పోలీసులతో వ్యవహారం మరీ ప్రమాదమని

పత్రికల్లో చదవడం లేదూ నువ్వు!"

"అయితే ఈ కేసును మనమే పరిశోధిద్దాం—" అన్నాడు రమేష్.

"ఎలా?"

"ముందా దెయ్యం ఈ గదిలో ఎలా ప్రవేశిస్తున్నదీ తెలుసుకోవాలి—" అన్నాడు రమేష్.

"అది దెయ్యమే అయితే ఎలాగైనా ప్రవేశించ గలదు...."

"అది దెయ్యం కాదనుకుంటేనే మన పరిశోధన ముందుకు వెడుతుంది—" అన్నాడు రమేష్.

"అది వచ్చేముందు గదిలో దీపాలు ఆరిపోతున్నాయి. స్విచ్ నొక్కినా చప్పుడు కావడంలేదు. తర్వాత ఏ స్విచ్చీ నొక్కకుండానే గదిలో బెడ్ లైట్ వెలుగు తున్నది. ఆ సమయానికి నాకు అంతులేని నిద్ర వస్తున్నది. అదే నన్ను తట్టి లేపుతున్నది. ఆ తర్వాత మళ్ళీ నాకు అంతులేని నిద్రవస్తున్నది. అది దెయ్యంకాదని అనుకో వడం ఎలాగో చెప్పు—" అంది విమల.

"పరిశోధించకుండా ఎలా చెప్పేది?" అన్నాడు రమేష్.

"పరిశోధన ఎలా మొదలెడుతావో చెప్పు—" అన్నది విమల.

"చెబుతాను. కానీ ఇక్కడ కాదు. ఇప్పుడు పడుకుని లేచి భోజనాలయ్యాక మనం బయటకు పోదాం—" అన్నాడు రమేష్ తగ్గు స్వరంతో.

ఇద్దరూ నిద్రకు పడ్డారు. పెందరాళే లేచారు. పదయ్యేసరికల్లా వాళ్ళ భోజనాలై పోయాయి.

ఇద్దరూ బజార్లోకి వచ్చేక రమేష్ విమలతో అన్నాడు

"మనింట్లోనే ఆ ముసలిది ఎక్కడో రహస్యంగా వుంటున్నదని నా అనుమానం. అది ఇంట్లోకి ఎలా వస్తున్నదో కనిపెట్టాలి. వచ్చేముందు దీపాలారిపోతున్నాయి. ఎవరూ చూడకుండా అది గదిలో ప్రవేశించాలనుకుంటున్నది. అంటే అది దెయ్యం కాదు. కరెంటు పోయినా సరే గదిలో వెలుగుండాలి. అందుకు మనమేదైనా ఏర్పాటు చేయాలి—"

"ఏం చేయాలో చెప్పు—" అంది విమల.

"నువ్వు నీ గది తలుపులు గడియ వేయకూడదు. నీ గదిలో దీపాలు ఆరగానే నేను బ్యాటరీ లైటుతో ప్రవేశిస్తాను...." అన్నాడు రమేష్.

"నువ్వూ నాతోపాటు గదిలో నే పడుకోనవచ్చుగా" అంది విమల.

"ఏమో—అలాగైతే నాకు నిద్ర వస్తుందేమోనని భయం. నీతోపాటు కళ్యాణి పడుకుంటే ఏం జరిగిందో చూశావుగా—ఆమె నిద్రపోయింది. నువ్వు మాత్రమే దెయ్యాన్ని చూశావు—" అన్నాడు రమేష్.

"నీవి నిజంగా అద్భుతమైన తెలివితేటలు—" అంది విమల.

"అందుకేగా—ఆ దెయ్యం ఇంట్లో మన మాటలు వినేస్తుందని ఈ వివరాలన్నీ బయట చెబుతున్నాను—" అన్నాడు రమేష్.

"అంతా బాగానే ఉందికానీ — అది దెయ్యంకాక నిజంగా మనిషే అయితే—" అంది విమల.

"దాని నాటకం బయటపెడతాం—"

"ఆ విషయం బాగానే వుంది. అది ఇంత తెలివిగా నాటకమాడుతున్నదంటే బాగా తెగించినదై వుండాలి.

మనం దాన్ని పట్టుకోగలమా? అలా పట్టుకోవడానికి ప్రయత్నిస్తే ప్రాణప్రమాదం కలగదు కదా—" అంది విమల.

"నువ్వు చెప్పినంత దూరం నేనాలోచించలేదే అక్కా! అయినప్పటికీ ఇలాంటి విషయాల్లో తెగింపు అవసరం. ధైర్యసాహసే లక్ష్మి అన్నారు పెద్దలు. నాకు చాలా ఉత్సాహంగా వుంది—" అన్నాడు రమేష్.

"అది కాదురా — దాని వెనుక ఓ పెద్ద ముఠా వున్నదేమో!" అంది విమల.

"ముఠా వుంటే నిన్న నేను రహస్యంగా చూసినప్పుడెందుకూరుకుంటారు? నా ఉద్దేశ్యంలో అది ఒక్కతే ఈ పని చేస్తోంది. ఎందుకు చేస్తోందో సరిగ్గా చెప్పలేను కానీ దీనివల్ల ఏదో ప్రయోజనముంది. ఆ వివరాలు ఈ రాత్రికే తెలుసుకుందాం. నువ్వు భయపడి — నన్ను భయపెట్టకదు. సరేనా?" అన్నాడు రమేష్.

సరేనంది విమల.

## 8

మళ్ళీ అర్ధ రాత్రి.

రమేష్ బ్యాటరీ లైటు చేత్తో పట్టుకుని అక్క పడుకున్న గదిలోనికి చూస్తున్నాడు.

గదిలో దీపం ప్రకాశవంతంగా వెలుగుతున్నది. అది ఎప్పుడు ఆరుతుందా—తానెప్పుడు గదిలో ప్రవేశిద్దామా అని ఎదురుచూస్తున్నాడు రమేష్.

బయట చీకటి బాగా చిక్కబడింది.

ఉన్నట్లుండి గదిలోని దీపం ఆరిపోయింది. రమేష్ ఒక్క ఉదుటున తలుపులు తోసుకుని గదిలో ప్రవేశించి

బ్యాటరీ లైటు వేశాడు.

గదంతా ప్రకాశవంతమయింది.

రమేష్ గదంతా పరిశీలనగా చూస్తున్నాడు. వున్నట్టుండి ఉలిక్కిపడ్డాడు. విమల పడుకున్న మంచం క్రింద నుంచీ ముసలిదాని తల బయటకు వచ్చింది. గది కాంతివంతం కావడమూ రమేష్ తన్ని చూడడమూ గమనించిందేమో — ముసలిదాని తల మళ్ళీ లోపలకు వెళ్ళిపోయింది.

క్షణమాత్రం రమేష్ శరీరం జలదరించింది. ఆ తర్వాత "నువ్వు ఇక్కడుంటున్నావా ముసలిదానా—" అంటూ అతడు మంచంవైపు నడిచి అక్కడ ఆగిపోయాడు.

తనిప్పుడేం చేయాలి? వంగుని మంచంక్రింద వెతకాలా లేక అక్కను లేపాలా? ఆలస్యమైతే మాయలమారి ముసలిది ఎక్కడ తప్పించుకుని పారిపోతుందోనని అతడు చటుక్కున వంగుని మంచంక్రింద దూరాడు.

మంచంక్రింద అతడికి ఎవ్వరూ కనబడలేదు. కానీ క్షణాలమీద అతడికి నిద్ర ముంచుకుని వచ్చింది. ఎంత ఆపుకుందామనుకున్నా నిద్ర ఆగలేదు. అలాగే ఆ మంచం క్రింద సోలిపోయాడు.

కొద్దిసేపటికి మళ్ళీ ఆ గదిలో దీపం వెలిగింది. విమలను ముసలిది తట్టి లేపింది. విమల ఆ ముసలిదాన్ని చూసి భయపడింది.

దానికి కోరలున్నాయి. ముసలిదాన్ని కోరలతో చూడ్డం ఆమెకు అదే ప్రథమం. విమల కెవ్వుమని అరవబోతే ముసలిదే ఆమె నోరు మూసింది.

"నేను నిన్ను మర్యాదగా కోరిక కోరితే నువ్వు నామీద నీ తమ్ముణ్ణి నిఘా వేయిస్తావా — ఈసారికి

దయతల్చి వదిలిపెట్టాను. ఇంకోసారి ఇలాంటి పని చేస్తే మీ యింటిల్లపాదినీ చంపేస్తాను—" అంటూ భయంకరంగా నవ్వింది చంద్రమ్మ.

"నన్ను క్షమించు...." అంది విమల.

"నిన్ను క్షమించను. ఒక్క రోజు భరిస్తున్నాను. ఈ యింట్లోంచి పోకపోయావో మీ అందరి రక్తం తాగడం మొదలుపెడతాను—" అంది చంద్రమ్మ.

విమల ఏదో అనబోయింది. కానీ ఆమెను మత్తు ఆవహించింది.

## 9

మర్నాడు ఏడింటికి మంచంమీంచి విమలా, మంచం కిందనుంచి రమేష్ ఒకేసారి కాలింగ్ బెల్ చప్పుడుకు లేచారు.

ఇద్దరూ తమ తమ అనుభవాలు చెప్పుకున్నారు.

"ఈ యిల్లు అమ్మేయడం మంచిది—" అంది విమల.

"ఈ పరిశోధన ప్రమాదకరమేనని నాకూ అనిపిస్తున్నది—" అన్నాడు రమేష్.

దెయ్యం విశేషం ఇద్దరకూ విచిత్రంగానే వున్నది. ఆ రాత్రికి ఆ యింట పడుకోనరాదని కూడా వారనుకున్నారు.

"ఈ ఒక్క రాత్రీ గడిస్తే రేపుదయానికి బావ వచ్చేస్తారు—" అంది విమల.

"బావ వచ్చి మాత్రం ఏం చేయగలడు? ఆ దెయ్యం గదిలో ఎలా ప్రవేశిస్తున్నదీ మనకు తెలియడంలేదు. మంచం కింద ఎంతగానో పరిశీలించాను. నాకేమీ తెలియలేదు...." అన్నాడు రమేష్.

"అది జెయ్యమే — ఆ విషయమై ఏ సందేహమూ లేదు...."

"సరే—ఈ వేళ ఏం చేద్దాం?" అన్నాడు రమేష్.

"భోజనాలు చేసి పక్కింటికి పోదాం. ఉదయం మీ బావగారికి నే విషయమంతా చెప్పితే ఏం చేయాలో ఆయనే చెబుతారు. ఏమంటావు?" అంది విమల.

"సరే—నువ్వు చెప్పినట్లే చేద్దాం—కానీ...." అని ఏదో అడగబోయి ఊరుకున్నాడు. బావగారివల్ల ఏమవు తుందని అతడికి తోచింది.

ఇద్దరూ వంటయింట్లో కూర్చున్నారు కబుర్లు చెప్పు కుంటూ. ఈలోగా వీధి గదిలోంచి ఓ కేక వినిపించింది.

"ఎవరో చూసి రారా!" అంది విమల.

రమేష్ వీధిలోకి వెళ్ళాడు.

తలుపులు తీసే వున్నాయి. గుమ్మంలో ఓ యువతి నిలబడి వున్నది. ఆమె అత్యంతాధునికంగా కనబడు తున్నది. అందగత్తె కూడా. వయసు పాతికేళ్ళు వుండ వచ్చునేమో!

ముఖ్యంగా ఆమె జీన్సులో ఉండడంవల్ల నేమో రమేష్ ఆమె నుండి వెంటనే దృష్టి మరల్చుకోలేక పోయాడు.

"ఈ యింటి యజమాని ఉన్నారా?" అన్నదామె.

"మా బావలేడు. అక్క వుంది—" అన్నాడు రమేష్.

"వారినే పిలవండి—" అన్నదామె.

రమేష్ లోపలకు వెళ్ళి—"అక్కా తప్పకుండా ఇది భద్రమ్మ ఆడుతున్న నాటకం—" అన్నాడు.

"ఏమిట్రా—" అంది విమల అర్థంకాక.

"తర్వాత చెబుతాను. ముందు మనింటికి వచ్చినామెను పలకరించు—" అన్నాడు రమేష్.

విమల వెళ్ళి ఆమెను పలకరించింది.

"మీరు ఇల్లు అమ్ముతారని తెలిసి వచ్చాను. మీరు కొన్న రేటుకి పాతిక వేలు ఎక్కువిస్తాను. మీకు చౌకలో మంచి ఇల్లు కూడా చూసి పెడతాను—" అన్నదామె.

"మేము ఇల్లు అమ్ముతామని ఎవరు చెప్పారు? అంది విమల.

"ఎవరో కలలో చెప్పారు—" అని నవ్విందామె.

విమల బుర్ర చురుగ్గా పని చేస్తోంది. ఈ యిల్లు యాభై వేలకు కొన్నాడు భర్త. పాతిక వేలు అప్పు. ఇప్పుడది డెభ్భైఅయిదు వేలకు అమ్మేస్తే అది తమకు బాగా లాభసాటి. అందులోనూ దెయ్యాల కొంప.... కానీ ఈమెకు ఇల్లు అమ్ముతామని యెవరు చెప్పారు?

ఈ ఇల్లు తమచేత అమ్మించడం కోసం ఎవరైనా దెయ్యం నాటకం ఆడుతున్నారనుకుందామనుకున్నా ఈ వచ్చినామె ఇంటి ఖరీదుకు పాతిక వేలు యెక్కువిస్తానని కూడా అంటున్నది. అంటే తమకిది లాభసాటి బేరమే! ఇప్పట్లో ఎవరూ ఈ యింటికింత ధర ఇవ్వరు.

"రేపు మా వారు ఊర్నించి వస్తారు. వారినడిగి చెబుతాను...." అంది విమల. కానీ అప్పటికే ఆమె మనసులో నిర్ణయమైపోయింది. ఈ దెయ్యాల కొంపలో దినదిన గండంగా బ్రతకడంకంటె ఇల్లు లాభానికమ్ముకుని పోవడమే మేలు!

ఆమె బయటకు వెళ్ళగానే అక్కడ సైగ చేసి తనూ బయటకు పోయాడు రమేష్. అతడలా యెందుకు వెళ్ళాడో ఆమెకు అర్థంకాలేదు.

ఓ గంటతర్వాత అతడు మళ్ళీ ఇంటికి తిరిగి వచ్చాడు.

"ఏం చేశావురా—?" అంది విమల.

"మనింటికి ఇల్లు కొంటానంటూ వచ్చినామె ఎవరో తెలుసా? సినీతార భద్రమ్మ. రోజూ రాత్రి మనకు చంద్రమ్మ వేషంలో కనబడుతూ ఈ రోజు అసలు వేషంలో కనబడింది. సినీ నటులందరి ముఖాలూ నాకు కంఠోపాఠం కాబట్టి కానీ లేనిపక్షంలో ఆమెను గుర్తుపట్టడం అంత సులభంకాదు.

ఆమెను అనుసరిస్తూ వెళ్ళాను. నా అదృష్టంకొద్దీ— నాన్నగారి స్నేహితులైన మనూరి పోలీసు ఇన్‌స్పెక్టరు బాబూరావుగారు కనబడ్డారు. ఆయనకు ఆమె గురించి చెప్పి ఆమె మనని పెడుతున్న ఇబ్బందులు వివరించి ఆమెబారినుంచి మనని రక్షించమని చెప్పాను. ఆమె సంగతి ఆయన చూసుకుంటాడు. ఈ రోజు ఆమె బాధ మనకి వుండదు. హాయిగా మనింట్లో మనమే పడుకొనవచ్చు...." అన్నాడు రమేష్.

"నువ్వు చెప్పేది నాకు అర్థంకావడంలేదు—" అంది విమల.

"ఈ రాత్రికి మనకు దెయ్యం భయముండదని హామీ ఇస్తున్నాను—" అన్నాడు రమేష్.

నిజంగానే ఆ రాత్రికి దెయ్యం రాలేదు.

## 10

మర్నాడు నిద్రలేచేక — "అయితే దెయ్యం పోయిందంటావా మనింట్లో నుంచి—" అంది విమల.

"పోయినట్లే — బాబూరావుగారు మనింటికి వచ్చి అన్ని వివరాలూ చెబుతానన్నారు—" అన్నాడు రమేష్.

మధ్యాహ్నానికి ప్రసాదరావు ఇంటికి వచ్చాడు. జరిగిన దంతా విని—"అమ్మబాబోయ్—మనమింక ఈ ఇంట్లో వుండవద్దు-" అన్నాడు ప్రసాదరావు. అతడా మాటలు పూర్తిచేసేలోగా ఇన్‌స్పెక్టర్ బాబూరావు భద్రమ్మతో సహా అక్కడ ప్రవేశించాడు. భద్రమ్మను చూస్తూనే విమల చాలా ఆశ్చర్యపడింది. చంద్రమ్మకూ ఈమెకూ వున్న పోలికలు చాలా స్వల్పం.

బాబూరావు నెమ్మదిగా కథ చెప్పాడు.

భద్రమ్మ రెండు సంవత్సరాల క్రితం సినీ ఫీల్డు వదిలి పెట్టింది. సంతోషరావనే ఓ ఘరానా దొంగ ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. సుమారు ఆర్నెల్ల క్రితం సంతోష రావు ఓ హత్య కేసులో అరెస్టయ్యాడు. అతడి ఆధ్వ ర్యంలో కట్టబడినదే ఈ యిల్లు.

ప్రత్యేకంగా భూ గృహం ఏర్పాట్లతో ఆ యింటిని కట్టించాడతడు. ఆ యింట్లో భూ గృహం వున్న సంగతి సంతోషరావుకూ, భూ గృహాన్ని నిర్మించిన మేస్త్రీకి తప్ప ఎవ్వరికీ తెలియదు. ఆ మేస్త్రీని సంతోషరావు చంపేశాడు. భూ గృహం పక్కగా వుంటుంది. అక్క ణ్నించి ఇంట్లోని అన్ని గదులనూ కనిపెట్టవచ్చును. భూ గృహంలో మెయిన్ ఆపి ఇంట్లోని దీపాలు ఆర్ప వచ్చును. ఇంట్లోని ప్రతి దీపాన్నీ భూ గృహం నుంచి కంట్రోల్ చేయవచ్చును.

ఆ భూ గృహాన్ని నేరస్థులను దాచడానికి, వ్యభి చారం సాగించడానికీ ఉపయోగించి డబ్బు గడించాలని సంతోషరావు పథకం వేశాడు. కానీ అతడి దురదృష్టం కొద్దీ హత్యా నేరంమీద దొరికిపోయాడు. ఇంటిని నమ్మ కస్థుడైన తన స్నేహితుడికి అప్పగిస్తే అతడది యాభై

వేలకు ప్రసాదరావుకు అమ్మేశాడు. సంతోషరావును మోసం చేశాడు.

ఈలోగా కొద్దిరోజుల క్రితం సంతోషరావు జైలు నుంచి పారిపోయి భద్రమ్మను చేరాడు. జరిగింది తెలుసుకుని పోగొట్టుకున్న ఇంటిని మళ్ళీ సంపాదించుకుని భూ గృహంలో తనకు రక్షణ కల్పించుకోవాలనుకున్నాడు. భూ గృహంలో అతడికెన్నో సదుపాయాలున్నాయి. అందులో వుండగా అతణ్ని పట్టుకోవడం ఎవరితరమూ కాదు.

భార్యాభర్తలు ఆలోచించి పథకం వేశారు. భద్రమ్మ భూ గృహంలో ప్రవేశించింది. దెయ్యం రూపంలో విమలను భయపెట్టాలనుకుంది. అర్ధ రాత్రివేళ ఆమెను చూడగానే విమల మూర్ఛపోవాలి. కానీ విమల ధైర్యవంతురాలు. అందుకని మోహినీ పిశాచి నాటక మాడింది. ఏ ఆడదీ తన భర్తను మరో ఆడదానికి అప్ప గించాలని అనుకోదు. ఇల్లు వదిలిపెట్టడం మంచిదని భద్రమ్మ పరోక్షంగా చాలా పర్యాయాలు సూచించింది.

అయితే విమల పరిశోధన మొదలుపెట్టింది. ఆఖరికి భద్రమ్మ విమలను దెయ్యంగా భయపెట్టింది. తర్వాత అసలు రూపంలో వచ్చి ఇల్లు కొంటానన్నది. రమేష్ ఆమెను గుర్తుపట్టి బాబూరావుకు అప్పగించాడు. బాబూరావు ఆమెను గురించి సంతోషరావు ఉనికి తెలుసుకుని పట్టి పోలీసులకు అప్పగించాడు. భద్రమ్మను కస్టడీలోకి తీసుకుని ఆమె కథ అంతా తెలుసుకున్నాడు....

భద్రమ్మ సాయంతో ఆ యింట్లోని భూ గృహాన్ని చూసి అంతా ఆశ్చర్యపోయారు. దానికి ప్రవేశ ద్వారం మంచంకింద వున్నది. తాళం భద్రమ్మ వద్ద వున్నది.

మనుషులకు మత్తు తెప్పించే వాయుపదార్థాన్ని తను భూగృహం నుంచి, బయట నుంచి ఎలా పంపు చేసినదీ, స్విచ్ వేయకుండానే దీపాలనెలా అదుపు చేసినదీ భద్రమ్మ వివరించి చెప్పింది.

"సంతోషరావుగానీ, భద్రమ్మగానీ పోలీసులకు దొరికి వుండేవారు కారు. వారు దొరకడానికి విమల ధైర్యం ఒక కారణం. చిన్న నటీనటులను కూడా గుర్తించగల సినిమా పరిజ్ఞానం రమేష్ కుండడం రెండవ కారణం. చంద్రమ్మను యాదృచ్ఛికంగా విమల తెరమీద చూడడమూ—ఆ చంద్రమ్మ పుట్టు పూర్వోత్తరాలూ, అసలు రూప విశేషాలూ రమేష్ ఎరిగి వుండడమూ— భద్రమ్మను మాకు పట్టిచ్చాయి. తనను రమేష్ భద్రమ్మగా గుర్తించగలడని తెలిసే ఆమె అసలు రూపంలో మీ యింటికే వచ్చేది కాదు...." అన్నాడు బాబూరావు.

భద్రమ్మ తల వంచుకుంది. నటిగా తనకింత గుర్తింపు వున్నదని ఆమె ఆనందిస్తున్నదో, లేక ప్రసాదరావు వుండగానే తను విమలను బెదిరించి వున్నట్లయితే వ్యవహారం ఇంతవరకూ వచ్చి వుండేది కాదన్న నిజాన్ని తల్చుకుని బాధపడుతున్నదో....

ఏది ఏమైనా నేరస్థులకోసం భగవంతుడు తను చేయవలసిన ఏర్పాట్లు చేసే వుంచుతాడు....

భద్రమ్మతోపాటు భూగృహ తాళాలు కూడా తీసుకుని—రమేష్కీ, విమలకి ప్రత్యేకంగా ధన్యవాదాలు చెప్పుకుని ఇన్‌స్పెక్టర్ బాబూరావు వెళ్ళిపోయాడు.

—:అయిపోయింది:—

# డేగ కళ్లు

## బొమ్మిడి అచ్చారావు

"రండి మిస్టర్ కిరణ్! మీకోసమే ఎదురుచూస్తున్నాం"

అన్నాడు హోమ్ మినిష్టర్.

డిటెక్టివ్ కిరణ్ హోమ్ మినిష్టర్‌కి అభివాదంచేసి తనకి ఆఫర్ చెయ్యబడ్డ కుర్చీలో కూర్చున్నాడు.

పోలీసు శాఖలోని అత్యున్నత ఉద్యోగులు, డిఫెన్సు శాఖోద్యోగులు, సైంటిస్టులు, ఒకరిద్దరు కేబినెట్ హోదా మంత్రులు, చీఫ్ సెక్రటరీలు, పర్సనల్ అసిస్టెంట్లు, ఇంకా అనేకమంది వి.ఐ.పీలు ఉపవిష్టులై వున్న ఆ విశాలమైన ఎయిర్ కండిషన్డ్ కాన్ఫరెన్స్ గదిలో సూది పడితే వినిపించేంత నిశ్శబ్దం తాండవిస్తోంది.

"మిమ్మల్ని ప్రత్యేకం ఢిల్లీ పిలిపించిన కారణం ఏమిటో మీకీసరికి తెలిసి వుంటుంది!" అన్నాడు హోం మంత్రి.

కిరణ్ మందహాసం చేశాడు. "గ్రహించాను. వివరాలు మీ ముఖత — తెలుసుకుంటేనే మంచిది."

హోం మంత్రి గొంతు సవరించుకుని అన్నాడు.

"గత మూడు నెలలుగా మన దేశంలోని వివిధ రాష్ట్రాలనుండి ఒక్కో శాస్త్రీయ అంశంమీద ముఖ్యమైన పరిశోధనలు చేసిన శాస్త్రవేత్తలు అకస్మాత్తుగా అంతరానవుతున్నారు. దేశంలో ఈ విషయం పెద్ద సంచలనం తీసుకొస్తోంది. సైంటిస్టులు ఆందోళన పడుతున్నారు. ప్రజల్లో కూడా భయాందోళనలు చోటు చేసుకుంటున్నాయి....

ఇప్పుడు మీరు చెయ్యవలసిన ముఖ్యమైన పనేమిటంటే, అసలీ అంతరానాల వెనక వున్న ఆంతర్యమేమిటి, యిందుకు పూనుకుంటున్న వాళ్ళెవరు? భారతీయులా? విదేశీయులా? భారతీయులే అయితే ఆ దేశద్రోహులెవరు? వాళ్ళెందుకీ ఘోరకృత్యానికి పాల్పడుతున్నారు? సైంటిస్టులంతా ఏమయిపోతున్నారు? మొదలైన వివరాలను సేకరించి ప్రభుత్వానికి తెలియచెయ్యాలి" అన్నాడు హోం మంత్రి.

"అలాగే సార్! నా శాయశక్తులా ప్రయత్నించి మీరు నాపై వుంచిన నమ్మకాన్ని నిజం చేస్తాను" అన్నాడు దృఢంగా కిరణ్.

"ఈ క్షణంనించి భారత పోలీసుదళాలు, రక్షక దళాలు, వాటి ప్రధానాధికారులు మీ సహాయం కోసం తమ సహకారాన్ని అందించటానికి సిద్ధంగా వున్నారు. మీరు ఏ క్షణంలో అడిగినా ఎలర్టుగా వుండమని ఆదేశాలిస్తున్నాం."

"ఓ.కే. సార్! నాకు సైంటిస్టుల అడ్రసులు, వాళ్ళు చేస్తున్న పరిశోధనల వివరాలు కావాలి. ఇదివరకు అంతరానమయిన సైంటిస్టుల వివరాలు, వాళ్ళ చిరునామాలు కూడా కావాలి!"

"అలాగే, తప్పకుండా!" అన్నాడు హోం మంత్రి. ఓ పదినిమిషాల తర్వాత టైప్ చెయ్యబడ్డ పేపర్లు కొన్ని కిరణ్ కి అందచేయబడ్డాయి.

"ఇవి గతంలో మాయమయిన సైంటిస్టుల చిరు నామాలు, వాళ్ళ పరిశోధనా వివరాలు. ఇవి ప్రస్తుతం మన దేశంలోని వివిధ ప్రాంతాల్లో వుంటున్న శాస్త్రజ్ఞుల వివరాలు" అన్నాడు హోం మంత్రి ఆ కాగితాలు వివరిస్తూ.

కిరణ్ పరిశీలనగా చూసి తలపంకించాడు.

ఆ పేపర్స్లో సైంటిస్టు పేరు, వయసు మొదలైన బయోగ్రఫీ అంతా వివరంగా వుంది. ఆ వివరాల కింద అతను ప్రస్తుతం చేస్తున్న ప్రయోగాల వివరాలున్నాయి.

ముఖ్యంగా యువకులే హెచ్చుగా మాయమవు తున్నారు. ఒకటి రెండు కేసుల్లో బాగా వయసు మళ్ళిన సైంటిస్టులు కూడా వున్నారు. వాళ్ళ శాస్త్రపరిశోధనలు చాలా ముఖ్యమైనవి కూడా. ఒక శాస్త్రజ్ఞుడు—తక్కువ రసాయన ఎరువులు వాడి ఎక్కువ ఫలసాయాన్ని ఎలా పొందగలరో నిరూపిస్తూ తన ప్రయోగాన్ని విజయవం తంగా ముగించబోతున్న సమయంలో మాయమయ్యాడు. మనలాంటి వ్యవసాయ ప్రధానమైన దేశానికి అతని పరి శోధనలు ఎంతో ప్రయోజనకరంగా వుంటాయని ఆశించాం. కాని, మర్నాడు అతను మాయమయిపోయాడు. ఆయన పేరు—ప్రొఫెసర్ జైరాజ్.

"మరో ముఖ్యమైన సైంటిస్టు ప్రొఫెసర్ సక్సేనా. ఈయన పరిశ్రమలలోని పనికిరాని పదార్థాల నుంచి ఇంధనం తయారుచెయ్యటం కనుగొన్నాడు. ఈయన కూడా తన పరిశోధనా ఫలితాలను మర్నాడు ప్రభు

త్వానికి నివేదిస్తాడనగా ఆ రాత్రే అంతర్ధానమయ్యాడు" అన్నాడు హోం మంత్రి.

కిరణ్ గుర్తుపెట్టుకున్నాడు.

"ఈ రెండు పేర్లు చూడండి. ప్రొఫెసర్ రావు, ప్రొఫెసర్ దయానంద్, వీళ్ళిద్దరు మహారాష్ట్రకు చెందిన వాళ్ళు. వీళ్ళు కూడా ప్రస్తుతం ప్రొఫెసర్ సక్సేనా పద్ధతుల్లో తమ పరిశోధనలు సాగిస్తున్నారు. దయానంద్ సక్సేనా శిష్యుడు కూడా! అందుకనే ఆయన పద్ధతిలోనే ప్రయోగాలు చేస్తూంటాడు. ఇదిగో ఆంధ్రాకు చెందిన ప్రొఫెసర్ రామచంద్ర. ఈయన పంటలకు సాధారణంగా హాని కలిగించే క్రిమికీటకాదుల గురించి, వాటిని ఎలా నాశనం చేసి పంటని రక్షించుకోవాలన్న విషయమై పరిశోధన చేస్తున్నాడు. ఇది కూడా చివరి దశలో వున్నది.

"అలాగే ప్రొఫెసర్ శివం, ప్రొఫెసర్ రే, ప్రొఫెసర్ జనార్ధన్‌ల పరిశోధనలు కూడా చివరి దశలో వున్నాయి. ముఖ్యంగా పరిశోధనల చివరి క్షణాల్లో వున్న శాస్త్రజ్ఞులే మాయమవుతున్నారు. కాబట్టి వాళ్ళ విషయమై హెచ్చు జాగ్రత్తలు తీసుకోవలసి వున్నది!" అన్నాడు హోం మంత్రి.

కిరణ్ తలూపాడు.

"అంతర్ధానమయిన సైంటిస్టులు తమ పరిశోధనా ఫలితాలను ప్రకటిస్తున్నట్టు ముందుగా ప్రభుత్వానికి తెలియపరిచారా?" అడిగాడు కిరణ్.

"అవును. అందుకు వాళ్ళ పరిశోధనలు పూర్తయినట్టు మాకు తెలిసింది. ఒకరిద్దరు మాయంకాగానే మేమే రహస్య సమాచారం పంపి, అయా సైంటిస్టుల పరి

శోధనా ఫలితాలని రహస్యంగా ప్రభుత్వానికి తెలియచేయమని కబురుపెట్టాం. అన్ని జాగ్రత్తలు తీసుకున్నా వాళ్లు మాయమయ్యారు."

"దీన్నిబట్టి ఆ కిడ్నాపింగ్ ముఠాకి ముందుగానే ఏ సైంటిస్టు పరిశోధన ముగింపుకొస్తున్నదో తెలిసిపోతోందన్నమాట! మీరు ఆ ముఠా ఆటలు కట్టించి మన సైంటిస్టులని రక్షించాలి. అందుకే మీరే సమర్థులని ఈ భారాన్ని మీ భుజస్కంధాల మీద పెడ్తున్నాం" అన్నాడు హోం మంత్రి.

"ఈ క్షణంనించీ నా సేవలను ప్రభుత్వానికి అంకితం చేస్తున్నాను. అయితే నేను పరిశోధనకు పూనుకున్న విషయం వీలయినంత వరకు రహస్యంగానే వుంచండి. ఏమాత్రం బయటికి పొక్కనీయవద్దు" అన్నాడు కిరణ్.

"అందుకు మేమైతే జాగ్రత్తలు తీసుకోగలం. కాని పత్రికా విలేఖరులు మహా చురుకైనవాళ్ళు. ఇక్కడి కాన్ఫరెన్సుకి కావాలనే వాళ్ళను ఆహ్వానించలేదుగాని, ఇక్కడేదో చర్చ జరుగుతున్న విషయం వాళ్ళు చాలా తేలిగ్గా పసికట్టేస్తారు. ఏదో విధంగా యిన్ఫర్మేషన్ రాబడతారు. కాబట్టి ఈ విషయంలో మీరనుకున్న విధంగా రహస్యంగా దాచటమనేది కష్టసాధ్యం!" అన్నాడు హోం మంత్రి.

కిరణ్ ఓ క్షణం ఏదో ఆలోచించి, "ఓ.కే. దన్! నేను రేపట్నుంచే నా పరిశోధన మొదలుపెడతాను. ముందుగా అంతర్ధానమయిన శాస్త్రవేత్తల నివాసాలకు వెళ్ళి వాళ్ళు ఎలా మాయమయ్యారో వివరాలు సేకరిస్తాను. తరవాత పరిశోధనలు ముగింపుకొచ్చిన శాస్త్రజ్ఞులని కల్సుకుంటాను. నా పరిశోధనా వివరాలని ఎప్పటి

కప్పుడు ఫోన్‌లోగాని, వీలయితే స్వయంగా మిమ్మల్ని కల్సుకునిగాని, స్పెషల్ మెసెంజర్ ద్వారాగాని తెలియ పరుస్తూంటాను" అన్నాడు కిరణ్.

హోం మంత్రి ఆనందంగా తలాడించాడు.

పోలీసు కమిషనర్ రహస్య వార్తాహరుల వివరాలు కిరణ్‌కి తెలియచేశాడు. యిన్వెస్టిగేషన్ బ్యూరోల వివరాలు, ఏజెంట్లు ఎక్కడెక్కడ ఏయే పేర్లతో వ్యవహరిస్తున్నదీ కిరణ్‌కి స్టాటిస్టిక్స్ యిచ్చాడు. కిరణ్ నోట్ చేసుకున్నాడు.

"మీకోసం ఓ ప్రత్యేకమైన బుల్లెట్ ప్రూఫ్ కారు యిస్తున్నాం. మీరెప్పుడు యెక్కడికి వెళ్ళాలన్నా అభ్యంతర పెట్టకుండా ఎయిర్‌పోర్ట్సుకి స్పెషల్ మెసేజ్ పంపించాం. వేకెన్సీతో నిమిత్తం లేకుండా ఇండియన్ ఏర్‌లైన్స్ ఫ్లైట్సులో మీరు ప్రయాణం చెయ్యటానికి అనుమతిస్తారు. ద్రోహుల్ని పట్టుకునే ప్రయత్నంలో మీరు భూ మార్గం గాని, రైలుమార్గం గాని, విమాన మార్గంగాని యథేచ్ఛగా వాడుకునే అవకాశం కల్పించాము" అన్నాడు హోం మంత్రి.

కిరణ్ ఆనందంగా తలాడించి, "మీరు నాకిస్తూన్న గౌరవం, విలువ నేను మరచిపోలేనివి. ఈ గడ్డపై పుట్టినందుకు భారతీయుడుగా నా మాతృ దేశానికి నాకు చేతనైన సేవ చేసుకునే అవకాశం కల్పించారు. ఈ శాస్త్రవేత్తల కిడ్నాపర్స్‌ని పట్టి ప్రభుత్వాని కప్పగించే వరకు నేను విశ్రమించేదిలేదు" అన్నాడు.

సభికులు హర్షధ్వానాలు చేశారు.

హోం మంత్రి, కమిషనర్ ఆఫ్ పోలీసు, రక్షణ మంత్రి, కమాండెంట్సు డిటెక్టివ్ కిరణ్‌తో కరచాలనం

చేశారు.

ఢిల్లీలో యిద్దరు శాస్త్రవేత్తలు మాయమయ్యారు. ప్రొఫెసర్ సక్సేనా, ప్రొఫెసర్ ద్వివేది. వీళ్ళిద్దరి గురించిన సమాచారం ముందు సేకరిస్తాను" అని లేచాడు కిరణ్.

"బైదిబై! మీకు ఎలాట్ చేసిన కారు చాలా శక్తివంతమైనది. బుల్లెట్ ప్రూఫ్ మాత్రమే కాక, వైర్‌లెస్ వంటి కమ్యూనికేషన్ ఛానెల్‌తో పాటు, శత్రువుల బారి నుండి తప్పించుకోవటానికి కొన్ని ముందు జాగ్రత్త పరికరాలను అమర్చాం. ఆ సంగతులన్నీ మెకానికల్ ఆపరేటర్ మిష్టర్ కపూర్ చెపుతాడు మీకు. ప్లీజ్ బికాషస్! శత్రువులు ఎలాంటివాళ్ళో తెలీదు. ఏ క్షణంలో ప్రమాదం విరుచుకు పడుతుందో చెప్పలేం" అన్నాడు హోం మంత్రి.

"థాంక్యూ సర్! నేను యిప్పట్నుంచీ నా పనిమీద వుంటాను!" అన్నాడు కిరణ్. ఆయనకి నమస్కారం చేసి సెలవు తీసుకుంటూ.

ఢిల్లీ పోలీస్ సహాయం మీకు అడుగడుగునా వుంటుంది. మీ కారుతోటే అన్వర్ చాలా అనుభవమున్న వ్యక్తి. డ్రైవింగ్ అతనికి మంచినీళ్ళ ప్రాయం! మీకు హిందీ తెలియకపోయినా ఫరవాలేదు. అతనికి ఇంగ్లీషు మాట్లాడటం బాగా వచ్చు" అన్నాడు హోం మంత్రి.

ఇంతలో మెకానికల్ ఆపరేటర్ కపూర్ వచ్చి సెల్యూట్ చేసి నించున్నాడు.

## 2

సాయంత్రం నాలుగు గంటలయింది.

డిటెక్టివ్ కిరణ్ బయల్దేరిన కారు ప్రొఫెసర్ ద్వివేది

నివాసస్థలమైన అశోక్ రోడ్ వైపు స్పీడున దూసుకు పోతోంది. అన్వర్ మంచి అనుభవమున్న డ్రైవరని కొద్ది నిమిషాల్లోనే ఋజువు చేసుకున్నాడు. క్షణంలో జరగబోయిన రెండు ఏక్సిడెంట్సుని అతి చాకచక్యంగా తప్పించాడు.

కిరణ్ అతనివంక ప్రశంసగా చూశాడు. జనసమ్మర్దంతోను, వాహనాలతోను కిక్కిరిసిపోయి వున్నాయి ఢిల్లీ రోడ్లు. అంత ట్రాఫిక్‌లోను చక్కగా కుదుపులేకుండా నడుపుతున్నాడు అన్వర్.

కారు పార్లమెంటు రోడ్ మీదుగా అశోకా రోడ్డుకి తిరిగింది. మరో అయిదు నిమిషాల్లో ప్రొఫెసర్ ద్వివేది అన్న చలవరాతి నేమ్ బోర్డున్న బంగళాముందు అన్వర్ కారు నిలిపాడు. తను దిగి కిరణ్ వైపుకి వచ్చి డోర్ తెరిచి పట్టుకున్నాడు.

డిటెక్టివ్ కిరణ్ కారు దిగాడు.

అన్వర్ దారి చూపుతుండగా లోపలికి నడిచాడు.

ప్రొఫెసర్ ద్వివేదికి భార్య, యిద్దరు కొడుకులు వున్నారు. ఒకడు సైన్స్ స్టాండర్డు, రెండో వాడు సెవన్త్ చదువుతున్నారు. ద్వివేది బాగా వయసు ముదిరాక పెళ్ళిచేసుకున్నాడని అతని భార్యను చూశాక గ్రహించాడు కిరణ్. ఆమె వయసు నలభై సంవత్సరాలలోపే వుంటుంది.

కిరణ్ హిందీలో ఆమెను ప్రశ్నించాడు. ద్వివేది యెప్పటినుంచి తప్పిపోయినదీ అడిగి నోట్ చేసుకున్నాడు. అతని దైనందిన కార్యక్రమాల గురించి అడిగి తెల్సుకున్నాడు.

ద్వివేది ఉపయోగించిన లాబరేటరీ చూశాడు.

బంగాళాలో ఓ పక్కనున్న పెద్ద హాలును ద్వివేది తన ప్రయోగశాలగా ఉపయోగించుకునేవాడు.

లాబరేటరీ అత్యాధునికంగా వుంది. దాదాపు పది ట్యూబులైట్లు బిగించబడి వున్నాయి హాలునిండా. అవి కాక టేబుల్ ల్యాంపులు మరో నాలుగున్నాయి. ఏడెనిమిది టేబుల్స్ నిండా రసాయనాలు, పరీక్ష నాళికలు, బీకర్లు, జార్లు వున్నాయి. ఓ పక్కగా రాక్‌లో వందలకొద్దీ పుస్తకాలు!

ప్రొఫెసర్ ద్వివేది తక్కువ యింధనం ఖర్చుతో నడిచే లో బడ్జెట్ మోటారు వాహనాన్ని రూపొందిస్తున్నాడు. అతని కృషి ఫలించింది. ఫార్ములాను రిజిష్టరు చేసి మరునాడు ప్రధానమంత్రిని కలుసుకుని తన విజయాన్ని నివేదించుకోవాలని ఆయన అభిలషించాడు. ఇది ఏప్రెల్ పన్నెండో తేదీన జరిగింది. కాని ఏప్రెల్ పదమూడో తేదీన ఆయన ప్రయోగశాలలోగాని, ఇంట్లో గాని లేడు. అసలు ఢిల్లీలోనే వున్నాడో లేదో తెలీదు.

పన్నెండో తేదీ రాత్రి భార్యతో తను సాధించిన విజయాన్ని సంతోషంగా చెప్పి ఆమెతోబాటు ఆనందం పంచుకున్నాడని అతని భార్య వందన చెప్పింది. మరునాడు తెల్లవారేసరికి అతను బెడ్‌రూంలో కనిపించక పోగానే ఇల్లంతా వెతికిందట. కనపడకపోగా లాబ్‌లో వున్నాడేమోనని అక్కడికి పోయి చూసిందట!

ద్వివేది కనిపించలేడు. అతను సీలుచేసి పెట్టిన ఫార్ములా కవరు కూడా చిత్రంగా మాయమయింది! బహుశా భర్త యెవరితో చెప్పకుండా వుదయాన్నే ప్రధాన మంత్రిని కలుసుకోబోయాడేమోనని ఆరోజంతా ఆమె యెదురు చూసింది.

ఆ రాత్రి పోలీసు రిపోర్టిచ్చింది. ప్రొఫెసర్ ద్వివేది ప్రధాన మంత్రిని గాని, సెక్రటరీని గాని కలవలేదని నిర్ధారణ చేశారు పోలీసులు. తర్వాత హోం డిపార్టుమెంటుకీ విషయాన్ని రిఫర్ చేశారు.

ఈ సంగతులన్నీ వందన వల్ల తెలుసుకున్నాడు డిటెక్టివ్ కిరణ్—ఆమె అనుమతితో యింట్లోను, లాబరేటరీలోను ప్రతి అంగుళం వెతికాడు. ఏదైనా సమాచారం లభించకపోదని అతని నమ్మకం.

ప్రొఫెసర్ ద్వివేది డైరీ దొరికింది. కాని అందులో ముఖ్యమైన విషయాలేమీ రాయలేదాయన. ఫార్ములా కోడ్ వర్డ్సు ఏవైనా రాశాడేమోనని గాలించి చూశాడు కిరణ్.

కాని ఫార్ములాకి సంబంధించిన ఏ ఒక్క విషయము డైరీలో వదలలేదు ద్వివేది. శత్రువులు అందుకే డైరీని వదిలేసిపోయారు. బహుశా వాళ్ళే ఫార్ములాకి సంబంధించిన సమాచారం తమతో పట్టుకుపోయి వుంటారు సీలు కవర్‌తో బాటు.

కిరణ్ వెనక్కి తిరిగి వచ్చెయ్యబోతూ ద్వివేది టేబిల్ వద్ద ఏదో వస్తువు మెరుస్తుండటం చూసి దాన్ని చేతికి తీసుకున్నాడు. తల పంకించాడు. అది గోల్డుమిస్టు సిగరెట్ పీక. చివర గోల్డు కలర్ స్టిక్కర్ మెరుస్తోంది. దాన్ని కోటు జేబులో పదిలపరిచాడు.

కిరణ్ తదుపరి పరిశోధనలో ఆశించిన ఫలితాలేవీ కనిపించలేదు.

వందనకు ధన్యవాదాలు చెప్పి, ఆమె ఇద్దరు పిల్లలు వీడ్కోలు చెప్తుండగా ద్వివేది యింటినుంచి బయటకు

వచ్చాడు కిరణ్.

కిరణ్ కారులో కూర్చున్నాక "ప్రొఫెసర్ సక్సేనా యింటికి పోనివ్వు" అన్నాడు ఇంగ్లీషులో.

అన్వర్ కారు స్టార్టుచేశాడు.

## 3

సక్సేనా వుంటున్నది కోట్లా రోడ్‌లో మాతా సుందరీ కాలేజి పక్కనున్న బిల్డింగులో.

అన్వర్ అశోకా రోడ్డువదిలి రఫీమార్గ్ వైపు కారు తిప్పాడు.

సరిగ్గా అదేసమయంలో యెక్కడినుంచో రివాల్వర్ గుళ్ళు సర్రున దూసుకొంటూ కిరణ్ కూచున్న సీటు పై భాగాన గ్లాస్ విండోస్‌కి తగిలి టప్‌మంటూ నేలమీద పడిపోయాయి. రివాల్వర్‌కి సైలెన్సరున్నట్టుంది.

కిరణ్ ఉలిక్కిపడి సీట్లో నిటారుగా కూచున్నాడు.

మరో రెండు గుళ్ళు వచ్చి తగిలాయి.

అన్వర్ నిశ్చింతగా కారు తోలుతున్నాడు.

ఈసారి మరో రెండు గుళ్ళు టైర్లను గురిచూసి కాల్చారు దుండగులు. టైరు పక్కలనుండి కవచాల వంటివి బయటికి వచ్చాయి. గుళ్ళు ఆ కవచాలకి తగిలి టంగ్‌మని చప్పుడయింది.

కిరణ్ అన్వర్ వంక చూశాడు. అతను దీక్షగా కారు తోల్తూనే వున్నాడు.

అంటే, తన ఉనికి శత్రువులకి తెలిసిపోయిందన్న మాట! తనమీద హత్యా ప్రయోగాలు మొదలయ్యాయి. కిరణ్ నవ్వుకున్నాడు. శత్రువులు తనని అనుక్షణం అనుసరిస్తూనే వున్నారు. తన విషయం గోప్యంగా వుంచమని హోం మంత్రితో చెప్పటం గుర్తొచ్చి మళ్ళీ నవ్వు

కున్నాడు.

శత్రువు మహా బలవంతుడు. మందీమార్బలం వున్న వాడు. అందుకే పెద్ద పెట్టున శాస్త్రజ్ఞుల కిడ్నాపింగ్ మొదలుపెట్టాడు!

గుళ్ళ వర్షం ఆగిపోయింది. కిటికీ అద్దం పక్కనుండి వెనక్కి చూశాడు కిరణ్. యెవరూ కనిపించలేదు. కిటికీ అద్దం తెరవబోతే అన్వర్ వారించాడు.

“శత్రువులు యెక్కడికీ పోలేదు. మననే ఫాలో అవుతున్నారు. ఇక్కడినుంచి మళ్ళీ జనసమ్మర్దం బాగా వుంటుంది. ఆ సమయంలో మన కారుని ట్రాక్ తప్పిస్తాను. నోట్ చెయ్యండి. నంబరు ఎ. టి. వై. 1636 నల్లరంగు ప్లిమత్ కారు” అన్నాడు అన్వర్ రేర్ వ్యూ మిర్రర్ లోంచి చూస్తూ.

కిరణ్ నోట్ చేశాడు.

కారు ఐ. టి. వో. రోడ్ పక్కగా యిండియన్ ఎక్స్‌ప్రెస్ బిల్డింగుమీదుగా అజయ్ భవన్ వైపు తిరిగింది.

“కారు ఫాలో కావటంలేదు. ప్రొఫెసర్ యింటికి సరాసరి పోనివ్వమంటారా, లేక కాసేపు నెహ్రూబాల భవన్ వైపు రౌండ్స్ వేద్దామా?” అన్వర్ అడిగాడు.

కిరణ్ కిటికీ తలుపు పైకెత్తి వెనక్కి చూశాడు. ఆటో తప్ప వేరే వాహనమేదీ కనపడలేదు.

“రామలీలా గ్రౌండ్స్ వరకు పోనిచ్చి, వెనుతిరిగి గాలిబ్ మందిర్ దగ్గర కాసేపు ఆపు. ఆ తర్వాత మాతాసుందరీ కాలేజికి దగ్గర్లో ఆపి మనిద్దరం ప్రొఫెసర్ సక్సేనా యింటికి వెళ్దాం” అన్నాడు కిరణ్.

అన్వర్ అతను చెప్పినట్లే చేశాడు.

పావుగంట తర్వాత ఎవానేగాలిబ్ ముందు కారు

నిలిపాడు అన్వర్.

కిరణ్ చుట్టూ పరీక్షగా చూశాడు. యెక్కడా నల్ల ప్లిమత్ కనిపించలేదు. తనకి తెలిసినంత వరకు ప్లిమత్ కారు నల్లరంగులో వుండగా చూడలేదు. అదేమాట అన్వర్‌తో అన్నాడు కిరణ్.

"యూ ఆర్ రైట్ సార్! ఆ కారు బులెట్ ప్రూఫ్ చెయ్యబడింది. మనకి నల్లగా కనబడ్డ రంగు దానికి సంబంధించినదే!" అన్నాడు అన్వర్.

"కాలేజి దగ్గరగా పోనిచ్చి ఆపు!" అన్నాడు కిరణ్.

అన్వర్ మాతాసుందరీ కాలేజి వద్ద కారు ఆపాక యిద్దరు దిగారు.

"సార్ నేను కారు దగ్గర వుండటం మంచిదని నా అభిప్రాయం! మీరొక్కరు సక్సేనా సాబ్ యింటికి వెళ్ళి రాగలరా?" అన్నాడు అన్వర్.

"అలాగే! ప్రొఫెసర్ యింట్లో ఎవరుంటున్నారు?"

"ప్రొఫెసర్ పెళ్ళిచేసుకోలేదు. ఆయన, ఓ ముసలి నౌఖరు—అంతే ఆ ఫ్లాట్ అంతటికీ! మీరు ఫలానా అని చెపితే నౌఖరు లోపలికి పోనిస్తాడు. బహుశా ఆ నౌఖరు ఒక్కడే వుంటాడు ఇంట్లో!" అన్నాడు అన్వర్.

కిరణ్ కారు దిగాడు. కోటు జేబులో చెయ్యి పెట్టుకున్నాడు. రివాల్వర్ చల్లగా తగిలింది చేతికి.

సక్సేనా యిల్లు అధునాతనమైన బిల్డింగ్. గేటునుంచి గుమ్మంవరకు చాలా ఖాళీ జాగా వుంది. అంతా సిమెంట్ చేయబడి వుంది. పూలకుండీలు రకరకాల పూలతో కన్నులపండుగ చేస్తూన్నాయి. ఎర్రటి రంగులో ఇటుకలు పేర్చినట్టుంది, యింటి డిజైను. గేటుకి అటు యిటు అశోక చెట్లు అందంగా ఠీవిగా నిల్చున్నాయి.

గేటుకి తాళం పెట్టి వుంది. పక్కనే గోడలో అమర్చి కాలింగ్ బెల్ వుంది! బజర్ నొక్కాడు కిరణ్.

వరండా తలుపులు తెరుచుకున్నాయి.

ఓ వృద్ధుడు బయటికి వచ్చాడు.

"క్యాహై నా?" అనడిగాడు అక్కడినుంచే.

కిరణ్ "ఖరీబ్ ఆయియే!" అన్నాడు వృద్ధుడ్ని దగ్గరగా రమ్మని చేయెత్తి పిలుస్తూ.

అప్పటికి సంజెచీకట్లు ముసురుకుంటున్నాయి.

వృద్ధుడు దగ్గరికి రాగానే కోటు పై జేబునించి ఐడెంటిటీ కార్డు తీసి చూపించాడు కిరణ్. తను వచ్చిన పని చెప్పాడు.

వృద్ధుడు సంతృప్తిగా తలాడించాడు.

తాళంతీసి గేటు తెరిచాడు "ఆయియే" అన్నాడు.

కిరణ్ వృద్ధుడి నుంచి సమాచారం సేకరించాడు.

ప్రొఫెసర్ సక్సేనా దాదాపు నలభయ్యేళ్ళ వయసు వాడు! ధృఢమైన శరీరంతో కండలు తిరిగిన వస్తాదులా వున్నాడు—హాల్లో వున్న లైఫ్ సైజు ఫోటోలో.

కిరణ్ సక్సేనాని బాగా గుర్తుపెట్టుకున్నాడు. కళ్ళలోకి చూస్తున్నట్టుగా వుంది సక్సేనా చూపు, ఫోటోలోనే. నిజంగా మనిషే ఎదురుగా వుంటే ఎక్స్‌రే కళ్ళతో మనుషుల మనసుల్ని ఫోటో తీయగల సామర్థ్యం వున్నవాడే అనుకోవచ్చు.

వృద్ధుడు చెప్పుకుంటూ పోతున్నాడు.

ప్రొఫెసర్ సక్సేనా పరిశ్రమల్లో విసర్జింపపడిన మలినాలనుండి యింధనం తయారుచేయటం కనుక్కొన్నాడు. ఏప్రెల్ పధ్నాలుగో తేదీన అర్ధ రాత్రి దాటాక తన వృద్ధ నౌఖరుని నిద్రలేపి తను సాధించిన

విజయం గురించి మహానందంగా చెప్పాడట. పదిహేనో తేదీన ప్రభుత్వానికి తెలియచేశారట. పదహారో తేదీ ఉదయం సీల్డు కవర్ తో ప్రధానిని కలుసుకోబోతున్నట్లు చెప్పాడట.

కాని పదిహేనో తేదీ రాత్రి అంతర్ధానమయ్యాడు!

“మీ యజమాని యెందుకు పెళ్ళిచేసుకోలేదు?” అనడిగాడు కిరణ్ ముసలివాడిని.

“ఎప్పుడూ లేబరేటరీలోనే తన సమయాన్నంతా ఖర్చుపెట్టేవాడు—ఇక అతనికి పెళ్ళెందుకు చెప్పండి?” అన్నాడు బోసి నవ్వులు నవ్వుతూ వృద్ధుడు.

“నేను లాబరేటరీ చూడొచ్చునా?” అనడిగాడు కిరణ్ వృద్ధుడిని. వృద్ధుడు సంతోషంగా అంగీకరించాడు.

కిరణ్ మెయిన్ హాలుకి దూరంగా వున్న ప్రయోగశాలను పరిశోధించాడు. ద్వివేది యింట్లో ప్రయోగశాల లాగానే వున్నది, సక్సేనా లాబ్ కూడా. అయితే ప్రయోగశాలలో ప్రవేశించగానే ముక్కులు పగలగొట్టే గంధకం వాసన. మరేదో రసాయన మిశ్రమాల వాసన కడుపులో తిప్పింది.

వాంతి కాబోతున్న అనుభూతి కలిగింది కిరణ్ కి. నిలదొక్కుకున్నాడు. టేబిల్సునిండా గంటజాడీలు, బీకర్లు, పిపెట్లు, వందల వేల సంఖ్యలో టెస్టుట్యూబ్ లు కిరణ్ కి దర్శనమిచ్చాయి.

టేబిల్ సొరుగులు లాగబోతూ చటుక్కున ఆగాడు కిరణ్. డ్రాయరు కింద గోల్డుమిస్టు సిగరెట్ పీకలు మిలమిల మెరుస్తోన్నాయి. కిరణ్ కళ్ళు పెద్దవయ్యాయి. డ్రాయర్ సొరుగులో సరికొత్త గోల్డుమిస్టు సిగరెట్టు ప్యాకెట్లున్నాయి.

అటు యిటు చూశాడు. వృద్ధుడు తన సహజ ధోరణిలో ఏదో చెప్పుకుపోతున్నాడు. కిరణ్ ఊ కొడుతూనే తన పని చేసుకుపోతున్నాడు. ఆ సిగరెట్ పీకలను కాగితంలో చుట్టి జేబులో దాచాడు. తను ఇలాంటి పీక యిదివరకు ద్వివేది యింట్లోను సేకరించాడు.

ఇద్దరు ప్రయోగశాలలో నుండి బయటికొచ్చారు. అప్పటికి బాగా చీకటి పడిపోయింది.

ప్రయోగశాల పక్కనే వరసగా రెండు గదులున్నాయి. వాటికి తాళాలు పెట్టి వున్నాయి.

"అవి ఉపయోగించటం లేదా?" అన్నాడు కిరణ్.

"లేదు బాబూ! ఇంత పెద్ద బంగళాలో గదులన్నీ యెవరుపయోగిస్తారు? నేనే వారానికి, పదిరోజులకీ ఓసారి తలుపులు తెరిచి శుభ్రం చేస్తూంటాను" అన్నాడు వృద్ధుడు.

కిరణ్ అతనితో గదుల పక్కగా నడుస్తూ యెందుకో ఆగి వెనక్కి చూశాడు. అతని తల యింకా పక్కకు తిరగనేలేదు. తలపైన బలమైన దెబ్బ వెనుకనుండి పడటం అతను నేలవాలటం ఒకేసారి జరిగాయి.

వృద్ధుడు కంగారుగా కిరణ్‌ని పొదివి పట్టుకుని "బాబూజీ! బాబూజీ!" అంటున్నాడు.

అంతవరకే గుర్తుంది కిరణ్ కి. తర్వాత స్పృహ తప్పి పడిపోయాడు, వృద్ధుడివంకే చూస్తూ.

## 4

కిరణ్ కి తెలివొచ్చేసరికి తనకి బసగా యిచ్చిన గెస్టు హౌస్ గదిలో పక్కమీదున్నాడు.

తలపైన సుమ్మెట్లతో కొట్టిన అనుభూతి. తలచుట్టూ బాండేజి కట్టివుంది!

ఎదురుగా హోం మినిష్టర్, పక్కగా అన్వర్, మరో పక్క సక్సేనా యింటి నౌఖరు ఆత్రంగా చూస్తున్నారు అతని ముఖంలోకి.

కిరణ్ కళ్ళు తెరవటం చూసి అందరూ తేలిగ్గా ఊపిరి విడిచారు.

పక్కనే నించుని సిరంజి లోడ్ చేస్తున్న డాక్టరు, "నో వర్రీ! హి విల్ బి ఆల్ రైట్!" అన్నాడు.

కిరణ్‌కి అంతా గుర్తొస్తోంది. తాను, సక్సేనా నౌఖరు మాట్లాడుతూ నడుస్తూండగా వెనకనించి యెవరో దేంతోనో బలంగా తలపై మోదారు. తనకి స్పృహ తప్పిపోయింది.

"మీరు కింద పడిపోగానే నేను వెనక్కి పరుగెత్తాను. యెవడో వ్యక్తి కాంపౌండ్ వాల్ దాటి పారిపోతున్నాడు. మీరింకా రాలేదని డ్రైవరు అన్వర్ లోపలికొచ్చాడు. జరిగిన విషయం అతనికి చెప్పాను. అతను కారు గేట్లోంచి గుమ్మం ముందుకి తెచ్చి పెట్టాడు. ఇద్దరం సాయంపట్టి కార్లో పడుకోబెట్టాం. సరాసరి యిక్కడికొచ్చాం. దార్లోనే డాక్టర్ని అన్వర్ వెంటబెట్టి తీసుకొచ్చాడు" వృద్ధుడు చెప్పాడు.

అన్వర్ తలూపాడు.

"మీకు పెద్ద గండం గడిచింది. రాగానే ఆపదల వలయంలో చిక్కుకున్నారు. అశోక్ రోడ్‌లో జరిగిన ఉదంతం అన్వర్ చెప్పాడు" అన్నాడు హోంమంత్రి.

కిరణ్ నీరసంగా నవ్వాడు.

"ఎనీవే శత్రువు బలమైనవాడని తెలుస్తోంది. నాకీ విషయం తెలియగానే వెంటనే యిక్కడికొచ్చాను—సార్జెంట్సుని పంపి సక్సేనా యింటిలోపల బయట వెతి

కించాను. యెవరూ కనిపించలేదు. బంగళా వెనకపక్క కొమ్మలు, పూలమొక్కలు నలిగి వున్నాయని వాళ్ళు చెప్పారు. బహుశా హంతకుడు అక్కడ చాలాసేపు యెదురుచూసి వుంటాడు" అన్నాడు హోం మంత్రి.

"కారుపైన బుల్లెట్ల వర్షం కురిపించిన శత్రువులు నన్ను చంపడానికి యినపరాడ్ వంటి వస్తువును ఉపయోగించవలసిన పనేముంది? గురిచూసుకుని రివాల్వర్‌తో సక్సేనా ఇంట్లో కాల్చెయ్యవచ్చునే!" అన్నాడు కిరణ్.

"మీరు చెప్పినదీ నిజమే! ఏమో, ఈ శత్రువు ఆ ముఠాలోవాడు కాదేమో! లేదా యెవరైనా దొంగ కావచ్చు. మీ దృష్టిపడగానే దొరికిపోతాననే భయంలో గాయపరిచి పారిపోయి వుండొచ్చు."

కిరణ్ సమాధానం చెప్పలేదు. అతనికి తెలుసు—ఆ వ్యక్తి దొంగతనం కోసం రాలేదని! వచ్చినా డబ్బు, బంగారంకోసం కాదు. అప్పటికే సైంటిస్టును మాయం చేశారు గాబట్టి ఫార్ములా కోసమూ అయివుండదు. మరి దేనికోసం?

కిరణ్‌కి కొన అందటంలేదు.

"మీకు కొత్త విషయం చెప్పబోతున్నాను.... సరిగ్గా ఓ గంట క్రితం పోలీసు కమిషనర్ పేర ఓ ఉత్తరం వచ్చింది. యమునా నది ఒడ్డున ఓ చెక్కపెట్టె దొరికింది. ఉత్తరం కిడ్నాపర్స్ రాసినది—ద్వివేది తమకు ఫార్ములా యివ్వటానికి నిరాకరించాడనీ, అతన్ని పోలీసులకి బహుమతిగా పంపిస్తున్నామనీ! చెక్కపెట్టె తెరిచి చూసేసరికి ద్వివేది శరీర ఖండాలు అతి ఘోరంగా ముక్కలుగా తెగ్గొట్టి పంపించారు—రాక్షసులు!" అన్నాడు హోం మంత్రి.

కిరణ్ పిడికిళ్ళు బిగుసుకున్నాయి. దవడ ఎముక బయటికి పొడుచుకొచ్చింది. అతని కళ్ళముందు అమాయకమైన చూపులతో పసితనం పూర్తిగా పోని ద్వివేది కొడుకులిద్దరు మెదిలారు. వందన దీనవదనం కనిపించింది.

"సర్! నేను గ్రహించిన విషయమేమిటంటే శత్రువులు ఢిల్లీలోనే వున్నారు. ఢిల్లీ కేంద్రంగా తమ దుండగాలు కొనసాగిస్తున్నారు. దేశం నలుమూలలా వీళ్ళ ఏజంట్లున్నారు. వాళ్ళు దేశ వ్యాప్తంగా వున్న సైంటిస్టులను అనుక్షణం కనిపెట్టుకునివుండి వాళ్ళు తమ ప్రయోగాలు విజయవంతంగా పూర్తిచేయగానే వాళ్ళని అపహరించుకుపోయి ఫార్ములాలు తమకు అప్పగించమని హింసిస్తున్నారు. వాళ్ళకి యెదురుతిరిగిన వాళ్ళని—ఇదిగో ప్రొఫెసర్ ద్వివేదికి మల్లే నిర్దాక్షిణ్యంగా చంపి మనకు పార్శెల్ చేస్తారు. ఇది శాంపిల్!" అన్నాడు కిరణ్.

"మీరు చెప్పింది నూటికి నూరుపాళ్ళు నిజం! అయితే ఈ మహానగరంలో వాళ్ళ స్థావరం తెలుసుకోవటం అంత తేలికకాదు."

"ఆ విషయం నేను చూసుకుంటాను. ఈలోపల మీరు కొన్ని ముందు జాగ్రత్త చర్యలు తీసుకోవాలి. సైంటిస్టులు దేశవ్యాప్తంగా వున్నారు. వాళ్ళలో తమ ప్రయోగాలు పూర్తిచేసి విజయానికి చేరువలో వున్న శాస్త్రజ్ఞుల లిస్టు మన దగ్గిరుంది. వాళ్ళకి వెంటనే పోలీసు రక్షణ ఏర్పాటు చెయ్యండి! వీలయితే వాళ్ళలో కొందర్ని కల్సుకోవటానికి ప్రయత్నిస్తాను" అన్నాడు కిరణ్.

"మీరీస్థితిలో కదలటం మంచిదికాదు. కనీసం ఓ వారం రోజులు బెడ్ రెస్టు తీసుకోండి" అన్నాడు

మంత్రి.

"నో..నో..వారం రోజులు కాదు. ఒక్క గంట కూడా వేస్టుచెయ్యదలుచుకోలేదు. ఏ క్షణంలో ఏం జరుగుతుందో చెప్పలేకుండా వున్నాం. నా ఊహే నిజమైతే ఈ సరికి సక్సేనా శిష్యుడు దయానంద్ కూడా అపహరించబడి వుండొచ్చు!"

హోం మంత్రి ఉలిక్కిపడ్డాడు.

"మహారాష్ట్ర దయానందా?"

"ఎస్, అతనే! అతను కూడా సక్సేనా ప్రయోగమే చేస్తున్నాడని మీరు చెప్పారు. నేను కూడా నోట్ చేసుకున్నాను లిస్టులో! అతని రిసెర్చి చివరి దశకి వచ్చిందని మీరే చెప్పారు కూడా!"

"వైర్ లెస్ మెసేజ్ పంపుతాను మహారాష్ట్ర ముఖ్య మంత్రికి...." అని హోం మంత్రి అంటుండగానే డి. ఎస్. పి. లోనికొచ్చి మంత్రికి అభివాదం చేశాడు.

"సర్! మహారాష్ట్ర పోలీస్ నించి యిప్పుడే మెసేజ్ అందింది. ప్రొఫెసర్ దయానంద్ కనిపించడంలేదట" అన్నాడు డి.ఎస్.పి.

హోం మినిష్టర్ నిటారుగా అయాడు.

"అక్కడే మరో సైంటిస్టు రావు వున్నారు. ఆయనకి వెంటనే పోలీసు రక్షణ ఏర్పాటు చేయమని వెంటనే మెసేజ్ పంపండి" అన్నాడాయన.

డి. ఎస్. పి. వచ్చినంత హడావుడిగాను వెళ్ళి పోయాడు బూట్లు టకటకలాడించుకుంటూ.

డిటెక్టివ్ కిరణ్ కోటు తుడుచుకోబోయాడు. ఒంటి మీద కోటులేదు.

"మీ కోటు భద్రంగా వుంది. సిస్టర్, కోటు

తీసుకురా!" అన్నాడు డాక్టరు.

సిస్టర్ కిరణ్ కోటు తెచ్చి అందించింది.

కిరణ్ జేబులు వెతికాడు. తను ద్వివేది యింట్లోను, సక్సేనా యింట్లోను సేకరించిన సిగరెట్ పీకలు లేవు! సైంటిస్టుల లిస్టుకూడా కోటుజేబులోనే భద్రంగా దాచాడు. అదీ లేదు!

"కోటు నా ఒంటిమీదినుంచి ఎవరు తొలగించారు?" సాధ్యమైనంతవరకు గొంతు స్వాధీనంలో వుంచుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు కిరణ్.

"మీకు గాయం తగిలింది కదా! డ్రస్ చేసేటప్పుడు కోటు తొలగించాల్సి వచ్చింది" అన్నాడు డాక్టరు సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్టు.

"కోటుజేబులో కొన్ని ముఖ్యమైన కాగితాలుండాలి, కనిపించటం లేదు!" అన్నాడు కిరణ్ డాక్టర్ ముఖంలోకి పరీక్షగా చూస్తూ.

"అయామ్ సారీ!....సిస్టర్, యేవయినా పేపర్సు జారి పడ్డాయా కోటునుండి?" అన్నాడు డాక్టరు.

"నో సర్! ఆయన కోటు తొలగించేటపుడు పేపర్సుంటే తప్పక కనిపించి వుండేవి! అప్పటికే లేవని నా నమ్మకం!" అన్నది నర్సు.

కిరణ్ మస్తిష్కం తీవ్రంగా పనిచేస్తోంది. తన కోటులోని కాగితాలు, ఆధారాలు దొంగిలించవలసిన అవసరం ఎవరికుంది? దోషిని పట్టుకోవటంలో ఆ ఆధారాలు తనకి చాలా ఉపయోగపడతాయని ఆశించాడు. ఇప్పుడా అవకాశం పోయింది. కాని, తను వాటిని మరచిపోతాడా?

"సర్, మనం కాసేపు విడిగా మాట్లాడుకోవాలి"

అన్నాడు గంభీరంగా కిరణ్.

"నా ఆఫీసుకి వెళదాం. అయినా మీరు రాగలరా?" అన్నాడు హోం మంత్రి.

కిరణ్ లేచి కూచున్నాడు. కోటు ధరించాడు.

"సారీ మిస్టర్ కిరణ్! మీరు కనీసం ఎనిమిదిగంటలు రెస్టు తీసుకోవాలి" అన్నాడు డాక్టరు.

కిరణ్ మరుగ్గా చూశాడాయన వంక.

"మరో నలభైయెనిమిది గంటల తర్వాత నా అవసరం ఎవరికీ వుండకపోవచ్చు!" అన్నాడు.

డాక్టరుకి అర్థంకాలేదు. వెర్రిచూపు చూస్తున్నాడు.

"పదండి సర్! నేను రెడీ!" అన్నాడు కిరణ్.

హోంమినిస్టర్ అన్వర్‌కి సైగ చేశాడు.

అల్ ప్రూఫ్ కారు హోం మినిస్టర్ నివాసంవైపు దూసుకుపోయింది.

## 5

"నాకు అంతర్గానమైన సైంటిస్టుల ఫోటోలు కావాలి. తెప్పించగలరా?" అన్నాడు కిరణ్.

హోం మినిస్టరు నివాసంలోని ఆఫీసు గదిలో కిరణ్, మినిస్టరు సమావేశమై వున్నారు. ఓ పక్క పోలీసు కమిషనరు, మినిస్టరుగారి ఆంతరంగిక కార్యదర్శి వున్నారు.

"అలాగే తెప్పిస్తాను. అంతేగాక పరిశోధనలు అంతిమ దశలో వున్న సైంటిస్టులవి కూడా అవసరమయితే తెప్పిస్తాను" అన్నాడు హోంమినిస్టర్.

"అవి కూడా అవసరమే! అసలు పరిశోధనలు జరుపుతున్న సైంటిస్టుల్ని నేనే స్వయంగా కలుసుకొని మాట్లాడాలనుకుంటున్నాను. కాని యీ లోపల మాయ

మయిన శాస్త్రజ్ఞులకి యెలాంటి దురవస్థపడుతుందో అనూహ్యంగా వుంది. వాళ్ళ రక్షణకు యెక్కువ కృషి చేయాలి మనం! వాళ్ళని రక్షించుకోవటమే కాదు, అమూల్యమయిన పరిశోధనల ఫార్ములాలు దేశం విడిచి బయటికి చేరిపోకుండా రక్షించుకున్నవాళ్ళమవుతాం" అన్నాడు కిరణ్.

పోలీసు కమిషనరు ఏదో చెప్పాలని నోరు తెరిచారు. ఈ లోపల గదిలో వున్న వైర్‌లెస్ సెట్ నుంచి సంకేతాలు రావటం ప్రారంభమయినాయి.

కిరణ్ సంకేతాలు రిసీవ్ చేసుకున్నాడు.

హైదరాబాద్ నుంచి యింటలిజెంస్ యేజెంట్ మెసేజ్ పంపించాడు. ప్రొఫెసర్ రామచంద్ర పరిశోధన పూర్తయిందట. ఫ్లైట్‌లో ఆ సాయంత్రం బయలేరి ఢిల్లీ వస్తున్నాడట! అతని రక్షణకు హైదరాబాద్ బేగంపేట విమానంలోను పటిష్టమయిన చర్యలు తీసుకొంటున్నామనీ, ఢిల్లీ చేరేసరికి పాలం ఎయిర్‌పోర్టులో అతన్ని క్షేమంగా రిసీవ్ చేసుకోమని దాని సారాంశం.

కిరణ్ మెసేజ్ నోట్ చేసుకున్నాడు.

హోం మినిష్టర్ కిరణ్ వంక చూసి, "ప్రొఫెసర్ రామచంద్ర పరిశోధన రైతులపాలిట కల్పతరువు. ఆయన పంటలకు హాని కలిగించే క్రిమికీటకాదుల నుంచి పంటల్ని రక్షించుకోవటం, దిగుబడి హెచ్చించటం గురించి పరిశోధించి విజయం సాధించారు. ఆ ఫార్ములా మన వ్యవసాయక దేశానికి వరప్రసాదం!" అన్నాడు.

కిరణ్ తలూపాడు.

"నేను వెంటనే హైదరాబాదు వెళ్ళాలి!" అన్నాడు కిరణ్.

"వెంటనే ఏర్పాటు చేస్తాను" అన్నాడు మినిష్టర్ గారి అంతరంగిక కార్యదర్శి.

కిరణ్ వైర్‌లెస్ ఆపరేట్ చేసి హైదరాబాద్ యింటలిజెంస్ బ్యూరోకి మెసేజీ పంపాడు.

మరోగంట తర్వాత హైదరాబాద్ పోయే ఫ్లైట్‌లో కిరణ్ తన సీట్లో వెనక్కి వాలి రిలాక్సింగ్‌గా కూచున్నాడు. అతని మెదడును తొలిచివేస్తున్నాయి ఆలోచనలు.

## 6

పాలం ఎయిర్‌పోర్టులో హోం మినిష్టర్, రక్షణ మంత్రి, పోలీసు కమిషనర్ తక్కిన సిబ్బంది ప్రొఫెసర్ రామచంద్రంకోసం యెదురు చూస్తున్నారు.

హైదరాబాదు నించి వస్తూన్న విమానం ల్యాండయింది.

హోం మినిష్టర్ విమానం దిగుతున్న ప్రొఫెసర్‌ని గుర్తుపట్టి సాదరంగా యెదురువెళ్ళి ఆహ్వానించాడు.

ప్రొఫెసర్ రామచంద్ర హోం మినిష్టర్‌తోను, డిఫెన్స్ మినిష్టర్‌తోను కరచాలనం చేశాడు.

"మీరు క్షేమంగా ఢిల్లీ చేరినందుకు చాలా సంతోషంగా వుంది" అన్నాడు హోం మినిష్టర్.

ప్రొఫెసర్ రామచంద్ర చిన్నగా నవ్వాడు. అతని వయసు ముప్పయి — ముప్పయిఅయిదు మధ్య వుంటుంది. స్ఫురద్రూపి. సూదంటు రాయిలాంటి చూపులు. మనిషిని నించున్న ఫళంగా ఎస్టిమేట్ చెయ్యగల చురుకుదనం తెలివి అతని కళ్ళలో ప్రతిఫలిస్తున్నాయి. గడ్డం మీసాలు బాగా పెరిగిపోయాయి. అవి అతని ముఖానికి వింత అందాన్నిచ్చాయి. తల అక్కడక్కడ నెరిసింది.

చెంపలు కూడా నెరిశాయి. వయసు కన్న పదేళ్ళు ముసలివాడిలా వున్నాడు.

హోంమినిష్టర్ ఎయిర్ పోర్టు బయటికి రామచంద్రాన్ని స్వయంగా తీసుకుని వచ్చాడు. రామచంద్ర చేతిలో ఒక బ్రీఫ్ కేసు తప్ప మరేం లేదు. అందులో ఫార్ములా వుండి వుండాలని అనుకున్నాడు హోం మినిష్టర్.

ఆలో ప్రూఫ్ కారు డోర్ తెరిచి పట్టుకున్నాడు అన్వర్. ముందుగా హోం మినిష్టర్ ఎక్కాడు. తర్వాత రామచంద్ర వంగి కార్లో కూచోబోయాడు.

అయితే యింతలో వూహించని సంఘటన జరిగిపోయింది. ఎక్కడినుంచో నల్లరంగు ప్లిమత్ కారు వచ్చి రామచంద్రాని చటుక్కున లోపలికి లాక్కుని రెప్పపాటులో ఎయిర్ పోర్టు నుంచి రోడ్ మీదికి దూసుకు పోయింది.

అన్వర్ జేబునుంచి రివాల్వర్ తీసి ఆ కారుకి గురి చూసి కాల్చాడు. గుండు టప్ న కిందపడిపోయింది.

"రాస్కెల్స్! బుల్లెట్ ప్రూఫ్ కార్లో వచ్చారు" అన్నాడు అన్వర్ పళ్ళు పటపట కొరుకుతూ.

రక్షణ మంత్రి, పోలీసు కమిషనర్ తక్కిన రక్షణ సిబ్బంది, ఎయిర్ పోర్టు సెక్యూరిటీ సిబ్బంది—అందరూ తమ కళ్ళముందే జరిగిపోయిన ఈ సంఘటనకు నిర్ఘాంత పోయారు. రక్షణ సిబ్బంది ఆ కారును వెంటాడినా లాభంలేకపోయింది.

రక్షణమంత్రి సిబ్బందిమీద కేకలు వేస్తున్నాడు.

## 7

ప్రొఫెసర్ రామచంద్రని తీసుకుపోయిన నల్లరంగు ప్లిమత్ కారు సిటీ లిమిట్సు దాటి మధురా రోడ్ లోని

ఓ పాత బంగళా ముందు ఆగింది. అతన్ని తీసుకుపోతున్న వ్యక్తులు అతని కళ్ళకు నల్లటి గంతులు కట్టి కారునించి కిందికి దింపారు. యెక్కడెక్కడో నడిపించుకుంటూ లోపలికి తీసుకువెళ్ళారు.

ప్రొఫెసర్ రామచంద్ర కళ్ళ గంతులు తొలగించారు. కాసేపు అతనికేమీ కనిపించలేదు. కళ్ళు నులుముకుని చూశాడు. తర్వాత గదిలోని దృశ్యాలు కనిపించాయి.

ఆ గది చాలా పొడవుగా వుంది. గదిలో ఎర్రటి లైట్లు వెలుగుతున్నాయి. అందుకే కాంతి స్పష్టంగా కనిపించటంలేదని గ్రహించాడు రామచంద్ర.

"వెల్కం మై డియర్ ప్రొఫెసర్!" అంటూ ఓ పాతికేళ్ళ యువకుడు యెదురొచ్చాడు.

రామచంద్ర అతని వంక పరిశీలనగా చూశాడు.

"అయామ్ ప్రొఫెసర్ దయానంద్!...." అన్నాడతను నవ్వుతూ.

"ఎస్. ఎస్. యూ ఆర్ ఫ్రం మహారాష్ట్ర! ఐ నో యు ఆర్ డూయింగ్ రిసెర్చి ఆన్ మిక్సెల్ ఆయిల్ ఫ్రం యిండస్ట్రియల్ వేస్ట్స్. ఈజంట్ఇట్?" అన్నాడు రామచంద్ర.

"ఎస్. యు ఆర్ రైట్!" అన్నాడు దయానంద్.

"బట్ వై యు కిడ్నాప్డ్ మి?" అడిగాడు రామచంద్ర.

"అయామ్ ఆల్సో కిడ్నాప్డ్!" అన్నాడు దయానంద్.

సంభాషణ ఆంగ్లంలోనే జరిగింది.

దయానంద్ చెప్పిన సారాంశం ఏమిటంటే, అతన్ని

అపహరించి తెచ్చాక అతను సాధించిన ఫార్ములా యిమ్మని ఒత్తిడిచేశారు — ఇవ్వకుంటే నిర్దాక్షిణ్యంగా చంపేస్తామని బెదిరించారు. ఏ గొడవా చెయ్యకుండా ఇచ్చేస్తే అతనికి పెద్ద మొత్తంలో డబ్బిస్తామని చెప్పారు. అదే తెలివైన పనని నిర్ణయించుకుని దయానంద్ వాళ్ళకు సరెండరయిపోయాడు.

"అయితే, మీరు దేశద్రోహానికే పూనుకున్నారన్న మాట?" అన్నాడు కోపంగా రామచంద్ర.

దయానంద్ పెద్ద పెట్టున నవ్వాడు. "ఈ దేశం కోసం మీ సర్వస్వం అప్పగిస్తే మీకు ఒరిగేదేమిటి? ఏదో అవార్డో మరో బహుమతో వస్తుంది. సో, మీరు పడ్డ శ్రమ వృధా! నన్ను చూడండి. నా ఫార్ములాకి అయిదు లక్షల రూపాయిలిచ్చారు వీళ్ళు! నా సర్వీసెస్ వీళ్ళకు అంకితంచేస్తే నెలకు పదివేల రూపాయలు పారితోషికం ప్రకటించారు. ఇంతకన్న లాభసాటి టరమ్స్ మీరు సంపాదించగలరా — మీరూ వీళ్ళకి సరెండరయిపోతే మంచిది!" అన్నాడు.

రామచంద్రం ఛీత్కారం చేశాడు.

"నీలాంటి దేశద్రోహిని కాను నేను!" గర్జించాడు.

"దేశభక్తితో నిండా మునిగిపోయి నీలాగే ధర్మపన్నాలు, ఉద్రేకపూరితమైన డైలాగులు చెప్పిన ప్రొఫెసర్ ద్వివేది కుక్క చావు చచ్చాడు. ముక్కలు ముక్కలైపోయాడు. బహుశా నీకీ సంగతి తెలిసివుండదు" అన్నాడు దయానంద్.

రామచంద్ర ఆశ్చర్యంగా చూశాడు.

"ప్రొఫెసర్ ద్వివేదిని చంపేశారా?" అన్నాడు బాధగా.

"ఎస్. నీలాగే దేశం, భక్తి అంటూ ఏవో కారు కూతలు కూశాడు. బాస్ చంపేసి దేశానికి బహుమతిగా పంపేశాడు. ఎంతగా ప్రయత్నించినా ఫార్ములా బయట పెట్టలేదు. సీల్డు కవర్ యెక్కడో దాచేశాడు. పోనీ, అప్పటికప్పుడు ఫార్ములా వేసి ఇమ్మన్నాడు బాస్— అయినా అతను మొండికేశాడు. దాంతో చంపి పారేశాడు బాస్" అన్నాడు దయానంద్.

"బాస్ ఎవరు?" అడిగాడు రామచంద్ర.

"అదంతా చిదంబర రహస్యం. ఇక్కడ వున్న వాళ్ళెవరికీ బాస్ నిజ స్వరూపం తెలీదు—తెలిసింది నా ఒక్కడికే!"

"ఇక్కడ యింకా మనలాంటి వాళ్ళున్నారా?"

"ఒకరు, యిద్దరు కాదు. పన్నెండుమంది వున్నారు. నువ్వు పదమూడోవాడివి. పధ్నాలుగోవాడు ద్వివేది. ఇంకా ఆరుగురు సైంటిస్టులు త్వరగానే ఇక్కడికి రాబోతున్నారు—బాస్ ఆతిథ్యం స్వీకరించటంకోసం!"

"ఆ పన్నెండుమందీ ఎక్కడున్నారు?"

"నీ యెదురుగుండానే. వాళ్ళు ఇంకా దేశం, అభిమానం అంటూ బూజుపట్టిన డైలాగులే వల్లిస్తుంటే వాళ్ళని బోనుల్లో బంధించి వేళకి ఇంత తిండి పడేస్తున్నాడు బాస్. వాళ్ళు బతికుండాలికదా, లేకుంటే ఫార్ములా దొరికేదెలా?"

"అంటే అందరూ వెంట ఫార్ములాలు తేలేదా?"

"కొందరు తెచ్చారు. ఎక్కువమంది తేలేదు. తెచ్చిన ఆ కొద్దిమందీ తెలివిగా కోడ్ భాషలో ఫార్ములా రాసి తెచ్చారు. అది 'డీకోడ్' చెయ్యమంటే చెయ్యటం లేదు. చూస్తానన్నావు కదూ అదిగో ఆ చుట్టూ వున్న

బోనుల్లో వున్నారు చూడు....” లైట్స్ ఆన్ చేశాడు దయానంద్.

ఇనప బోనుల్లో పులుల్ని, సింహాల్ని బంధించినట్లు సైంటిస్టుల్ని బంధించి వుంచారు. వీళ్ళెంత రాక్షసులు! అనుకున్నాడు రామచంద్ర.

రామచంద్ర వాళ్ళందర్నీ పరీక్షగా చూశాడు. చిక్కి శల్యమై గడ్డాలు, మీసాలు బాగా పెరిగిపోయి తైల సంస్కారంలేని జుట్లతో పిచ్చి వాళ్ళ లా వున్నారు శాస్త్రజ్ఞులు.

దేశభక్తి వాళ్ళ నరనరాన ప్రవహిస్తోంది. యెన్నో కష్టాలు భరించటానికైనా సిద్ధంగా వున్నారుగాని, తమ పరిశోధనా ఫలితాలను స్వార్థపరుల చేతికి దొరకనివ్వని ఆ శాస్త్రజ్ఞులు సిద్ధిపొందిన మహర్షుల్లా కనిపించారు రామచంద్రకు.

“మిమ్మల్ని కన్నందుకు భారతమాత జన్మ తరించింది” అనుకున్నాడు రామచంద్ర — కళ్ళు దేశభక్తితో జల పూరితాలు కాగా.

దయానంద్ లైట్స్ తీసేశాడు. యెప్పటిలాగే జీరో వాట్ బల్బులు యెర్రటి కాంతుల్ని విరజిమ్ముతున్నాయి. కళ్ళు డిమ్‌గా కనిపిస్తున్నాయి.

రామచంద్ర దయానంద్ వంక తిరిగి “చూశావా, ఇంతమంది దేశభక్తులముందు నీ దేశద్రోహం యెలా వెలవెలబోతోందో? వీళ్ళందరూ పిచ్చివాళ్ళయ్యే తమ పరిశోధనా ఫలితాల్ని అమ్మకోలేదా? వీళ్ళలో స్వార్థం మచ్చుకైనా లేదు. దేశంకోసం తమ ప్రాణాల్ని సయితం అర్పించటానికి సిద్ధంగా వున్నారు....” అని రామచంద్ర చెపుతుండగానే కోపంగా వారించాడు దయానంద్.

"నీ కథలు వినటానికి టైంలేదు. నీ ఫార్ములా మాకు అప్పగించి పారితోషికం తీసుకుంటావా లేక వీళ్ళతో నీ సరదాగా సహవాసం చేస్తావా?" అన్నాడు.

రామచంద్ర కాసేపు మౌనం వహించి, "ముందీ విషయం చెప్పు. నువ్వు, సక్సేనా పద్ధతుల్లోనే నీ పరిశోధన చేశావని విన్నాను — సక్సేనాను కూడా వీళ్ళు బంధించి తెచ్చారు. అంటే అతని ఫార్ములా వుండగా మళ్ళీ నీ ఫార్ములా యెందుకావలసి వచ్చింది?" అన్నాడు.

దయానంద్ సమాధానం చెప్పటానికి తడబడ్డాడు.

"సక్సేనా ఫార్ములా ఇవ్వటానికి తిరస్కరించాడు. అందుకే నన్ను కిడ్నాప్ చేసి తెచ్చారు. ఆ బోనుల్లో ప్రొఫెసర్ సక్సేనా లేరు, చూడు" అన్నాడు.

"ఆయన్నేం చేశారు?"

"ప్రస్తుతం పోలీసులకి బహుమతిగా పార్సిల్ చెయ్యబడుతున్నాడు" అన్నాడు దయానంద్ వ్యంగ్యంగా నవ్వుతూ.

రామచంద్ర మౌనంగా ఏదో ఆలోచిస్తున్నాడు.

"మై డియర్ ప్రొఫెసర్! డోంట్ వేస్టు టైం! ఫార్ములా సంగతి తేల్చు" అన్నాడు దయానంద్.

"ఆ విషయం మీ బాసేతోనే మాట్లాడుతాను."

"మా బాస్ ఆ పని నాకే అప్పగించారు."

"కానీ నేను మీ బాస్‌ని చూడాలి!"

"నేను చెప్పేది అర్థం కావటంలేదా?"

"బాగా అర్థమయింది. మీ బాస్‌తోనే టరమ్స్ మాట్లాడుతాను!"

దయానంద్ కోపంగా రామచంద్ర చేతిలోని బ్రీఫ్

కేస్ లాక్కోబోయాడు. రామచంద్ర దాన్ని అందనివ్వకుండా పైకి పట్టుకున్నాడు. అయితే అతని చేతిలోని బ్రీఫ్ కేసు వెనకనుంచి ఎవరో లాగేశారు.

రామచంద్ర చటుక్కున వెనుతిరిగి చూశాడు. తనను దార్లో కిడ్నాప్ చేసిన యిద్దరిలో అతనొకడు! బ్రీఫ్ పట్టుకుని లోపలి గదుల్లోకి వెళ్ళిపోయాడు.

"ఏయ్, అదిలా యివ్వు!" అరిచాడు రామచంద్ర.

దయానంద్ వికటంగా నవ్వాడు. "పోనీ కష్ట పడ్డావు గదా డబ్బిచ్చి కొనుక్కుందామంటే వద్దన్నావు. ఇప్పుడు నువ్వు కూడా మిగిలుండవు" అన్నాడు.

"ఇందులో వున్న ఫార్ములాలు నిజమైనవి కావని బాస్ చెప్పారు" అన్నాడు, బ్రీఫ్ కేస్ తీసుకుపోయిన వ్యక్తి దాన్ని తెచ్చి అక్కడ పడేస్తూ

ప్రొఫెసర్ రామచంద్ర పగలబడి నవ్వాడు. "ఫార్ములా దేశద్రోహుల చేతుల్లో పెట్టటానికి యీ రామచంద్ర తెలివితక్కువవాడు కాదు" అంటూ మళ్ళీ పడిపడి నవ్వాడు.

దయానంద్ రివాల్వర్ తీసి రామచంద్రకు గురి చేశాడు.

"చెప్పు, అది ఎక్కడ దాచావో చెప్పు. లేదా, పేపర్ మీద ఫార్ములా వ్రాసి యివ్వు. లేకుంటే నిర్దాక్షిణ్యంగా చచ్చిపోతావు."

రామచంద్రరావు నవ్వటం ఆపి, "వీళ్ళందరూ ఫార్ములా యివ్వలేదు. కనీసం తర్వాతనయినా పేపరు మీద రాసివ్వలేదు. వీళ్ళందర్నీ చంపెయ్యకుండా ప్రాణాలతో నే వదిలేశావేం?" అన్నాడు.

దయానంద్ తడబడ్డాడు.

"వాళ్ళు ఏనాటికయినా ఫార్ములాలు యిస్తారనే ఆశతోనే వాళ్ళకింత తిండిపెట్టి ప్రాణం పోకుండా చూసుకుంటున్నావు — అవునా?" అన్నాడు రామచంద్ర.

దయానంద్ రివాల్వర్ జేబులో పెట్టేసుకున్నాడు. "అయితే చెప్పనంటావు, అంతేనా?" అన్నాడు.

రామచంద్ర మాట్లాడలేదు.

"అతను ప్రొఫెసర్ రామచంద్ర అయితే కదా ఫార్ములా చెప్పటానికి?" అన్న మాటలు వినిపించాయి వెనుకనించి.

రామచంద్ర తుళ్ళిపడి చూశాడు.

అక్కడ ఓ వృద్ధుడు చిరునవ్వు నవ్వుతూ నిల్చుని వున్నాడు.

"ఏమంటారు ది గ్రేట్ డిటెక్టివ్ కిరణ్?" అంటున్నాడా వృద్ధుడు.

అంతవరకు ప్రొఫెసర్ రామచంద్ర వేషంలో వున్న కిరణ్ మందహాసం చేశాడు. వేషం తీసేసి నిల్చున్నాడు.

"నీ రోజులు దగ్గరపడ్డాయంటాను మై డియర్ ప్రొఫెసర్ సక్సేనా!" అన్నాడు డిటెక్టివ్ కిరణ్.

వృద్ధుడి చేతిలోని 'గోల్డు మిస్టు' సిగరెట్. చటుక్కున క్రిందపడిపోయింది అదురుపాటుతో.

"అయితే, కనిపెట్టేశావన్న మాట!"

"ఇప్పుడు కాదు, నీ యింట్లోనే కనిపెట్టాను. వృద్ధ నౌఖరు వేషంలో నీ యింట్లో నువ్వే నౌఖరుగా వ్యవహరించినప్పుడే ఆ వృద్ధుడు నువ్వేనని గ్రహించాను. నన్ను స్పృహ తప్పించటానికి ఇనపరాడ్‌తో నువ్వు కొట్టడమూ చూశాను. నీ లాబరేటరీ చూశాక నీ పరిశోధన అంతా

బోగస్ అని గ్రహించాను. లాబ్‌లో నీవు కాల్చిపారేసిన 'గోల్డు మిస్టు' సిగరెట్టు పీకల్ని చూశాక నా అనుమానం మరింత బలపడింది.

నువ్వు వృద్ధుడిగా ఎంత బాగా వేషం వేసినా, నీ శరీర దారుఢ్యం, నీ డేగ కళ్ళు నాకు నువ్వే సక్సేనా అని చెప్పక నే చెప్పేశాయి. అప్పుడే ప్లాన్ చేసుకున్నాను—నీ స్థావరం ఢిల్లీలోనే యెక్కడో వుందనీ! బహుశా నీ లాబ్ నుంచే దానికి మార్గం వుండి వుండొచ్చని!

నీ యింట్లో రెండు గదులు తాళం పెట్టి వున్నాయి. వాటి గురించి అడిగితే నువ్వేదో చెప్పి తప్పించేశావు. నేను వాటి పక్కగా వెళ్తూ లోపలికి తొంగి చూశాను. కిటికీతలుపులు తీసేవున్నాయి. రూంస్ నీట్‌గావున్నాయి. సరిగ్గా అదే సమయంలో గదికి ఓ మూలనున్న గోడల అలమర కదిలింది. అంటే అదే నీ రహస్య స్థావరానికి మార్గమన్నమాట! కాని నువ్వు నే నది కనిపెట్టేస్తానని భయంతో చటుక్కున రాడ్‌తో కొట్టి స్పృహతప్పించావు. కాని అప్పటికే నేను కనిపెట్టేశాను. యేమీ యెరగనట్టు మళ్ళీ నాతోపాటు నాకు బస యిచ్చిన గెస్టు హౌస్‌కి డాక్టర్ని వెంటబెట్టుకుని వచ్చావు—అన్వర్‌తో కలిసి! నేను యిక్కడికొచ్చేవరకు నేనే రామచంద్రనని పొరబడ్డావు.

"నేను హైదరాబాదు వెళ్ళి రామచంద్రని బయల్దేరకుండా నిలిపి, నేనే అతని వేషంలో బయల్దేరి వచ్చాను. నీ మనుషులు నేనే రామచంద్రగా నమ్మి యిక్కడికి తీసుకొచ్చారు. నీ స్థావరం ఢిల్లీకి ఏ దిశలో వుందో, మధురా రోడ్‌లో ఎన్ని కిలోమీటర్ల తర్వాత వస్తుందో

అన్నీ నేను కార్లో వస్తూనే ఎస్టిమేట్ చేశాను....

నువ్వు చేసిన మరో పొరపాటు నా కోటుజేబులోని నీ ఆధారాల్ని నాశనం చెయ్యటం! ప్రొఫెసర్ ద్వివేది యింట్లో నీ సిగరెట్టుపీక దొరికింది. ఎందుకయినా మంచి దని జాగ్రత్త పెట్టాను. నీ ఇంట్లో టేబిలు కింద అలాంటివే మరికొన్ని చూడగానే ద్వివేదిని కిడ్నాప్ చేసిందీ, సక్సేనాని కిడ్నాప్ చేసిందీ ఒకరేనని అర్థం చేసుకుని అవికూడా సేకరించాను. నీ డ్రాయరు సొరుగులో 'గోల్డు మిస్టు' సిగరెట్టుప్యాకెట్లు చూశాక, నేరస్థుడివి నువ్వేనని అనుమానం వచ్చింది. పరీక్షగా చూడగా నీ హాల్లోని నీ ఫోటోలో పోలికలు నీ వృద్ధవేషంలో దొరికిపోయాయి.

మిస్టర్ సక్సేనా! నీ మాతృభూమికి, విదేశీయులతో కుట్ర ద్రోహం తలపెట్టాలనుకున్నావు. అది మంచి పనికాదు. ఈ శాస్త్రజ్ఞులు రాత్రింబవళ్ళు నిద్రాహారాలు మాని చేసిన ప్రయోగాల ఫలితాలను తమ మాతృదేశ సౌభాగ్యంకోసం వెచ్చించటానికి సిద్ధమవుతున్న తరుణంలో వారినుంచి ఆ ఫలితాలను దౌర్జన్యంగా హస్తగతం చేసుకుని విదేశీయులకి అమ్ముకోవాలని చూసిన నీ నేరం క్షమించరానిది! నువ్వు యీ శాస్త్రజ్ఞులకి ఒంటరిగా చిక్కితే నీ శరీరంలోని ప్రతిఅణువుని వేరుచేసేసి లాబరేటరీస్‌లో పరీక్ష చేస్తారు. నువ్వంతటి మాతృద్రోహివి!...."

అని కిరణ్ అంటుండగా కోపంతో గర్జించాడు సక్సేనా. "స్టాప్ దట్ నాన్సెన్స్! నిన్ను చంపకుండా రెండుసార్లు బెదిరించి వదిలేశాను కాని, యిప్పుడు నా రహస్యాలన్నీ తెలిసిన నిన్ను ప్రాణాలతో వదలను" అంటూ రివాల్వర్ గురి చూసి కాల్చబోయాడు.

కిరణ్ వెంటనే అరిచి చెప్పాడు: "ద్వివేది, రామ

చంద్రల ఫార్ములాలు నా దగ్గరే వున్నాయి. అవి తీసు కోవా?" అనడిగాడు.

సక్సేనా ఒక్కక్షణం ఆగాడు. ఆ క్షణం చాలు, కిరణ్ కి. వంగి కాలి సాక్సులో దాచిన రివాల్వర్ అందు కుని సక్సేనా చేతికి గురిచూసి కాల్చాడు. సక్సేనా రివాల్వర్ ఎగిరి అవతల పడింది.

ఈలోపల దయానంద్ కోటు జేబునుండి రివాల్వర్ తీసి కాల్చబోయాడు. కాని కిరణ్ మెరుపు వేగంతో అతని చేతిలోని రివాల్వర్ ని కాలితో తన్నేశాడు.

వెనుకనుంచి మరో యిద్దరు వ్యక్తులు—కిరణ్ ని కార్లో తెచ్చినవాళ్ళు—వచ్చి వాటేసుకున్నారు. కిరణ్ చేతి లోని రివాల్వర్ ఎగిరి దూరంగా పడింది.

కిరణ్ తనని వాటేసిన యిద్దర్లో ఒకడ్ని పూని మెడ మీద కొట్టాడు. మెడ నరాలు పటపట మన్నాయి. రెండోవాడి కాలిమీద బూటుకాలితో గట్టిగా తన్ని కింద పడేశాడు.

ఇంతలో, "బాస్, పోలీసులు వస్తున్నారు...." అని చెప్పటానికి లోపలికొచ్చిన వ్యక్తి కిరణ్ ని గుర్తుపట్టి కంగారుగా రివాల్వర్ గురిచేసి కిరణ్ ని కాల్చబోయాడు. కాని కిరణ్ తన చేతిలో వున్న రెండోవ్యక్తిని అడ్డు పెట్టేశాడు. గుండు తగిలి వాడు గిలగిల లాడుతూ పడి పోయాడు.

"అన్వర్! నీ నిజస్వరూపం నాకిదివరకే తెలుసు. పారిపోవటానికి ప్రయత్నించకు!" అని అరిచాడు కిరణ్—తనకి రివాల్వర్ కాల్చిన వ్యక్తి నుద్దేశించి.

మరోసారి కాల్చబోయిన అన్వర్ చేతిలోని రివాల్వర్ ఎగిరి దూరంగా పడింది.

"అబ్బా!" అంటూ గాయపడిన చేతిని మరో చేత్తో పట్టుకుని పారిపోబోయాడు.

ఎదురుగా పోలీస్ కమిషనర్ చేతిలోని రివాల్వర్ పొగలు కక్కుతోంది, చుట్టూ పోలీసులు!

"డర్టీ డాగ్! ప్రభుత్వంలోని కీలకమైన స్థానంలో ఉద్యోగం చేస్తూ దేశానికింత ద్రోహం చేస్తావా?" అంటూ నిప్పులు కక్కుతున్నాడు కమిషనర్ ఆఫ్ పోలీసు అన్వర్ చౌకా కాలరుపట్టి పైకి లేపుతూ.

పోలీసులు సక్సేనా స్థావరాన్ని పూర్తిగా చుట్టుముట్టేశారు. అతని అనుచరులతో బాటు దయానంద్ ని అతన్ని అరెస్టు చేశారు. శాస్త్రజ్ఞులందర్నీ ఇనుప బోనుల నుంచి విముక్తుల్ని చేశారు.

సైంటిస్టులంతా డిటెక్టివ్ కిరణ్ వంక అభినందన పూర్వకంగా చూసి, "యూ ఆర్ రియల్లీ పాట్రియాటిక్!" అన్నారు. అందులో దేశంలోని వివిధ రాష్ట్రాల నుండి అపహరింపబడ్డ శాస్త్రజ్ఞులున్నారు.

"నో నో, నేను కాదు. చావుకికూడా భయపడకుండా ఎదురునిలిచి మీ కృషి ఫలితాల్ని పరాగతం చెయ్యని మీరే నిజమయిన దేశభక్తులు! ప్రొఫెసర్ ద్వివేది మనందరకు మార్గదర్శకులు!" అన్నాడు కిరణ్ వాళ్ళతో ఆప్యాయంగా కరచాలనం చేస్తూ.

"నేను సక్సేనా స్థావరంలో దిగుతూనే నా వాచీ కున్న ఎలక్ట్రానిక్ సదుపాయంవల్ల పోలీస్ కమిషనర్ కి మెసేజ్ పంపాను. సమయానికొచ్చి సక్సేనా ఆట కట్టించారు" అన్నాడు డిటెక్టివ్ కిరణ్, రిలాక్స్ గా నవ్వుతూ.

—:సమాప్తం:—

# కసి

## టెంపోరావ్

ట్రాడర్స్ గేటు హోటల్ 30 నంబరు గదిలో కూర్చుని స్కాచ్ విస్కీ ఒంటరిగా అతను సేవిస్తున్నాడు. గదిలో ఫ్లోరసెంట్ లైట్ ప్రకాశవంతంగా వెలుగుతోంది. టైమ్ చూశాడు. పది కావస్తోంది.

టెలిఫోన్ మ్రోగింది. అతడు రిసీవర్ని అందుకున్నాడు.

“పవన్ కుమార్,” అన్నాడతడు.

“హోటల్ రిసెప్షన్ సార్! మీ కోసం ఒక యువతి వచ్చింది. పేరు మాలతి. పైకి పంపమంటారా?”

“వెంటనే పంపండి,” అని అతను రిసీవర్ని పెట్టేశాడు.

సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ సోఫాలోంచి లేచి తలుపు లాక్ తీసివుంచాడతను.

కాసేపట్లో ఎవరో తలుపును తట్టారు. “కమిన్,” అన్నాడతను.

ఆమె లోపలకు వచ్చింది. అతడు తలుపు మూసి లాక్ చేశాడు.

నిషా యెక్కిన కళ్ళతో క్షణకాలం ఆమెవంక చూశాడు. తను చూసిన ఫోటో కంటె సజీవంగా తన ముందు నిలబడిన ఆమె చాలా అందంగా వుంది.

నీలంరంగు ప్రింటెడ్ సిల్కు చీర, మాచింగ్ జాకెట్. కాళ్ళకు గ్రీన్ స్లిప్పర్స్. నుదురుమీద అదే రంగు బొట్టు. పొడుగాటి జడ. ఆమె బొడ్డు కనిపిస్తోంది. అతడి చూపు పైకి వెళ్ళింది.

ఆమె కళ్ళు మెరుస్తున్నాయి, ఆమె వయసు యిరవై లోపున వుంటుందేమో!

"హలో!" అన్నాడు.

"హలో," అందామె.

"ఎలా వుంది నా గదిలో?"

"ఫైన్," అందామె.

అతడామెను సోఫాలో కూర్చోమన్నాడు.

"విస్కీ తాగుతావా?"

"కొంచెం," అందామె.

మరో గ్లాసులో అతను విస్కీ పోసి, ఐస్ క్యూబ్స్ వేసి కొద్దిగా సోడా కలిపాడు. గ్లాసును ఆమెకు అందించాడు.

"చియర్స్!" అని యిద్దరూ తాగసాగారు.

గ్లాసులో మళ్ళీ విస్కీ పోసుకుని, కొంచెం తాగి అతడామెవంక చూశాడు. ఆమె కిలకిల నవ్వింది.

"నువ్వు తరచు యీ హోటల్‌కి వస్తూంటావా?"

"ఇదే మొదటిసారి రావడం," అందామె.

"రియల్లీ?"

ఆమె మాట్లాడలేదు. గ్లాసులోని విస్కీని గడగడ తాగేసింది. అతను మళ్ళా పోయబోయాడు.

"ప్లీస్, వద్దు!" అందామె.

టెలిఫోన్ మ్రోగింది. అతడు రిసీవర్ని తీసుకున్నాడు.

"హాలో, పవన్."

"రామ్‌జీ!" అందో కంఠం అటువైపు నుంచి.

"రామ్‌జీ, ఐయామ్ యిన్ హెవన్!"

"ఎప్పటినుంచి?"

"తొమ్మిది నుంచి!"

"మైడియర్ ఫ్రెండ్, పానకంలో పుడకలా నీ హెవన్‌లోకి నేను రావడం యిష్టంలేదు. రేపు ఫోన్ చేస్తాను."

అటువైపున రిసీవర్ పెట్టివేయబడింది. ఏర్ కండిషండ్ గదిలో చల్లగా వుంది. అతడు తూల్తూ ఎటాచ్డ్ బాత్ రూమ్‌వైపు వెళ్ళాడు. పడిపోతాడేమో అని భయపడి ఆమె అతడిని పట్టుకొంది.

"యూ ఆర్ నైస్ గర్ల్!" అన్నాడతను.

అతడు బాత్‌రూమ్‌లోకి వెళ్ళి తిరిగొచ్చాడు. ఆమె సోఫాలో కూర్చుని ఆలోచిస్తోంది. తనకోసం 500 అతడు యెందుకు చెల్లించాడు? తను వచ్చినా అతడింకా తాగుతూనే వున్నాడు. మరికొంచెం తాగితే అతను ఒళ్ళు తెలియకుండా నిద్రపోతాడు.

టెలిఫోన్ మ్రోగడం విని ఆమె తృళ్ళిపడింది.

"హాలో, పవన్," అన్నాడతను.

"డిన్నర్, సార్?" అ పక్క నుంచి అడిగాడు. హోటల్ గుమాస్తా.

అతడు ఆమెవైపు చూశాడు.

"డిన్నర్ యిక్కడికి తెమ్మంటాను!"

"అలాగే చెయ్యండి."

అతడు చెప్పి రిసీవర్ పెట్టేశాడు. క్షణకాలం ఆమె వైపు నవ్వుతూ చూశాను.

"నీ పేరు మాలతిగా?" అడిగాడు.

ఆమె తలాడించింది.

"మంచి పేరు. నువ్వు నాకు చాలా నచ్చావు. నేను నీకు నచ్చానా?"

"ఎందుకదంతా?" అడిగిందామె, అతడివైపు చూస్తూ.

అతడు పొడుగ్గా, సన్నగా వున్నాడు. తలమీది జుత్తు సగంపైన రాలిపోయింది. వయస్సు నలభైపైన వుండొచ్చు. ఖరీదయిన పాంటు, స్లాక్ ధరించాడు. చేతికి అందమైనసీకో వాచ్ వుంది. "కంహియర్!" అన్నాడతను.

ఆమె అతడి ముందుకు వెళ్ళింది. తనవైపు ఆమెను తటాలున లాగాడు. ఆమె అతడి ఒళ్ళో పడింది. అతడి చేతులు ఆమెను బలంగా చుట్టేశాయి. ఆమె మెడమీద ముద్దెట్టుకున్నాడతను.

ఎవరో తలుపును తట్టారు.

"నే వెళ్ళి చూస్తాను," అని వెళ్ళి లాక్ తీసిందామె.

హోటల్ బేరర్ చక్రాల టేబుల్ను తోసుకుంటూ లోపలకు వచ్చాడు. ఒకచోట టేబుల్ను వుంచి రెండు వైపులా కుర్చీలు అమర్చాడు.

"కమ్ యిన్ ది మోర్నింగ్!" అన్నాడతను.

"యస్సార్," అని అతడు వెళ్ళిపోయాడు.

ఆమె తలుపుమూసి, లాక్ చేసి, మెల్లిగా వెళ్ళి సోఫాలో కూర్చుంది.

అతడు గ్లాసులో మళ్ళా విస్కీ పోసుకున్నాడు. ఆమె వూరుకొంది. అతడు ఎక్కువ తాగితే తనకు నష్టంలేదు. సుఖంగా రాత్రి పడుకుని పొద్దుట ఆరింటికి వెళ్ళి పోవచ్చు!

ఎనిమిది గంటలపాటు తను అతడితో వుండాలి! అంతే!

నిమిషాలు గడుస్తున్నాయి. డిన్నర్ ముగిస్తే తర్వాత నిద్రపోవచ్చు. ఆలోచిస్తూ అతడి వంక చూసింది.

"భోజనం చేద్దామా?" అని అడిగింది.

"పారిస్‌లో పన్నెండు దాటాక తింటారు" అన్నాడతను.

అతడి మాటలు ముద్దగా వెలువడుతున్నాయి.

"మనం ఇప్పుడు పారిస్‌లో లేం. మద్రాసులో వున్నాం" అందామె నవ్వుతూ.

"అవును, మర్చిపోయాను. లెటస్ యీట్!" అని లేచాడతను.

కింద పడబోయాడు. పట్టుకుని తీసుకువెళ్ళి ఆమె కుర్చీలో కూర్చోబెట్టింది. రకరకాల పదార్థాలు వున్నాయి. అతడు తినలేక తింటూ, చిలిపిగా నవ్వుతూ కూర్చున్నాడు. ఆమె ఆకలితో తిని చేయి కడుక్కుంది.

అగాడిని తీసుకెళ్ళి పరుపుమీద పడుకోబెట్టింది. స్విచ్ చీకటిలో తడుముకుంటో పరుపు వైపు నడిచింది. పరుపు మీద పడుకొని పక్కనున్న స్విచ్ నొక్కింది. జీరో వాట్ బల్బు డిమ్‌గా వెలిగింది.

పక్క పడుకున్న అతడివైపు చూసిందామె. కళ్ళు మూసుకుని అతడు నిద్రపోతున్నాడు. అంతగా తాగిన వాళ్ళు పొద్దుటదాకా లేవరు. ఆమె ఆలోచిస్తూ వుండి

పోయింది. తను వెళ్ళిపోతే అతడు గుర్తించడు!

పొద్దుట ఏ టైములో అతడు లేస్తాడు. అరింటికి తను వెళ్ళిపోయిందని అతడనుకుంటాడు. తను ఇప్పుడే పోవచ్చు!

ఆమె టైమ్ చూసింది. ఇంకా పన్నెండు కాలేదు. ఆమె లేచింది. తన హేండ్ బాగ్ తీసుకుని, లాక్ తీసి, బయటకు నడిచి తలుపు దగ్గరగా మూసింది. నడవలో యెవ్వరూ లేరు. నడవమ్మట వేగంగా నడిచి ఆమె వెళ్ళిపోయింది.

కొద్దిగా తెరచిన తలుపు వెనకనుంచి 20 నంబరు గదిలో వుండే వ్యక్తి ఆమె వెళ్ళడం మౌనంగా గమనించాడు.

పదిప్రాంతంలో ఆమె ఆ గదిలోకి వెళ్ళడం అతడు చూశాడు. ఇంత రాత్రి వేళ ఆమె వెళ్ళిపోతోంది!

అతను మెల్లిగా నడవలో కొచ్చాడు. యెదురుగా వున్న 30 గదివైపు కదిలాడు. తలుపును తోశాడు. తెరుచుకుంది. గుమ్మందాటి నిలబడి గది నలువైపులా చూశాడు.

జీరోవాట్ బల్బు వెలుగుతోంది. అతడు బయటకొచ్చి తలుపు మూసి లాక్ చేశాడు. మెల్లిగా 30 నంబరు గదిలోకెళ్ళి, తలుపుమూసి లాక్ చేసి, స్విచ్ నొక్కాడు.

ఫ్లోరసెంట్ లైట్ వెల్గింది. చక్రాల టేబుల్ మీద ఎన్నో పదార్థాలు వున్నాయి. వాళ్ళు తినలేదేమో!

అతడు వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు. స్కాచ్ విస్కీ బ్లాక్ డాగ్ బాటిల్ వైపు చూశాడు. అందులో కొద్దిగా విస్కీ వుంది. టీపాయిమీద రెండు గ్లాసు

లున్నాయి.

ఇద్దరూ తాగేరన్నమాట! అతడు లోలోపల నవ్వు కున్నాడు.

ఒక గ్లాసులో విస్కీ పోసి, పక్క నే కూల్ బాక్స్‌లో వున్న ఐస్ క్యూబ్స్ పడేశాడతను. సిగరెట్ పొగపీల్చి, వదుల్తూ, విస్కీ తాగుతూ కూర్చున్నాడతను.

## 2

విస్కీ బాటిల్ ఖాళీ అయింది. అతడు సోఫాలోంచి లేచాడు. పరుపుమీద నిద్రపోతున్న వ్యక్తివైపు చూశాడు. ధనవంతుడిలా అగుపిస్తున్నాడతను.

అతడు వెనక్కి తిరిగాడు—వెతుకుతూ గదినలువైపులా తిరిగాడు. ఒక టేబుల్‌మీద లెదర్ పెట్టె, పక్కనే బ్రీఫ్‌కేసు వున్నాయి. వాటిని తెరిచిచూశాడు. లెదర్ బాక్స్‌లో బట్టలుమాత్రం వున్నాయి. కాని బ్రీఫ్ కేసులో వందరూపాయల నోట్లు కట్టలు కట్టలుగా వున్నాయి.

ఒక బీరువా ఎడంవైపు వుంది. అక్కడకు వెళ్ళి అతను తెర్చిచూశాడు. రెండు సూట్లు, కొన్ని షర్టులు, స్లాక్స్ హేంగర్స్‌నుంచి వేళ్ళాడుతున్నాయి.

బీరువాలో రెండు స్కాచ్ విస్కీ బాటిల్సు వున్నాయి. అతను ఒక బాటిల్ను తెరిచి, మెల్లిగా వెళ్ళి టీపాయిమీద వుంచాడు. అక్కడున్న ఖాళీ బాటిల్ను గోడవారగా వున్న టేబుల్‌కింద పెట్టాడు.

తిరిగొచ్చి అతడు సోఫాలో కూర్చున్నాడు. గ్లాసులో విస్కీ పోసి, ఐస్ క్యూబ్స్ వేసుకుని మెల్లిగా తాగుతూ కూర్చున్నాడు.

అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి.

లాడర్స్ గేటు హోటల్ చాలా పెద్దది. రాత్రిళ్ళు గదుల్లో వున్న వాళ్ళను యెవ్వరూ డిస్టర్బ్ చెయ్యరు!

బాటిల్లోని విస్కీని సగంవరకూ అతడు తాగేశాడు. కాని అతడికంతగా నిషాలేదు.

నిమిషాలు గడుస్తున్నాయి. టైమ్ రెండు దాటింది. పరుపుమీద పడుకున్న పవన్ కుమార్ అమాంతంగా లేచి కూర్చున్నాడు.

సోఫాలో కూర్చున్న తను లేచి అతడిముందుకు వెళ్ళాడు. అతడివైపు సూటిగా చూశాడు.

"ఎవరు నువ్వు? నా గదిలో ఏం చేస్తున్నావ్?" ప్రశ్నించాడు పవన్.

"మిస్టర్, నోరు మూసుకుని కూర్చో! యెక్కువగా మాట్లాడితే పళ్లూడ్తాయి" అన్నాడతను.

పవన్ కుమార్ గదినలువైపులా చూశాడు. తన యెదురుగా నిలబడినవాడు గూండాలా వున్నాడు. తను ధైర్యంగా ప్రవర్తిస్తే అతడు భయపడి పారిపోవచ్చు!

పవన్ పరుపుమీదనుంచి అటువైపుకు చూశాడు. పరుపు కిందున్న పిస్టల్ని చేతిలోకి తీసుకున్నాడు.

పిస్టల్ని అతడివైపు గురిపెట్టాడు.

"యూ బాస్టర్డ్ యిప్పుడు చెప్పు! యెవరు నువ్వు?" పవన్ అడిగాడు.

"నా పేరు నీకు తెలియదు. నేను చెప్పినా నీకు ఉపయోగపడదు" అన్నాడతను.

"ఈ గదిలో ఒక యువతి వుండాలి — ఆమె ఏమైంది?"

"బాత్ రూంలో వుంది!"

పవన్ కుమార్ వెనకనున్న బాత్ రూమ్ వైపు

చటుక్కున తిరిగాడు. పరుపుమీదున్న తలగడను అమాం తంగా అతడి చేతివైపు విసిరాడతను.

పిస్టల్ కిందపడింది. అతడు పవన్ వైపు పరుపుమీద నుంచి దూకాడు. వంగి కిందపడిన పిస్టల్ని తీయబోతున్న పవన్ చేతిని గట్టిగా పట్టుకుని, బలంగా లాగాడు.

పిస్టల్ దూరంలో వుంది. పవన్ భయంతో అతడి వైపు చూశాడు.

"ఆ పిల్ల నిన్ను నా గదిలోకి రానిచ్చి వుండాలి. ఆమె చీట్!" అన్నాడు పవన్.

"ఆమె చీట్ కాదు. తలుపు తెర్చి ఆమె నన్ను యిక్కడకు రమ్మనలేదు. ఆమె వెళ్ళిపోయింది. తలుపు తెర్చి వుంది. నా అంతట నేనే వచ్చాను" అన్నాడతను.

"అయిందేదో అయింది. నీకేం కావాలి? డబ్బా?"

"ఈ లోకంలో మనుషులకు డబ్బు తప్ప మరేదీ అక్కరలేదని నువ్వు భావిస్తున్నావా?" బులెట్‌లా ప్రశ్నించాడతను.

"లోకంలో డబ్బుకంటె విలువైనది ఏముంది?" అడిగాడు పవన్‌కుమార్.

అతడు పవన్ వంక కోపంగా చూశాడు.

"మా ఊళ్లో ఒకతను నీలాగే డబ్బే సర్వస్వం అనుకునేవాడు. అది నిజంకాదని అతడు ఆలస్యంగా తెల్సుకున్నాడు, ప్రాణంపోయేముందు!"

పవన్ మాట్లాడలేదు. ఏం చెప్పాలా అని చూస్తున్నాడు.

"నీ గదికి రావడానికి ఆ యువతికి యెంతిచ్చావు?"

"ఐదువందలు."

"నీ చేతిలో డబ్బుంది. ఆ డబ్బుతో వస్తువులను

కొన్నట్లు ఆడవాళ్ళను నువ్వు కొంటూ వుంటావు. ధన మదంతో విర్రవీగుతూ అది తప్పని నువ్వీ జీవితంలో నేర్చుకోవు!"

పవన్ మెదడు వేగంగా పనిచేయసాగింది. వీడెవడో గాని ధనవంతులమీద పగబట్టిన వ్యక్తిలా వున్నాడు. అతడిని తృప్తిపర్చి తన ప్రాణాన్ని కాపాడుకోవాలి!

పవన్ చెంపలు వాయించుకున్నాడు. "నువ్వు చెప్పింది నిజం! నాకు గొప్ప సత్యాన్ని నువ్వు చూపించావు. ఈ లోకంలో ముఖ్యమైనది డబ్బు కాదు!" అన్నాడు పవన్.

అతడు విచిత్రంగా నవ్వాడు.

"నన్ను చూసి భయపడి నీ నమ్మకాన్ని మార్చుకున్నావా?"

"భయంవలన కాదు. నీ మాటల్లోని నిజాన్ని నేను గ్రహించాను. ఈ క్షణంలో నాలో వచ్చిన మార్పు ఈ జీవితంలో పోదు!"

"నా కత్తికి బలైపోవలసిన వ్యక్తిని అతడిలో సంభవించిన పరివర్తన కాపాడింది!" అన్నాడతను పిశాచంలా.

సమీపంలో వున్న టేబుల్ దగ్గరకు అతను నడిచాడు. బ్రీఫ్ కేసును చేతిలోకి తీసుకున్నాడు.

"ఇందులో చాలా డబ్బుంది. తిండిలేక మాడేవాళ్ళకు ఈ డబ్బును నేను ఇచ్చేస్తాను!" అన్నాడతను.

"తప్పక యిచ్చేయి! నేను చాలా ఆనందిస్తాను!" అన్నాడు పవన్.

"మిష్టర్, నేను వెళ్తున్నాను. నా గురించి నువ్వు యెవరికేనా ఫోన్ చేయొచ్చు! అలా చేస్తే నేను మళ్ళా ఇక్కడకు వస్తాను."

"నే నెవరికీ ఫోన్ చెయ్యను. పడుకుంటాను" అన్నాడు పవన్.

"బయట నిలబడి గంటదాకా నిన్ను గమనిస్తూ వుంటాను. నువ్వు రిసీవర్ ఎత్తితే నేను గదిలోకి వస్తాను."

"నేనేమీ చెయ్యను. మనస్ఫూర్తిగా ఆ డబ్బు నీకిస్తున్నాను."

అతడు బయటకు నడిచాడు. పవన్ తలుపు మూసి లాక్ చేశాడు. సోఫాలో కూర్చుని గ్లాసులో విస్కీ పోసుకుని, సోడా కలిపి గడగడ తాగేశాడు.

ఇప్పుడతనికి ధైర్యం వచ్చింది. వెంటనే ఫోన్ చేసి హోటల్ రిసెప్షన్‌తో మాట్లాడాలి. తన బ్రీఫ్ కేసు పట్టుకుపోయిన అతడికోసం వెతకమనాలి!

పవన్ రిసీవర్ ఎత్తాడు. యెవ్వరూ పలకలేదు. అటువైపున నిశ్శబ్దంగా వుంది. అతడు టెలిఫోన్ వైర్లను కత్తిరించాడేమో!

అరగంట దాటింది. అతడు నిజంగా గంటవరకూ బయట కాపలా వుంటాడా? ఈ పాటికి ఆ డబ్బు తీసుకుని అతడు పారిపోయి వుంటాడు!

పవన్ టైమ్ చూశాడు. మూడు దాటింది. తలుపు తెర్చి కిందకు వెళ్ళి రిసెప్షన్‌లో చెప్పడం మంచిదేమో!

పవన్ లాక్ తీసి తలుపు తెర్చాడు. అతడు వులిక్కిపడ్డాడు. బయట నిలబడిన అతడు అమాంతంగా లోపలికొచ్చి, తలుపు మూసి, లాక్ చేశాడు.

పవన్ వైపు అతడు పిశాచంలా చూశాడు.

"రాస్కెల్ నన్ను మోసం చెయ్యాలని చూశావా?" అర్చాడతను.

పవన్ నోటమ్మట మాట పెగల్లేదు. స్తంభించిపోయి

నట్లు అతడు నిలబడిపోయాడు.

కోటు జేబులోంచి అతడు కత్తిని బయటకు లాగి బటన్ నొక్కాడు. పదునైన కత్తి బయటకు దూచ్చుకొచ్చింది.

అటువైన టకటక అంతా జరిగిపోయింది. పవన్ పరుపుమీద పడ్డాడు. కత్తి అతడిలోకి దిగి, పైకి లేచి, మళ్ళా దిగుతోంది. యెడంచేత్తో అతడి నోరును నొక్కేశాడతను.

పవన్ రక్తం మడుగులో పడున్నాడు. ఒంటినిండా కత్తిపోట్లు!

అతడు సోఫాలో కూర్చుని గ్లాసులో విస్కీ పోసుకున్నాడు. ఐస్ క్యూబ్స్ గ్లాసులో వేశాడు. గడగడ విస్కీ తాగేశాడు. గ్లాసునీ' బుడ్డినీ రుమాల్తో తుడిచేశాడు.

అతడు సోఫాలోంచి లేచాడు. పరుపుమీద పడున్న పవన్ వైపు మౌనంగా చూశాడు. దుప్పటినిండా రక్తం!

అతడు టైమ్ చూశాడు.

మూడున్నర కావస్తోంది. అతడు బయటకు నడిచాడు. తలుపు దగ్గరగా మూశాడు. యెదురుగా వున్న తన గదిలోకి వెళ్ళాడు. బాగ్, బ్రీఫ్ కేసు పట్టుకుని అతడు కిందకు వెళ్ళాడు.

రిసెపన్ గుమస్తా కునికిపాట్లు పడుతున్నాడు. అతడు హోటల్ బయటకు వెళ్ళాడు. టాక్సీలో కూర్చుని తలుపు మూశాడు.

డ్రయివర్ ముందు సీటుమీద నిద్రపోతున్నాడు. అతడిని తట్టిలేపాడు.

"ఎక్కడికెళ్ళాలి?" అన్నాడు డ్రయివర్.

"మౌంట్ రోడ్డు" అన్నాడతను.

టాక్సీ కదిలింది. మౌంట్ రోడ్డులో బుహారీ హోటల్ ముందు అతడు దిగాడు. మీటర్ చూసి డబ్బు చెల్లించాడు. డ్రయివర్ కి ఒక రూపాయి ఇచ్చాడు.

రోడ్డు దీపాలు వెలుగుతున్నాయి. కాని ఆ సమయంలో జనసంచారం ఎక్కువలేదు. అతడు రోడ్డమ్మట నడిచి వెళ్ళిపోయాడు.

## 3

గాఢ నిద్రపోతోంచి లేచాను. టెలిఫోన్ మ్రోగుతోంది. ప్రక్కనున్న రిసీవర్ని తీశాను.

"హలో, పరశురామ్," అన్నాను.

"బ్రదర్, నాయర్!" అందో బొంగురు కంఠం.

"నాయర్ భాయ్, ఏమిటి సంగతి?"

"బ్రదర్, వెంటనే లాడర్స్ గేటు హోటల్ కి రా! అక్కడొక హత్య జరిగింది. నేను వెళ్తున్నాను."

"ఆల్ రైట్, వస్తాను" అని రిసీవర్ని పెట్టేశాను.

టైం చూశాను. ఆరు దాటింది. అప్పుడే వెలుతురు వస్తోంది. నా పక్కన పడుకున్న పార్వతి యింకా లేవలేదు. ఆమె ఏడుదాకా లేవదు.

బాత్ రూంలోకి వెళ్ళి పేస్టుతో పళ్ళు తోముకుని బయటికొచ్చాను. దుస్తులు ధరించి కిందకు దిగాను.

కృష్ణయ్య పరుగెత్తూ నా దగ్గర కొచ్చాడు. "సార్, కాఫీ తాగి వెళ్ళండి," అన్నాడతను.

అతడిచ్చిన కాఫీని నిలబడే తాగాను. కాఫీ చాలా బాగుంది. ఇంకా తాగాలనిపించింది. నా ఆలోచనల్ని కృష్ణయ్య గ్రహించినట్లు వున్నాడు. మరో కప్పు కాఫీ తెచ్చి నాకిచ్చాడు. అది తాగి హుషారుగా బయటకు

నడిచాను.

డాడ్జి కారును శరవేగంగా లాడర్స్‌గేటు హోటలు వైపు పోనిచ్చాను.

లాడర్స్‌గేటు హోటల్ కాంపౌండులో కారాపి దిగాను. నా కారు ముందు పోలీస్ జీప్ వుంది. అక్కడ నిలబడ్డ ఒక కానిస్టేబులు నన్ను చూసి శల్యూట్ చేశాడు.

హోటల్ వైపు నడుస్తూ నలువైపులా చూశాను. ఫైవ్ స్టార్ హోటలు. సూటులో వున్న ఒక వ్యక్తి నా వైపు గబగబా వచ్చాడు.

"పరశురామ్‌గారూ, మీరు వస్తున్నారని ఇన్‌స్పెక్టర్ నాయర్ చెప్పారు. నా పేరు అర్నాద్. నేనీ హోటలు మేనేజర్ని," అన్నాడతను.

సిగరెట్ పీలుస్తూ అతడి పక్కనే వెళ్ళాను. విశాలమైన హోటల్ ముందు గదిలోంచి కదులుతున్నాం.

"పరశురామ్‌గారూ, ఈ మర్డర్ ఎలా జరిగిందో గాని నాకు గాభరాగా వుంది. దీని మూలంగా మా బిజినెస్ దెబ్బతినొచ్చు."

అతడివైపు నవ్వుతూ చూశాను.

"డోంట్ బాదర్! ఇటువంటి పెద్ద హోటళ్ళలో అప్పుడప్పుడు యిటువంటివి జరుగుతూనే వుంటాయి," అన్నాను.

లిఫ్ట్‌లో పైకి వెళ్ళాం. మూడో అంతస్థులో దిగాం. నడవలో పోలీసులు పచార్లు చేస్తున్నారు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ నావైపు వచ్చి నవ్వుతూ కరచాలనం చేశాడు. మేనేజర్ అర్నాద్ నా ప్రక్కనే వున్నాడు.

"బ్రదర్, హతుడి పేరు పవన్‌కుమార్. అతడి వూరు

కలకత్తా. వారం రోజులయింది అతడు యీ హోటల్లో గది తీసుకొని." అన్నాడు నాయర్.

"ఆయన ఎప్పు డొచ్చినా యిక్కడే వుంటారు" అన్నాడు మేనేజర్ ఆర్నాద్.

30 నంబర్ గదిలోకి ఇన్ స్పెక్టర్ నాయర్ తో వెళ్ళాను. ఆర్నాద్ నడవలో వుండిపోయాడు.

ఏర్ కండిషండ్ గది. గోడకు అమర్చిన జీరోవాట్ బల్బు వెలుగుతోంది. పెద్ద మంచంమీద ఫోమ్ బెడ్. పరుపు మీద అతడు వెల్లకిలా పడున్నాడు. మెడమీద, గుండె ప్రాంతంలో, కడుపుమీద కత్తిపోట్లు!

ఎవరో విపరీతమైన కసితో పొడిచి, పొడిచి యితడిని చంపివుండాలి!

"ఘోరంగా హత్య చేయబడ్డాడు," అన్నాడు ఇన్ స్పెక్టర్.

గది నలువైపులా తిరిగాను. రెండు సోఫాలు,టీపాయి వున్నాయి. టీపాయిమీద స్కాచ్ విస్కీ బాటిల్, రెండు గ్లాసులు వున్నాయి. పక్కనే కూల్ బాక్స్. తెరచి చూశాను. అందులో ఐస్ లేదు. అడుగున కొద్దిగా నీళ్ళు న్నాయి.

టేబుల్ దగ్గరకు వెళ్ళాను. లెదర్ బాక్స్, కొన్ని ఫైల్సు వున్నాయి. కిందకు చూశాను. గోడవారగా ఒక ఖాళీ విస్కీ బాటిల్ వుంది. పవన్ కుమార్ రోజూ తాగుతూ వుండాలి.

వెనక్కు తిరిగాను . ఇన్ స్పెక్టర్ నాయర్ నావైపు చూస్తున్నాడు.

"బ్రదర్, గది తలుపు చూశావా?"

తలుపు దగ్గరకు వెళ్ళాను. తలుపుకు గాడ్ రెజ్ లాక్

అమర్చబడి వుంది. తాళంచెవి బయటకు కనిపిస్తోంది.

ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాను. హంతకుడు గది లోకి యెలా వచ్చాడు? ఇతడు తలుపు తెర్చి రాని చ్చాడా? రాత్రివేళ తెలిసిన వ్యక్తి అయితే గాని ఎవ్వరూ తలుపు తెరవరు!

నడవలోకి వెళ్ళాను. మేనేజర్ అర్నాల్డ్ వైపు నవ్వుతూ చూశాను.

"మనం మాట్లాడాలి!" అన్నాను.

ఇద్దరం నడవమ్మట నడిచాం. పదిహేనో నెంబరు గది తాళం తెరిచి అతడు లోపలకు వెళ్ళాడు. వెనుకనే నేనూ నడిచాను.

అతడు ఏర్ కండిషన్డ్ ఆన్ చేశాడు.

ఇద్దరం సోఫాల్లో ఎదురెదురుగా కూర్చున్నాం. అతడి వంక సూటిగా చూశాను.

"పవన్ కుమార్ ఎప్పుడూ యీ హోటల్లోనే వుంటూ వుంటాడని మీరు అన్నారు. అతడిని గురించి మీకు తెలి సినదంతా చెప్పండి." అన్నాను.

"ఆయన పెద్ద బిజినెస్‌మన్ సార్. ఆయన కంపెనీ బ్రాంచి యీ పట్నంలో వుంది. నిప్పన్ ఏజన్సీస్!"

"నిన్న రాత్రి ఆయన గదికి ఎవరేనా వెళ్ళడం మీరు చూశారా?"

"నేను చూడలేదు. కాని డిన్నర్ యిద్దర్కి మా మనిషి గదికి తీసుకువెళ్ళాడు. ఒక యువతి ఆయనతో వుందని నాకు తెలుసు. ఆయన కొంచెం రొమాంటిక్ టైప్!"

"ఆమె అతడి ఫ్రెండా?"

"అదంతా నాకు తెలియదు."

"డబ్బిచ్చి ఆమెను తన గదికి రప్పించుకున్నాడా?"

"చెప్పలేను."

"మిస్టర్ ఆర్నాద్, యిక్కడ జరుగుతున్నదంతా మీకు తెలిసే వుంటుంది. ఈ హత్య ఎలా జరిగిందో కనుక్కోవాలంటే మీరు నిజం చెప్పాలి. మీరు నాకు చెప్పినది రహస్యంగా వుంచుతాను" అన్నాను.

కొంతసేపు అతడు మౌనం దాల్చాడు. జేబులోంచి సిగరెట్ పాకెట్ తీసి, ఒక సిగరెట్ వెలిగించాడు.

"పరశురామ్‌గారూ, ధనవంతులకు ఎన్నో వ్యసనాలు వుంటాయి. అటువంటివాళ్ళే మా హోటల్లో గది తీసుకుని వుంటారు. రాజన్ అనే సప్లయిర్ యీ హోటల్లో తిరుగుతూ వుంటాడు. అతడు నిన్న రాత్రి ఒకమ్మాయిని పవన్‌కుమార్ గదికి పంపాడు."

"రాజన్ ఎక్కడుంటాడు?"

"అనేక హోటల్సులో అతడు తిరుగుతూ వుంటాడు. అతడు దొరకగానే మిమ్మల్ని కలుసుకోమని చెప్తాను."

"రాజన్, ఆ యువతి నాకు కావాలి."

"రాజన్‌తో చెప్పి ఆమెను రప్పిస్తాను."

"చాలా థాంక్స్" అని సోఫాలోంచి లేచాను.

ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాను.

"ఈ గది ఖాళీగా వుందా?" అడిగాను.

"పరశురామ్‌గారూ, మీరు తాత్కాలికంగా యీ గదిని వాడుకోవచ్చు" అన్నాడతను.

మేనేజర్ ఆర్నాద్ బయటకు వెళ్ళిపోయాడు.

టెలిఫోన్ దగ్గరకు వెళ్ళి రిసీవర్ ఎత్తాను.

"హోటల్ లాడర్స్‌గేట్ ప్లీస్," అందో స్త్రీ కంఠం.

"నిప్పన్ ఏజన్సీస్‌కు ఫోన్ చేసి కనెక్షన్ యివ్వండి." అన్నాను.

ఆమె నంబరు అడగలేదు. పవన్‌కుమార్ ఎన్నిసార్లో తన బ్రాంచికి ఫోన్ చేస్తూ వుండివుండాలి!

టైమ్ చూశాను. ఎనిమిది దాటింది.

"హలో, నిప్పన్ ఏజన్సీస్."

"ఎవరు మాట్లాడుతూంది?"

"మేనేజర్ వినాయక్, సార్."

"మిస్టర్ వినాయక్, నిన్నరాత్రి మీ బాస్ పవన్‌కుమార్‌ని యెవరో లాడర్స్ గేటు హోటల్సులో హత మార్చారు...."

వినాయక్ గట్టిగా అర్చాడు.

"వాడే అయివుండాలి సార్!"

"ఎవరు?"

"ఎవరెస్టు గార్మెంట్స్ అధిపతి ఆదిమూలం. నిన్న ఆఫీసులో అతడికీ, మా బాస్‌కీ పెద్ద పోట్లాట అయింది."

"దేన్ని గురించి?"

"ఆరు నెలల క్రితం ఆదిమూలం మాకు లక్ష రూపాయలు అడ్వాన్సుగా యిచ్చాడు. ఒక జపాన్ మిషన్ మేం అతడికి యివ్వాలి. మిషన్ వచ్చాక మిగిలిన డబ్బు అతడు యిస్తానన్నాడు. కాని ఆ మిషన్ యింతవరకూ మేం అతడికి యివ్వలేకపోయాం. మూడు నెలల్లో యిస్తానని మిషన్ యివ్వకుండా ఆరు నెలలు గడిపేశారని అతడు మాట్లాడాడు. పవన్‌కుమార్ ఎంత చెప్పినా అతడు వినలేదు. చివరికి అతని అడ్వాన్సు వాపస్ చేస్తానని పవన్‌కుమార్ అన్నారు. అతడు చెక్ వద్దన్నాడు. రేపు

వస్తాను కాష్ రెడీగా వుంచమని వెళ్ళిపోయాడు.

"ఆ కాష్ రెడీగా వుంచారా?"

"కాష్ హోటల్లో వుంది, రేపు తప్పక యిస్తానని పవన్ అన్నారు."

"హోటల్ గదిలో పవన్ కుమార్ డబ్బు యెక్కడ దాస్తాడు?"

"ఆయన బ్రీఫ్ కేసులో వుంటుంది."

"మిస్టర్ వినాయక్, మీరొకసారి వెంటనే యిక్కడకు రండి," అని రిసీవర్ పెట్టేశాను.

గదిలోంచి బయటకు నడిచాను. తలుపుమూసి తాళం వేసుకొని నా జేబులో పడేసుకున్నాను.

గబగబా శవం వున్న గదిలోకి వెళ్ళాను. బీరువా తెర్చి చూశాను. అన్నిచోట్లా వెతికాను. కాని ఎక్కడా బ్రీఫ్ కేసు లేదు!

"బ్రదర్ దేనికోసం వెతుకుతున్నావు?" అడిగాడు నాయర్.

"లక్షరూపాయ లున్న బ్రీఫ్ కేస్ యీ గదిలో వుండాలి. అది మాయమైంది," అన్నాను.

నాయర్ ఆశ్చర్యంగా నా వైపు చూశాడు.

## 4

రాజన్ తో సహా ఆమె నేను వున్న 15 నంబరు గదిలోకి వచ్చింది.

"నా పేరు రాజన్. ఈమె మాలతి," అన్నాడతను.

వాళ్ళిద్దరూ సోఫాల్లో కూర్చున్నారు.

ఎదురుగా నిలబడి యిద్దరివైపూ చూశాను. చదువుకున్న యువతిలా కనిపిస్తోందామె.

"నిన్నరాత్రి అతడి గదికి యెప్పుడు వెళ్ళావు?"

అడిగాను.

"పదింటికి సార్. ఫోన్ చేస్తే ఆయన పైకి రమ్మన్నారు. వెళ్లాను" అందామె.

"అప్పుడు పవన్ కుమార్ ఏం చేస్తున్నాడు?"

"స్కాచ్ విస్కీ తాగుతున్నారు. ఆయన తిండి కూడా సరిగా తినలేదు. అలాగే నిద్రపోయాడు."

"నువ్వు ఎందుకు వెళ్ళిపోయావు?"

"ఆయన కోర్కెలు తీర్చడానికి నేనా గదికి వెళ్ళాను. కాని యే కోరికా లేకుండా ఆయన హాయిగా నిద్రపోయాడు. పొద్దుటదాకా ఆయన లేవరని అనుకున్నాను. మెల్లిగా గదిలోంచి బయటికి నడిచి వెళ్ళిపోయాను," అందామె.

"అప్పుడు టైమెంతయింది?"

"పన్నెండు కావస్తోంది."

"నువ్వు నడవమ్మట వెళ్తుంటే యెవరేనా చూశారా? ...."

"ఎవ్వరూ చూడలేదు సార్," అందామె.

ఆమెవైపు సూటిగా చూశాను.

"పవన్ గదిలో టేబుల్ మీద తోలుపెట్టె వుంది. అక్కడ బ్రీఫ్ కేస్ కూడా వుండాలి...."

"ఉంది. అది పెట్టె పక్కనే వుంది. నేను చూశాను."

"ఆ బ్రీఫ్ కేస్‌లో ఏముందో చూశావా?"

"లేదు సార్," అందామె.

"నువ్వు ఒంటరిగా యింటికి వెళ్ళావా?"

"కింద నున్న లాంజిలో రాజన్ కనిపించాడు. జరిగింది అతడికి చెప్పి నేను వెళ్ళిపోయాను."

అతడివైపు చూశాను.

"ఆమె చెప్పింది నిజమే సార్," అన్నాడు రాజన్.

రాజన్ సన్నగా, పొడుగ్గా వున్నాడు. నూటు వేసుకొన్నాడు. అతడి మొహం చూసి నీచమైన వృత్తిలో వున్నాడని ఎవరూ అనుకోరు.

"రాజన్, ఆమె వెళ్ళిపోయాక నువ్వు పవన్ గదికి వెళ్ళావా?"

"లేదు సార్."

"అబద్ధాలాడి జయించలేవు. పవన్‌కుమార్ గది తలుపుకు తాళం వేయకుండా ఆమె వచ్చేసిందని నీకు తెలుసు. అతడు తప్పతాగి పడున్నాడని నీకు తెలుసు. అతను డబ్బున్నవాడని నీకు బాగా తెలుసు. కష్టపడకుండా, శ్రమించకుండా డబ్బు సంపాదించడం నీకు అలవాటైపోయింది. అతడి గదిలోకి వెళ్ళి వున్నది పట్టుకుని బయట పడొచ్చు. ఎవ్వరూ నిన్ను అనుమానించరు!"

అతడు మొహాన్ని చేత్తో కప్పేసుకున్నాడు. "పరశురామ్‌గారూ, చాలా నీచమైన పని నేను చేస్తున్నాను. కాని నేను దొంగను కాను. నేను ఆ గదిలోకి వెళ్ళలేదు. మాలతి వెళ్ళిపోయిన ఐదునిమిషాల తర్వాత నేను నా యింటికి వెళ్ళిపోయాను" అన్నాడతను.

"నువ్వు వెళ్ళడం యెవరేనా చూశారా?"

రాజన్ కాస్సేపు ఆలోచించాడు.

"హోటలు గేటుబయట వుండే గూర్ఖా చూశాడు. మరో విషయం. రాత్రి పది తర్వాత యీ హోటల్లో యెవ్వరూ వారి యిష్టమొచ్చినట్లు పైకి వెళ్ళలేరు. లిఫ్టుల దగ్గర మెట్లదగ్గర హోటల్ సెక్యూరిటీ గార్డ్సు పచారు

చేస్తూవుంటారు. ఇక్కడ గదుల్లో వుండేవాళ్ళనే వారు పైకి వెళ్ళనిస్తారు. తతిమ్మావాళ్ళను వెళ్ళనివ్వరు. గదికి ఫోన్ చేసి అనుమతి పొందాక పైకి పంపుతారు. అందుకే మాలతి ఫోన్ చేయించి పైకి వెళ్ళింది. దీన్ని గురించి మేనేజర్ ఆర్నాల్డ్‌తో మీరు మాట్లాడి కనుక్కోవచ్చు."

"పైనుంచి కిందకు దిగి వెళ్ళిపోయే వాళ్ళను గురించి సెక్యూరిటీ గార్డ్సు అంతగా పట్టించుకోరా." ప్రశ్నించాను.

"కిందికి దిగిపోయే వాళ్ళను గురించి సెక్యూరిటీ గార్డ్సు అంతగా పట్టించుకోరు."

అతడివైపు సూటిగా చూశాను.

"పవన్‌కుమార్ నీకు యెంతకాలంగా తెలుసు?"

"ఐదేళ్ళనుంచి ఆయనతో నాకు పరిచయముంది."

అడ్రెసులు తీసుకుని వాళ్ళిద్దర్నీ వెళ్ళమన్నాను. రాజన్, మాలతి నాకు నమస్కరించి వెళ్ళిపోయారు.

సిగరెట్ పీలుస్తూ ఆలోచిస్తున్నాను. ఈ హత్య ఎందుకోసం జరిగింది? రాజన్ 30 నంబరు గదిలోకి వెళ్ళి వుంటే పవన్ నిద్రపోతూ వుండేవాడు. ఆ బ్రీఫ్‌కేసు పట్టుకు పారిపోవడానికి అతడిని చంపవలసిన అవుసరం లేదు. మాలతి వెళ్ళిన సమయంలో, పన్నెండు ప్రాంతంలో, పవన్ నిషాలో నిద్రపోతున్నాడు. గదిలోకి ఎవరొచ్చినా, ఏది పట్టుకుపోయినా గమనించే స్థితిలో అతను లేడు.

రాజన్‌కీ, మాలతికీ ఆ బ్రీఫ్‌కేస్ పట్టుకుపోయే అవకాశం వున్నా పవన్‌కుమార్ని చంపవలసిన అవుసరం లేదు.

తీవ్రంగా ఆలోచిస్తున్నాను.

మేనేజర్ ఆర్నాద్ ఖంగారుగా నా గదిలోకొచ్చాడు.

"పరశురామ్‌గారూ, 30 నంబరు గది కెదురుగా 20 నంబరు గదిలో వుండే వ్యక్తి మాయమయ్యాడు. అతడి పేరు గంగాధర్. మొన్న అతడు ఇక్కడ గది తీసుకున్నాడు. ఇవాళ అతడు బ్రేక్‌ఫాస్టుకి రాలేదు. ఫోన్ చేసే రిసీవర్ ఎత్తలేదు. మా దగ్గరున్న కీతో తలుపు తెరిచి, లోపలకు వెళ్ళి చూశాం. గదిలో అతడి వస్తువులు ఏమీ లేవు. అతడు యెక్కడికో పారిపోయి వుంటాడు" అన్నాడు ఆర్నాద్.

"అతడు మీకు డబ్బు బాకీ వున్నాడా?" ప్రశ్నించాను.

"ఇవ్వాలి!"

నా మెదడులో ఏదో వెలిగింది. ఆర్నాద్‌తో బయటకు వెళ్ళాను. ఇరవై నంబరు గదిముందు నిలబడ్డాను. అది 30 నంబరు గదికి యెదురుగా వుంది!

ఆ గదిలోంచి 30 నంబరు గదిని రహస్యంగా గమనిస్తూ వుండొచ్చు!

ఇరవై నంబరు గదిలోకి వెళ్ళాను. హోటల్ మేనేజర్ ఆర్నాద్, ఇన్‌స్పెక్టర్ నాయర్ నా పక్కనే వున్నారు.

గదంతనీ సోదా చేశాను. టేబుల్ కింద ఒక రమ్ బాటిల్ పడుంది. నాయర్ వైపు తిరిగాను.

"ఆ బాటిల్ మీద యీ గదిలో వున్న వ్యక్తి వేలిముద్రలు వున్నాయేమో చూడమను," అన్నాను.

టీపాయ్‌మీదున్న యాష్ట్రేలోని సిగరెట్ పీకలవైపు

చూశాను. చార్మినార్ ఫిల్టర్ సిగరెట్ పీకలు!

వేగంగా ముప్ఫయి నంబరు గదిలోకి వెళ్ళాను. అక్కడున్న యాష్ట్రేను సోదా చేశాను. గోల్డుఫ్లేక్ సిగరెట్ పీకల మధ్య కొన్ని చార్మినార్ ఫిల్టర్ పీకలున్నాయి.

20 నంబరు గదిలో వున్నతను యీ గదిలోకి వచ్చుండాలి! సందేహం లేదు!

గంగాధర్ యీ గదిలోకి ఎప్పుడు వచ్చాడు? నిన్న రాత్రి మాలతి వెళ్ళిపోయాకా?

మాలతి వెళ్ళడం అతను చూసివుంటాడు. ఆ తర్వాత అతడు 30 నంబరు గదిలోకి వెళ్ళివుండొచ్చు!

నా మెదడులో ఆలోచనలు చకచక సాగిపోతున్నాయి. నడవలో కొచ్చి సిగరెట్ వెలిగించాను. పొగ పీల్చి వదులూ పైకి చూశాను.

తృప్తిపడ్డాను! మేనేజర్ ఆర్నాద్ వైపు చూశాను. అతడు నా దగ్గర కొచ్చాడు.

"గోడపైనున్న టెలిఫోన్ వైర్లను ఎవరో కత్తిరించారు." అన్నాను.

"మీరు చెప్పింది నిజం సార్. అది ఎవ్వరూ గుర్తించలేదు." అన్నాడతను.

30 నంబరు గదిలోకి వెళ్ళి రిసీవర్ ఎత్తాను. నిశ్శబ్దంగా వుంది.

వెనుక నున్న ఆర్నాద్, నాయర్ వైపు చూశాను.

"పవన్ కుమార్కి ఫోను చేసే అవకాశం లేకుండా హంతకుడు జాగ్రత్తపడ్డాడు." అన్నాడు ఇన్స్పెక్టర్ నాయర్.

"నాయర్ భాయ్, అదే విచిత్రంగా వుంది. పవన్ కుమార్ తప్పతాగి నిద్రపోతున్నాడు. అతడి టెలిఫోన్

వైర్లెను హంతకుడు ఎందుకు కట్ చేశాడు?" అన్నాను.

"బ్రదర్, అది నువ్వే కనుక్కోవాలి." అన్నాడు ఇన్స్పెక్టర్ నాయర్.

# 5

అతడు రోడ్డమ్మట నడుస్తున్నాడు. చేతిలో లెదర్ బాగ్ వుంది. పెదిమల మధ్య సిగరెట్ వెల్గుతోంది.

పేవ్మెంటమ్మట జనం యిటూ, అటూ కదులుతున్నారు. సాయంత్రం సమయం. అతడు మాటులో వున్నాడు. నీలం రంగు టై, కాళ్ళకు నల్లటి బూట్లు.

పదేళ్ళ కుర్రాడు ఒకచోట నిస్సహాయంగా కూర్చుని ముష్టి అడుక్కుంటున్నాడు. అతడు ఆగాడు. ఆ కుర్రాడి వైపు చూశాడు.

చిరిగిన గుడ్డలు. చింపిరి జుత్తు.

"కడుపులో మాడ్తోంది సార్. పది పైసలివ్వండి," అరాచ్చాడా కుర్రాడు.

"నాతో రా." అన్నాడతను.

"ఎక్కడికి సార్?"

"నీ ఆకలి తీరుస్తాను."

అతడితో సహా ఆ కుర్రాడు నడవసాగాడు.

"నీ పేరు?"

"గోపీ, సార్."

"నీకు దగ్గర చుట్టాలున్నారా?"

"అమ్మ వుంది సార్. మరెవ్వరూ లేరు."

ఇద్దరూ గజపతి హోటల్లోకి వెళ్ళారు.

రెండు కుర్చీల్లో ఎదురెదురుగా కూర్చున్నారు. అతడు కుర్రాడివైపు చూశాడు.

"గోపీ, ఈ రోజు నే నా చెల్లెలు మరణించింది. నా

చెల్లెలు పద్మంటే నా కెంతో ప్రేమ. అమ్మా, నాన్నా పోయాక దాన్ని నేనే పెంచాను. ప్రాణంలా చూసుకునేవాడిని. ఆమె జ్ఞాపకార్థం నీకు తిండి పెట్టిస్తాను. నీకు యేం కావాలో అన్నీ తిను! మొహమాట పడకు!" అన్నాడతను.

"ఇదంతా వింటే బాధగా వుంది సార్."

"బాధపడి యేం చెయ్యగలవు! హాయిగా తిని నా చెల్లెలు ఆత్మకు శాంతి చేకూర్చు!"

హోటల్ బాయ్ వచ్చాడు. అతడు పెద్ద పెట్టున ఆర్డరిచ్చాడు. బాయ్ ప్లేట్లను తెచ్చి టేబుల్ మీద పెట్టాడు.

గోపీ ఆకల్తో తింటున్నాడు. వేడి కాఫీ తాగుతూ అతడు గోపీని గమనిస్తున్నాడు.

"ఇవాళ ఎవరి మొహం చూశానో గాని కడుపు బాగా నిండింది, సార్." అన్నాడు గోపీ మూతి తుడుచుకుంటూ.

"నీ తల్లి మొహం చూసుంటావు! తన బిడ్డ క్షేమంగా వుండాలనీ, యే విధంగానూ బాధపడకూడదనీ తల్లి ఎప్పుడూ హృదయంలో అనుకుంటూ వుంటుంది." అన్నాడతను.

"బాగా చెప్పారు, సార్."

హోటల్ బాయ్ రాగానే కొన్ని పదార్థాలు పేర్లు చెప్పి పాక్ చేసి తెమ్మన్నాడు.

ఆ పాకెట్‌ను నవ్వుతూ గోపీ కిచ్చాడు.

"ఎందుకు సార్?" అడిగాడు గోపీ.

"నీ ఆకలి తీరినపుడు నీ తల్లి ఆకల్ని గుర్తుంచుకో! ఈ పాకెట్ ఆమెకు!"

"మీరు దేవుడులాంటివారు సార్."

అతడు సూటిగా గోపీవైపు చూశాడు.

"దేవుడు నీ కష్టదేనా ఏదేనా యిచ్చాడా? యిలా టిఫిన్ పెట్టించాడా?"

"లేదు, సార్."

"మనకు తెలియని దేవుడితో మనిషిని పోల్చడం మంచిది కాదు. నీకు మంచి చేసేవాడు మంచి మనిషి!"

"అవును, సార్."

అతడు కోటు జేబులోంచి ఒక వంద రూపాయల నోటు తీసి అతడి కిచ్చాడు.

"అది జేబులో దాచుకో. నీ తల్లి కియ్యి."

"ఎవరిచ్చారంటే యేం చెప్పను సార్?"

అతడు నవ్వాడు.

"అన్నయ్య యిచ్చాడని చెప్పు! నీలాటి వాళ్ళంటే అన్నయ్యకు చాలా ప్రేమని చెప్పు."

ఇద్దరూ హోటల్లోంచి బయటకు నడిచారు. వాళ్ళిద్దరి వైపూ కొందరు విచిత్రంగా చూశారు.

"గోపీ, వెళ్తా." అన్నాడతను, పేవ్‌మెంట్ మీదకు రాగానే.

ఇద్దరూ పక్క పక్కనే నడుస్తున్నారు.

"మిమ్మల్ని వదల బుద్ధి కావడంలేదు." అన్నాడు గోపీ దుఃఖంతో.

"గోపీ, వెళ్ళి నీ తల్లి ఆకలిబాధను తగ్గించు!" అన్నాడతను.

గోపీ పేవ్‌మెంట్ మీద అలాగే నిలబడి వుండి పోయాడు. అతడు పెంద అంగల్లో నడిచి వెళ్ళి పోయాడు.

అతడి రూపం మాయమవగానే గోపీ వెనక్కి తిరిగి నడవసాగాడు. సైకిల్ రిక్షా స్టేండు దగ్గర ఆగాడు.

"మంచి టిఫిన్, కొంటారా?" అడిగాడు.

నలుగురు రిక్షావాళ్ళు అతడిని చుట్టేశారు. పాకెట్‌ను వాళ్ళ కిచ్చి వాళ్ళిచ్చిన చిల్లర డబ్బుల్ని గోపీ జేబులో వేసుకున్నాడు.

ఈల వేస్తూ తన స్థలంలో మళ్ళా కూర్చున్నాడు.

"ఆకలి సార్! పది పైస లివ్వండి!" అర్చాడు గోపీ యిటూ అటూ వెళ్తూన్న వాళ్ళవైపు చూస్తూ.

## 6

పవన్ కుమార్ హత్య జరిగి వారం రోజులు దాటి పోయింది. ఎంత ఆలోచించినా హంతకుడి ఆచూకీ నాకు తెలియడంలేదు.

ఇన్‌స్పెక్టర్ నాయర్‌కి యెదురుగా కూర్చున్నాను. పైన ఫాన్ తిరుగుతోంది. ఇన్‌స్పెక్టర్ నా కేసి విచిత్రంగా చూశాడు.

"బ్రదర్, మా రికార్డ్సులో వేలాది అపరాధుల వేలిముద్రలు వున్నాయి. ఇరవై నంబరు గదిలో మనకు రమ్ బాటిల్ దొరికింది. దానిమీదున్న వేలిముద్రలను మా రికార్డ్సులో వున్న వేలిముద్రలతో పోల్చి చూశాం." అని ఆగాడు నాయర్.

"ఏం తెలిసింది?"

"రమ్ బాటిల్ మీదున్న వేలిముద్రలు నాగరాజు వేలి ముద్రలను పోలి వున్నాయి."

"నాగరాజు ఎవరు?" అడిగాను.

"అతడో హంతకుడు. రెండేళ్ళ క్రితం మునిరెడ్డి అనే మిల్ అధిపతిని నాగరాజు హత్య చేశాడు. అతడిని పోలీ

సులు అరెస్టు చేశారు. కాని నాగరాజు పారిపోయాడు.
అతడికోసం వెతకమని సేలమ్ పోలీసు ఇన్‌స్పెక్టర్
తంగరాజు నాకు ఫోన్ చేశాడు. అతడి ఫోటో కూడా
పంపాడు."

"ఆ ఫోటో మీ దగ్గరుందా?"

"పాత ఫైల్సులో వుండొచ్చు. వెతకాలి!"

"నాయర్ భాయ్, వెంటనే వెతకమను!" అన్నాను.

నాయర్ లోపలకు వెళ్ళి కాస్సేపట్లో తిరిగి వచ్చాడు.

"వెతకమన్నాను. బ్రదర్, నాగరాజు ఈ హత్య
చేసుంటాడనే నమ్మకం నాకు లేదు. నాగరాజు సేలంలో
వుండే వ్యక్తి. పవన్‌కుమార్ మీద అతడికి కసి ఏర్పడే
అవకాశం నాకు కనబడ్డంలేదు. అంతేకాదు. నాగరాజు
బీదవాడు. లాడర్స్‌గేటు హోటల్లో గది తీసుకుని అతడు
వుండడు!"

సిగరెట్ పొగ పీల్చి వదుల్తూ నాయర్ వైపు నవ్వుతూ
చూశాను.

"నాయర్ భాయ్, జీవితాంతం మనుషులు ఒకలాగే
వుండరు. అనుభవాలనుబట్టి మనుషులు మార్తూ వుంటారు.
కొన్ని ఏళ్ళక్రితం ఒకతను బెంగుళూరులో బస్ కండ
క్టర్‌గా వుండేవాడు. మొన్న ఒక పార్టీలో అదే వ్యక్తి
నా పక్క కూర్చున్నాడు—ఇప్పుడతను సూపర్ ఫిలిం
స్టార్!"

ఒక కానిస్టేబులు కాఫీ తెచ్చి టేబుల్ మీద పెట్టాడు.
ఇద్దరం కప్పులను అందుకున్నాం. కాఫీ తాగేసి కప్పును
టేబులుమీద పెట్టాను.

"బ్రదర్, ఇదంతా అగమ్యగోచరంగా వుంది. మనకు
ఇంతవరకూ తెలిసినదాన్నిబట్టి ఆలోచిస్తే ఎక్కడా అతు

కోవడం లేదు."

"నాయర్ భాయ్, తప్ప తాగి పడున్న మనిషి గదికి వెళ్ళే టెలిఫోన్ వైర్లను ఎందుకు కత్తిరించారు? అదేనా నువ్వనేది?" ప్రశ్నించాను.

"అది సిల్లీ గా వుంది!"

"నాయర్ భాయ్, హంతకుడు గదిలో కెళ్ళాక పవన్ కుమార్ మేల్కొన్నాడేమో!" ప్రతి రోజూ తాగేవాళ్ళు మధ్యలో లేస్తూవుంటారు."

"బ్రదర్, మరో విషయం. డాక్టర్ రిపోర్టునుబట్టి పవన్ కుమార్ మూడు, నాలుగు మధ్య మరణించి వుండాలి. మాలతి వెళ్ళాక హంతకుడు పవన్ కుమార్ గదిలో ప్రవేశించాడని నువ్వు అన్నావు. 12 ప్రాంతంలో ఆమె వెళ్ళిపోయింది. అప్పటినుంచి మూడుదాకా ఆ గదిలో హంతకుడు ఏంచేస్తూ వుంటాడు?"

ఫక్కున నవ్వాను.

"నాయర్ భాయ్, గదిలో చక్కటి స్కాచ్ విస్కీ వుంది. అది తాగుతూ హంతకుడు కూర్చున్నాడేమో!"

ఇన్స్పెక్టర్ నాయర్ పరిహాసంగా నవ్వాడు.

"హత్య చేయడానికి వచ్చిన వాడు స్కాచ్ విస్కీ తాగుతూ కూర్చుంటాడా?"

"హత్య చేయాలనే ఉద్దేశం అతడికి లేదేమో! తర్వాత కలిగిందేమో!" అన్నాను.

"బ్రదర్, ఇదంతా అయోమయం గా వుంది."

"నాయర్ భాయ్, డోంట్ బాదర్. సేలమ్ నాగరాజా ఎందుకు మునిరెడ్డిని హత్యచేశాడో తెలిశాక మనకంతా అర్థంకావచ్చు."

ఒక అసిస్టెంట్ మాముందు కొచ్చాడు. ఒక ఫోటోను

ఇన్‌స్పెక్టర్కి ఇచ్చాడు. ఆ ఫోటోను తీసుకుని పరీక్షగా చూశాను.

కుర్చీలోంచి లేచాను. ఫోటోను జేబులో పడేసుకున్నాను.

"నాయర్ భాయ్, లాడర్స్ గేటు లోపలికి వెళ్ళాం, పద!" అన్నాను.

"బ్రదర్, నువ్వెళ్ళి కనుక్కో! నాకు నమ్మకం లేదు. అవుసరమైతే నేను వస్తాను."

వేగంగా బయటకు నడిచాను. కూర్చుని కారు తలుపు మూశాను. డాడ్జి కారును శరవేగంగా లాడర్స్ గేటు హోటల్ వైపు పోనిచ్చాను.

కాంపౌండులో కారాపి దిగాను. ముందున్న లాంజి లోకి వెళ్ళాను. మేనేజర్ ఆర్నాద్ గదిలోకి నడిచాను.

అతడు నా వైపు ఆశ్చర్యంగా చూశాడు.

"కూర్చోండి, సార్."

ఫోటోను తీసి అతడికిచ్చాను. ఆర్నాద్ దానివైపు చూస్తూ వుండిపోయాడు.

"ఆ వ్యక్తిని మీ రెక్కడైనా చూశారా?" అడిగాను.

"చూసినట్లుంది సార్."

"ఎక్కడ?"

"అది గుర్తు రావడం లేదు. కాని యెక్కడో చూశాను."

"జ్ఞాపకం తెచ్చుకోండి" అని వూరుకున్నాను.

లీడింగ్ ప్రశ్నలు వేసి అతడినుంచి జవాబులు పొందడం నాకిష్టం లేదు. ఆ మనిషిని అతడు చూసుంటే ఎప్పుడో గుర్తొస్తుంది.

సిగరెట్ వెలిగించి పొగవదుల్తూ గది నలువైపులా

చూశాను. అతడు అమాంతంగా కుర్చీలోంచి పైకెగిరి మళ్ళా కూర్చున్నాడు.

"అతడే సార్ గంగాధర్. రూమ్ నంబర్ 20 లో వున్న మనిషి ఇతనే!"

"అతడిని పోల్చడానికి మీకంత టైము యెందుకు పట్టింది?"

"వేషం మారింది. ఈ ఫోటోలో అతడికి పాపిడి వుంది. గంగాధర్ ది అమెరికన్ క్రాపు. సన్నటి మీసాలు. ఈ ఫోటోలో మీసాలు వెడల్పుగా, గుబురుగా వున్నాయి. ఇక్కడ అతను షర్టులో వున్నాడు. అతడు సూటులో వుండగా నేను చూశాను. కాని ఒక్క విషయం నేను చెప్పగలను. ఈ ఫోటో గంగాధర్ దే" అన్నాడు మేనేజర్ అర్నాద్.

"మీ ఫోను ఉపయోగించవచ్చా?" అడిగాను.

"ప్లీస్" అని అతడు ఒక ఫోన్ను నావైపు తోశాడు.

రిసీవర్ని ఎత్తాను. డయిల్ టోన్ వినిపిస్తోంది. "అది నా పెర్సనల్ ఫోన్. కావలసిన నంబరు తిప్పండి" అన్నాడతను.

నంబరు తిప్పాను.

"హలో!, ఇన్స్పెక్టర్ నాయర్!"

"నాయర్ భాయ్, మన పరిశోధన సరైన మార్గంలో వెళ్తోంది. సేలమ్ నాగరాజు, యిరవై నంబరులో వున్న గంగాధర్ ఒక్కడే! హోటల్ మేనేజర్ అర్నాద్ సులువుగా పోల్చాడు."

"గుడ్ గాడ్!" అర్చాడు నాయర్.

"నాయర్ భాయ్, హంతకుడి ఫోటోను నీ ఫైల్సులో వుంచుకుని అతడు ఎవరా అని నువ్వూ నేనూ బుర్రలు

పగలగొట్టుకుంటున్నాం!" అన్నాడు నవ్వుతూ.

"ఇప్పుడు ఏం చేద్దాం?"

"నే నక్కడికి వొచ్చి చెప్తాను." అని రిసీవర్ని పెట్టేశాను.

## 7

వినాయక్ లాడ్జి తండయార్ పేట్‌లో మారుమూలన వుంది. ఆ లాడ్జిలో 10 గదులు మాత్రం వున్నాయి. లాడ్జి చిన్నదైనా గదులు శుభ్రంగా వుంటాయి.

అక్కడ వుండేవాళ్ళు నెల నెలా బాడుగ చెల్లించి వుంటూ వుంటారు.

రూం నంబరు పన్నెండు మేడమీదున్న చివరి గది. ఆ గదిలో రెండేళ్ళ నుంచి అతడు వుంటున్నాడు.

గది తీసుకున్నప్పుడు తన పేరు వీరాస్వామి అని చెప్పి పుస్తకంలో సంతకం పెట్టాడు. పొగాకు వ్యాపారంలో వున్నట్లు చెప్పి తన అసలు వూరు గుంటూరని పుస్తకంలో రాయడానికి వివరాలు యిచ్చాడతను.

టైమ్ ఏడు దాటింది. లాడ్జిలోని లైట్లు వెలుగుతున్నాయి. కింద హాల్లో కూర్చుని కొందరు టీ.వీ చూస్తున్నారు. లాడ్జి ప్రొప్రయిటర్ కుమరన్ తన పని చేసుకుంటూ టి.వీ చూస్తున్నాడు.

పన్నెండో నంబరు గదిలో లైటు వెల్గుతోంది. అతను ఓల్డ్ మోంక్ రమ్ బాటిల్ తెర్చాడు. గ్లాసులో కొంత పోసి థమ్స్ అప్ కలిపాడు. మెల్లిగా తాగుతూ కూర్చున్నాడు.

చార్మినార్ ఫిల్టర్ సిగరెట్ వెలిగించాడు. బయట యేదో గోల!

గబగబా వెళ్ళి అతడు కిటికీలోంచి బయటకు

చూశాడు. రోడ్డమ్మట పెద్ద కుక్క పరుగెడుతోంది. కర్రలతో, యినుపకడ్డీలతో కొందరు దాని వెనుక పరుగెడుతున్నారు.

"నలుగుర్ని కరిచిందట!" అందో ముసలిది.

"పిచ్చికుక్క!" అన్నాడు ఒకతను.

"పిచ్చికుక్కను చంపాలి!" అన్నాడొకడు.

నవ్వుకుంటూ అతడు కుర్చీలో కూర్చున్నాడు. పిచ్చి కుక్కను చంపాలి! పిచ్చి కుక్కలా ప్రవర్తించే మనుషులను కూడా చంపవలసిందే అనుకున్నాడు తనలో తాను.

గ్లాసులోని రమ్ తాగేసి మళ్ళా పోసుకున్నాడు. రమ్ తాగుతున్నాడు. సిగరెట్లు కాల్చి పీకలను యాష్ట్రేలో పడేస్తున్నాడు.

గతమంతా యేదో కలలోని దృశ్యంలా అతడికి కనిపిస్తోంది. అతడింకా తాగుతూనే వున్నాడు.

రమ్, విస్కీ, బ్రాందీ యేదో తాగితే గాని తను జీవించలేడు. కుర్చీలో వెనక్కు వాలి అతడు తన గతాన్ని గురించి ఆలోచించసాగాడు.

గతం! రెండేళ్ళ క్రితం సేలమ్‌లో!

చెట్టియార్ ఆఫీసులో ఫ్యాన్‌గా పని ముగించుకుని అతడు యింటికొచ్చాడు. అప్పటికే చీకటి పడిపోయింది.

తలుపు తట్టాడు.

"పద్మా!" అని పిల్చాడు.

జవాబు లేదు. గదిలోకి వెళ్లాడు. గదిలో ఎవ్వరూ లేరు. వంట గది తలుపులు దగ్గరగా మూసి వున్నాయి. తలుపులు తోసి లోపలకు వెళ్లాడు.

"పద్మా!" అని గావుకేక వేస్తూ ముందుకు పడ్డాడు.

నేలమీద పద్మ మాడిపోయిన మాంసం ముద్దలా పడి

వుంది. అతడి ప్రియమయిన చెల్లెలు పద్మ.

అతడు వెక్కి వెక్కి ఏడ్చాడు. నేలమీద పడున్న కాగితం వైపు చూశాడు.

పద్మ ఆఖరి ఉత్తరం!

"అన్నయ్యా!

మునిరెడ్డి వచ్చి తన కామం తీర్చుకుని వెళ్లాడు. అతడిని నే నాపలేకపోయాను. బతికుండి నీ మొహం చూడలేను. మరుపురాని నీ ప్రేమను నా ఆత్మలో మిళితం చేసుకుని పోతున్నా.

నీ చెల్లెలు."

అతడు అర్చినా, ఏడ్చినా ఎవ్వరూ రాలేదు. ఊరుకి దూరంగా వుంది ఆ పురాతన యిల్లు.

అతడి కళ్ళు యెర్రబడ్డాయి. పిడికిలి బిగించాడు. నేల మీద మాడి పడున్న ఆకారం వైపు కన్నీళ్ళతో చూశాడు.

"చెల్లీ! వాడి రక్తం తాగుతాను! వాడిని చిత్రవధ చేస్తాను!" అర్చాడతను.

ఆ రాత్రి పదింటికి అతడు రోడ్డు వారగా నిలబడి చూస్తున్నాడు. మునిరెడ్డి పట్నం వెళ్లాడు. ఈ పాటికి కార్లో వస్తూంటాడు.

కారు హెడ్ లైట్లు దూరంగా కనిపించాయి. తన పక్కనున్న రాళ్ళను అతడు రోడ్డు కడ్డంగా పడేశాడు. కాస్సేపట్లో నల్లటి కారు రాళ్ళ ముందు ఆగింది.

డ్రయివర్ కిందకు దిగాడు. కారు పక్కకు వెళ్లా డతను.

"ఎవడ్రా రాళ్ళు పెట్టింది?" అర్చాడు మునిరెడ్డి.

"నేనురా!" అర్చాడతను.

"నాగరాజా! రా, కారులో కూర్చో! నీ చెల్లెలు యేదో నీతో చెప్పి వుంటుంది. నే నంటే దానికి యిష్ట మని తెలిందిలే!"

తలుపు తెరిచి ఆతడు మునిరెడ్డిని బయటకు లాగాడు. డ్రయివర్ అక్కడి నుండి పారిపోయాడు. "నా చెల్లెలికి నువ్వంటే యెంత యిష్టమో కళ్ళతో చూశానురా రాస్కెల్!" అర్చాడతను.

"నాగరాజా! అయిందేదో అయింది. మనం చెప్పకుంటే గాని యెవ్వరికీ తెలియదు. నీకు ఐదు వేలిస్తాను నన్ను పోనీ!"

"కిరసనాయిల్ మీద పోసుకుని నా చెల్లెలు మాడి పోయిందిరా, నీ కామానికి బలయిపోయింది!"

మునిరెడ్డి వణుకుతున్నాడు. నాగరాజు కత్తి అతడి గుండెలోకి దిగింది. మునిరెడ్డి రోడ్డు వారగా కూలి పోయాడు.

అతడు కసితో మునిరెడ్డిని అనేక చోట్ల పొడిచాడు. రాళ్ళతో అతడి తలను పగులగొట్టాడు. ఇంకా అలా కొడుతూనే వున్నాడు.

కాగడాలతో అనేకమంది మనుషులు అతడిని చుట్టే శారు."

కుర్చీలో కూర్చున్న అతడు తృళ్ళి పడుతూ లేచాడు. గ్లాసులో రమ్ పోసుకుని థమ్సప్ కలిపి తాగుతూ ఉండిపోయాడు.

అదే సమయంలో టి.వి.లో చూపించిన ఫోటోను చూసి లాడ్జి ప్రొప్రయిటర్ కుమరన్ వులిక్కిపడ్డాడు.

"అనేక మారు పేర్లతో యితను వ్యవహరిస్తూ వుంటాడు. వేషం మారుస్తాడు. అమెరికన్ క్రాపు,

సన్నటి మీసాలు వుండొచ్చు. సూటులో వుండొచ్చు. ఇతడు డేంజరస్ హంతకుడు. ఎక్కడయినా కనిపిస్తే పోలీసు రిపోర్టు యివ్వండి. పట్టిచ్చిన వారికి స్పెషల్ యినాముగా ఐదు వేలు యివ్వబడును," అని స్పష్టంగా చెప్పింది టి.వి. అనౌన్సర్.

కుమరన్ వెంటనే ముక్కు పొడుం పీల్చాడు. హాలు నలువైపులా చూశాడు. హాల్లో యెవరూ లేరు.

అతడు డైరెక్టరీ చూశాడు. రిసీవరెత్తి ఒక నంబరు తిప్పాడు. అటు వైపు నుంచి యెవరో "హాలో!" అన్నారు.

"సార్! టి.వి.లో ఫోటో చూపించిన హంతకుడు మా లాడ్జిలో వున్నాడు. వెంటనే రండి," అని చెప్పి వివరాలన్నీ యిచ్చాడు.

# 8

వినాయక్ లాడ్జి ముందు కారాపి దిగాను. పోలీస్ జీపు వచ్చి ఆగింది. ఇన్స్పెక్టర్ నాయర్, ఆరుగురు కానిస్టేబుల్సు కిందకు దిగారు.

వేగంగా నేనూ, ఇన్స్పెక్టర్ నాయర్ హాల్లోకి వెళ్లాం. లాడ్జి యజమాని కుమరన్ మా వైపు వచ్చి నమస్కరించాడు.

"పైకి రండి!" అన్నాడతను.

మెట్లెక్కి పన్నెండో నంబరు గది ముందుకు వెళ్లాం. తలుపు అటువైపు నుంచి మూసి వుంది.

తలుపును మెల్లిగా తట్టాను.

కాస్సేపట్లో తలుపు తెరవబడింది. తూలుతూ అతడు నా వైపు చూశాడు.

ముందుకు దూకి అతడిని బలంగా పట్టుకున్నాను. ఇన్

స్పెక్టర్ నాయర్, యిద్దరు కానిస్టేబుల్సు లోపల కొచ్చి అతడిని పట్టుకున్నారు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ అతడి చేతులకు బేడీలు వేశాడు. అతడు నేలమీద కుప్పలా కూలిపోయాడు.

గదిలో వున్న రమ్ బాటిల్ వైపు చూశాను. "బాగా తాగి వున్నాడు" అన్నాను.

"గదంతా సోదా చేయండి" అర్చాడు నాయర్.

కుమరన్ వినయంగా ఇన్‌స్పెక్టర్ ముందుకు వచ్చాడు.

"ఇతడిని పట్టిచ్చింది నేను సార్. పేరు కుమరన్. ఈ లాడ్జి యజమాన్ని."

"ఐదు వేలు మీ కొస్తుంది" అన్నాడు నాయర్.

నాయర్ నా పక్కనే నడుస్తున్నాడు. కుమరన్ నేలమీద పడున్న వ్యక్తి పక్కనే నిలబడ్డాడు.

అమాంతంగా కుమరన్ అరుపులు గదిలో భయంకరంగా ధ్వనించాయి. కుప్పలా పడున్న అతడు చటుక్కున లేచి కుమరన్ని కాలితో గజబలంతో తన్నాడు.

కుమరన్ గాలిలో యెగిరి గోడకు తల కొట్టుకుని రక్తం కక్కుతూ కిందపడ్డాడు.

"ఆ ఐదువేలూ నీకు దక్కవురా!" అర్చాడతను.

పోలీసులు అతడిని చుట్టుముట్టారు. కుమరన్ని కిందకు తీసుకుపోయారు.

అతడి ముందుకు వెళ్ళి నిలబడ్డాను.

"పవన్‌కుమార్ మీద నీ కెందు కంత కసి?" ప్రశ్నించాను.

"అతడు ధనవంతుడు. ధనవంతు లంటే నాకు అసహ్యం. డబ్బుతో ఏదయినా కొనొచ్చని భావిస్తారు.

నా చెల్లెలు శీలం దోచుకున్న ధనవంతుడు ఐదు వేలిచ్చి నా నోరు మూద్దామనుకున్నాడు. ధనవంతుల మీద నా కందుకే తీరని కసి!" అన్నాడతను.

"అతడి బ్రీఫ్ కేసు నువ్వే పట్టుకుపోయావా?"

"అవును."

"అయితే అతడి నెందుకు చంపావు?"

"నా గురించి రిపోర్టివ్వడానికి అతడు ప్రయత్నాలు చేశాడు. రిపోర్టివ్వనని నాకు హామీ యిచ్చాడు. అందుకు చంపవలసి వచ్చింది."

ఇన్‌స్పెక్టర్ నాయర్ వైపు చూశాను. "నాయర్ భాయ్, యిటు పైన పనంతా నీది. నే వెళ్తాను, గుడ్ నైట్!" అని బయటకు నడిచాను.

—అయిపోయింది—

# కపాలం పగిలిన కలప వ్యాపారి

సికిందర్

ఇన్‌స్పెక్టర్ బాలకృష్ణన్, ఫోన్‌లో ఆత్రుతగా పలికాడు అవతలినుంచి, "మిస్టర్ లాల్, అర్జంటుగా వచ్చేయాలి."

లాల్ లెక్కపెడుతున్న క్యాలెండర్‌లో తేదీల్ని వదిలేసి, "ఏం జరిగింది, కృష్ణన్?" అనడిగాడు పరాకుగా.

లాల్ వదిలేసిన క్యాలెండర్ పైన జాన్ దృష్టి పడింది, గోడమీద. లెక్కించసాగాడు.

"కపాలం పగిలింది, మిస్టర్ లాల్" అన్నాడు కృష్ణన్ అవతల్నుంచి.

లాల్ ముఖం చిట్లించాడు. "ఎవరిది?"

"ఓ కలప వ్యాపారిది."

"ఎక్కడ?"

"దిల్‌సుఖ్ నగర్‌లో—దక్కన్ టింబర్ డిపోలో దీని పార్టనర్ చలపతిరావుకు చెందిన కపాలం నిన్న రాత్రి ఎప్పుడో పగిలింది. తెల్లారి తెలిసింది. మీరు వున్న

పళంగా వచ్చేయాలి, మిష్టర్ లాల్."

"అయితే వచ్చేస్తున్నాం...." అన్నాడు లాల్ ఫోన్ పెట్టేస్తూ.

జాన్ లెక్కించడం పూర్తిచేసి, తిరిగాడు లాల్ వైపు. "ఇంకా తొమ్మిది రోజులే వుంది, పార్టనర్. వచ్చే మూడో తేదీకల్లా ఆ వజ్రం యెక్కడుందో వెతికి అందివ్వకపోతే, పెద్ద గొడవ జరిగిపోతుంది ఆఫీసులో. సేఠ్ దోతేరామ్ భార్య తాను మంచిదాన్ని కానని ముందే చెప్పి వుంచింది."

"మనం ముందే ఫీజు తీసుకోవడం పొరపాటు" అన్నాడు లాల్ నిట్టూరుస్తూ, "వెల్, ఇప్పుడీ కృష్ణన్ కేసు ప్రెజెంటేషన్ విచిత్రంగా వుంది, జాన్."

"ఏమంటున్నాడు?"

"కపాలం పగిలిందన్నాడు, యెవరో కలప వ్యాపారి దట. ప్రాసకోసం ప్రయత్నించి వుంటాడు. తల పగిలింది నొచ్చుగా."

"తల అంటే ముక్కు- నోరు కూడా వస్తాయి."

"వెల్, కపాలం యెలా పగులుతుందంటావు పార్టనర్?"

"దూలం వూడి మీదపడి, గోడకూలి నెత్తిమీదపడి. లారీ కింద అడ్డంపడి. అవసరం ఏర్పడి యెవరైనా ప్రయత్నిస్తే కూడా పగలవచ్చు .... అప్పుడు రాయీ రప్పలు, కడ్డీ కర్రలు లాంటివి సాధనాలవుతాయి."

లాల్ తల విదిలిస్తూ లేచాడు. "అవును, జాన్, కృష్ణన్ ఉన్నపళంగా వచ్చేయమన్నాడు. వెళ్ళిచూద్దాం, లెట్స్‌గో!"

# 2

ఆ మానవాకారమనబడే మాంసపు ముద్ద, ఎండి గట్టి పడిన రక్తపు మడుగులో మునిగివుంది.

వయసు చెప్పక్కర్లేదు. శరీరం అతనిది స్థూలకాయం. ఆకస్మికంగా ఇలా మృత్యువాత పడకపోతే ఇంకో ఇరవై ఏళ్ళకు సరిపడా చేవ వుందతని శరీరంలో. కానీ అస్తిత్వానికెన్నో అడ్డంకులీ ప్రపంచంలో. ఇతనికీ అడ్డంకి ఎదురయిందో, లేక తనే అడ్డంకి అయ్యాడో గానీ, మొత్తంమీద ఆనవాలుపట్టకుండా మరణం పాలయ్యాడు.

ఒక చిన్న తుపాకీ తూటా అతని శిరస్సుని ఖండ ఖండాలుగా చెండాడి, కింద చెల్లాచెదురుగా విసిరేసింది.

చెక్కతో నిర్మించబడ్డ ఆ కలప వ్యాపారి కేబిన్‌లో స్థూలంగా కన్పించే దృశ్యం ఇది—

తలుపుకు సూటిగా, ఎనిమిదడుగుల దూరంలో, ప్లెయ్‌వుడ్ బిగించిన గోడవారగా ఒక వాలుబల్ల, దాని వెనుక చెక్క కుర్చీ, ఆ కుర్చీకి కుడివైపున గోడకు సమాంతరంగా కింద పడివున్న శవం! దాని వంటిమీద పైజామా లాల్చీ, చలికి ఆకుపచ్చరంగు స్వెట్టర్, చేతులకి అదే రంగు ఉల్లెన్ గ్లవ్స్, కుర్చీ హేండిల్ మీద బూడిద రంగు మఫ్లర్; వాలుబల్ల ముందు కిందపడి వున్న ఒక టొయ్యరీపర్, దాని ప్రక్కనే రైఫిల్.

రైఫిల్ బ్యారెల్ డెస్కువైపుకు—బట్ సూటిగా తలుపువైపు.

టొయ్యరీపర్ రెండడుగుల పొడవు—అంగుళంన్నర మందంతో వుంది.

డెస్కుమీద ఏ వస్తువులూ లేవు-ఒక చిన్న కాగితం ముక్క తప్ప.

ఆ కాగితంమీద వంకరటింకర అక్షరాలు—

'భార్యను అదుపుచేయక పోయాను....ఎందుకీ జీవితము? అవమానంతో బ్రతుకుట కన్న చచ్చుట మేలు!'

డెస్కు డ్రాయర్స్ లాక్ చేసి వున్నాయి. తలుపు కిరువైపులా రెండు కిటికీలు తెరచి వున్నాయి. పైన రెండు ట్యూబులైట్లు వెలుగుతున్నాయి. ఫ్యాను ఆగి వుంది. తలుపు యెడమప్రక్క ఒక బెంచి వుంది. డెస్కు చెరోప్రక్క రెండు కుర్చీలున్నాయి. డెస్కు వెనుక కుర్చీ యెడమప్రక్కన షెల్ఫు వుంది. దానిమీద టెలిఫోను, మరికొన్ని ఇతర వస్తువులున్నాయి.

"దట్స్ ది ట్రాజడీ!" అన్నాడు కృష్ణన్ డిటెక్టివ్ లకు చూపిస్తూ.

వాళ్ళు కన్నార్పకుండా నిశితంగా చూస్తున్నారు.

కేబిన్ బయట గుసగుసలు వినిపిస్తున్నాయి.

శవం తల ప్రేలి బోర్లా పడి వుంది. ఫోటోగ్రాఫర్ వివిధ కోణాల్లో స్నాప్స్ తీసుకున్నాడు. అప్పుడిద్దరు ఇన్స్పెక్టర్స్ కొలతలు తీసుకోసాగారు. డాక్టరు శవాన్ని పరీక్షించసాగాడు.

డిటెక్టివ్ లు మౌనంగా గమనిస్తున్నారు.

కొలతలు తీసుకోవడం పూర్తయ్యాక ఫింగర్ ప్రింట్సు మనిషి స్వామి రంగంలోకి దిగాడు.

అతను కింద కూర్చుని మొదట రైఫిల్ ని పట్టు కున్నాడు గ్లవ్స్ తొడిగిన చేతులతో. ముందు రైఫిల్ మజిల్ ని పరిశీలించడం ప్రారంభించాడు.

అది 12 బోర్ సింగిల్ బ్యారెల్ గన్. ఆరున్నర పౌన్ల బరువుంటుంది. స్వామి మజిల్ పైన ఆటోమైజర్ తో

యూనివర్సల్ గ్రే పౌడర్ స్ప్రే చేశాడు. తర్వాత కెమెల్ బ్రష్‌తో సున్నితంగా అద్దుతూ చూడసాగాడు, భూతద్దం పట్టుకుని. అసంతృప్తిగా ముఖం చిట్లించి, ఆ తర్వాత ఇరవైయెనిమిది అంగుళాల బ్యారెల్ పొడుగూతా పౌడర్ స్ప్రే చేసి చూశాడు. మళ్ళీ అలాగే ముఖం చిట్లిస్తూ లాక్, స్టాక్, మొత్తం రైఫిల్‌నీ స్ప్రే చేసి చూశాడు. మళ్ళీ అదే ముఖంతో మాగజైన్ విప్పి అందులోంచి ఖాళీ తోటా తీశాడు. దాని పరిశీలన కూడా అతన్ని తీవ్రంగా అసంతృప్తి పర్చింది.

డిటెక్టివ్‌లు అతన్నే గమనిస్తూంటే డాక్టర్ లేచి వచ్చాడు శవం దగ్గర్నుంచి.

"మిస్టర్ లాల్—" చెప్పాడతను, "పన్నెండూ మూడు గంటల మధ్య ఫిక్స్ చేయవచ్చు, రాత్రి. ఇంకా ఖచ్చితంగా యే నిమిషాని కన్నది యిప్పుడే చెప్పలేను. రిగర్ మార్టిస్ సెట్ అయి అప్పుడే రిలాక్స్ అయింది. చావు తర్వాత సుమారు ముప్పావు గంట నుంచీ శవం చల్లబడడం ప్రారంభించటమన్నది మామూలు మనుషులకి వర్తించినా - స్థూలకాయుల విషయంలో అలా అనుకోలేము. వీళ్ళ శరీరంలో క్రొవ్వు బ్యాడ్ కండక్టర్ మిస్టర్ లాల్. రేడియేషన్‌ని మందగింపజేస్తుంది. పైగా ఈ శవం రాత్రంతా చలిలో పడి వుంది. చల్లదనానికి బాగా ఎక్స్‌పోజ్ అయింది. రిగర్ మార్టిస్ అప్పుడే అదృశ్యమయింది. అఫ్‌కోర్స్, తుపాకీ కాల్పుల్లో అది త్వరగా ప్రారంభమై త్వరగా వదులుతుందనుకోండి....కానీ ఈ పరిసరాల ప్రభావం కూడా చాలా వుంటుంది. ఈ చుట్టుపక్కల కలపదుంగలూ, కార్ఖానా పొట్టూ చలిని ఇంకా పెంచుతాయి...."

లాల్ తలూపాడు.

స్వామి లేచి వచ్చాడు, శవం జేబులు వెతుకుతున్న కృష్ణన్ దగ్గరికి. "గన్ క్లీన్‌గా వుంది ఇన్‌స్పెక్టర్. ఒక్క ప్రింట్ కూడా లేదు" అన్నాడతను.

"అది శవం చేతులు మూసే గ్రహించానులే...." నవ్వాడు కృష్ణన్.

"పార్ట్‌నర్, శవం కుర్చీలోంచి దొర్లింది గానీ, కుర్చీ అలాగే వుంది" అన్నాడు జాన్ చూపిస్తూ.

లాల్ చూసి శవం వైపు తిరిగాడు: "అవును, అతను కాల్చుకున్నప్పుడు కుర్చీలోనే వుండాలి. రైఫిల్ పొజిషన్, ఈ రీపర్ ప్రెజెన్స్ చెపుతున్నాయి."

జాన్ కదిలి డెస్కు వెనక్కు వెళ్ళాడు. అక్కడ గోడకు బిగించి వున్న ప్లయివుడ్ షీట్స్‌ని పరిశీలిస్తూ చటుక్కున లాల్‌ని పిలిచాడు—

"పార్ట్‌నర్, కమాన్, మరో క్లూ!"

లాల్ వెంటనే వెళ్ళి జాన్ చూపిస్తున్న వైపు చూశాడు. అవి 3 *m.m.* షీట్లు. కుర్చీకి కుడి పక్కగా వాటి మీద రక్తపు మరక లున్నాయి. అవి అనేక పాయలుగా విడిపోయి కిందికి ధారలుగా పారిన చారలు కనిపిస్తున్నాయి. వాటికి కొంచెం పైన, ప్లయివుడ్ మీద సున్నని రంధ్రాలు అగుపిస్తున్నాయి.

"బుల్లెట్ రవ్వలు చేసి వుంటాయి" చెప్పాడు జాన్.

"అదే జరిగింది" అని ఫోటోగ్రాఫర్ని పిలిచాడు లాల్.

అతను వచ్చి అక్కడ ఫోటోలు తీశాడు.

తర్వాత లాల్ స్వామిని పిల్చాడు: "ఇక్కడ ప్రయ

త్నించు" అన్నాడు చూపిస్తూ.

అతను వూనుకోగానే లాల్ కదిలి డాక్టర్ దగ్గర కొచ్చాడు.

కృష్ణన్ తన సహచరులతో నోట్స్ వ్రాసుకుంటు న్నాడు.

బయట గుసగుసలు వినిపిస్తూనే వున్నాయి.

"డాక్టర్!" అన్నాడు లాల్ శవం వైపు చూస్తూ, "వెరీ సారోఫుల్ డెత్ కదూ? మీ కిది కాంప్లికేటెడ్ కేసు కావచ్చు."

"ఎందువ కాంప్లికేటెడ్?" అడిగాడు డాక్టర్.

"శవం తల చూడండి ఎలా బరస్టయిందో. దాన్నుంచి మీరు రేంజాఫ్ ఫైర్, బుల్లెట్ ట్రాక్ కాదు కదా — పాయింటాఫ్ ఎంట్రీ కూడా తీయలేరు!"

## 3

సాక్షుల విచారణ ప్రారంభమయింది—

బయట గుసగుసలాడుకుంటూ వున్న వాళ్ళు నల్గురూ, ఒక ప్రక్కనుంచి స్ట్రెచర్ మీద శవం వెళ్ళిపోతూంటే విషాద వదనాలతో చూశారు. వాళ్ళల్లో యాభై ఏళ్ళు వున్న ఒకతను ముందు పలికాడు ప్రశ్నలకి:

"నేనే సార్, రిపోర్టు చేసింది మీకు. నా పేరు కామరాజు. ఎకౌంట్స్ గుమాస్తాగా ఎనిమిదేళ్ళగా వుంటున్నాను. నిన్నా, యివాళ కూడా సెలవు లివ్వడం వల్ల మా కార్పెంటర్స్ గానీ, మిల్లు వర్కర్స్ గానీ రాలేదు. నేను తొమ్మిదిన్నరకి ఉదయం మామూలుగా వచ్చి చూస్తే యిక్కడ యిలా కన్పించింది! గాభరాపడి వెంటనే మీకు ఫోన్ చేశాను సార్ బయట నుంచి.

నా కేమీ బోధపడడం లేదు. కొన్ని రోజులుగా

ఆయన కలతగా వుండడం చూస్తున్నాను.... కానీ ఇలా చేస్తారని మాత్రం అనుకోలేదు! రాత్రి నేనిక్కడ ఆయనతో యెనిమిదిన్నర వరకూ వున్నాను. ఆ సమయంలో బాగానే కన్పించారు. ఇంట్లో భార్యా, పిల్లల్ని వూరికి పంపించారు పండక్కి. అందుకని నిన్న పండుగయినా ఆయన యిక్కడే వుండిపోయారు లెక్కలూ అవీ చూసుకుంటూ. నేను వెళ్ళిపోయాక యెప్పుడు చేసుకున్నారో ఈ పని—గోడకున్న తుపాకీ తీసుకుని.

సార్! ఆ తుపాకీ ఆయన కిలా ఉపయోగపడుతుందని కొంచెమయినా అనుమానం వస్తే దాన్నిక్కడ ఉండనిచ్చేవాడ్ని కాదు. అది ఆయనదే. తండ్రి నుంచి సంక్రమించింది.... ఆయన అడవి కెళ్ళి జంతువుల్ని కొట్టేవారు. ఆయన పోయాక తెచ్చి యిక్కడ పెట్టారు అలంకార ప్రాయంగా. దాంతో నే యింత అఘాయిత్యం చేసుకుంటారని తెలిస్తే .... ఆ చీటీ కూడా వ్రాసి పెట్టడం నా కింకా ఆందోళనగా వుంది."

"రాత్రిపూట యిక్కడ యెవరూ వుండరా?" అడిగాడు లాల్.

"రాజయ్య వుంటాడు. కానీ నిన్న పండగని రాలేదు."

లాల్ మిగతా ముగ్గురి వైపు తిరిగాడు: "మీరు ఆయన పార్ట్ నర్స్ అనుకుంటాను?"

ముగ్గురూ తలలూపారు విషాదంగా.

"దీని గురించి మీ రేం చెప్తారు?"

"మాకేం తెలియడం లేదు డిటెక్టివ్ సాబ్!" అన్నాడు బట్టతలతను. తన పేరు జానకిరాం అని చెప్పాడు.

లాల్ కోలమొహం అతన్ని చూశాడు: "మీ పేరు?"

"జంగారెడ్డి" అన్నాడతను చిన్నగా.

చిలకముక్కతను తన పేరు జగపతిరావు అని చెప్పాడు.

బట్టతల, కోలమొహం, చిలకముక్కు పార్టనర్స్ ముగ్గురూ అతివినయంగా అడిగినవాటికి చెప్పారు.

"లేదు, బిజినెస్‌లో మాకేం గొడవల్లేవు, సార్."

"మేం నల్గురం అన్నదమ్ములవంటివారం."

"మాకెప్పుడూ అభిప్రాయ భేదాలు రాలేదు."

"మేనేజిమెంటు అంతా చలపతిరావు ఒక్కడిదే."

"కష్టనష్టాలకి పూర్తి బాధ్యత అతనిదే."

"అలాగని ఇంతవరకు ఏ అనర్థం వాటిల్లలేదు."

"చలపతి లాభాలు పెంచుతున్నాడు."

"చలపతిమీద మాకు పూర్తి విశ్వాసముంది."

"లేదు, మేం విడిపోయే ప్రసక్తి యెప్పుడూ లేదు."

"ఊహుఁ, అతని కుటుంబ విషయాలు మాకేం తెలియవు."

"రాత్రి మేమంతా మా ఇళ్ళ దగ్గరే వున్నాం."

"ఈ దుర్ఘటన మాకిప్పుడే తెలిసింది."

"వాడు లేని లోటు తీరేది కాదు!"

ముగ్గురూ కన్నీరు కార్చారు.

## 4

ఇన్‌స్పెక్టర్ కృష్ణన్, డాక్టర్ రఘునాథ్‌లతో డిటెక్టివ్‌లు సాయంత్రం అయిదు గంటలకి కూర్చుని కేసుని చర్చించసాగారు....

కృష్ణన్ తన రిపోర్టు విన్పించాడు. అందులో కొత్తగా

ఏమీ లేదు. కనుగొన్న క్లూస్, ప్రశ్నించిన సాక్షుల కథనం, ఘటనా సంవర్ణన తప్ప.

ఘటనా సంవర్ణనలో పోస్టుమార్టమ్ వివరాలు కూడా మిళితం చేస్తూ, అది ఆత్మహత్య కావచ్చని అభిప్రాయం వెలిబుచ్చాడు.

డాక్టర్ దాన్ని సమర్థించాడు.

లాల్ అభ్యంతరం తెలిపాడు. "తీర్మానాలు అప్పుడే వద్దు. మీరు చావుని ఒంటి గంటన్నరకు ఫిక్స్ చేశారు, రాత్రి. అక్కడ స్వకీయ సంఘటనగా ఆధారాలున్నంత మాత్రాన అలా భావించకూడదు. ఆధారాలు సృష్టించబడవచ్చు. ఓ కొయ్య రీపర్‌నీ, ఉత్తరం ముక్కనీ ప్లాంట్ చేసే అది సులువుగా సూసైడ్ కేసైపోతుంది— అని ఆ సృష్టికర్తలు భావించవచ్చు. కానీ ఆ సృష్టించే ప్రయత్నంలో వాళ్ళ వూహ కందని ఆధారాలు కొన్ని ఏర్పడవచ్చు. అవి మనం పసిగడితే వాళ్ళ సృష్టి ఏ తర్కానికీ నిలవదు."

"అత నెలా కాల్చుకున్నాడు? వినిపించండి."

"అత నప్పుడు కుర్చీలో కూర్చుని వున్నాడు మిస్టర్ లాల్. అప్పుడు రైఫిల్ బ్యారెల్‌ని తనకేసి పట్టుకుని, మజిల్‌ని నుదుటి కానించుకొని రెండో చేత్తో ట్రిగ్గర్ లాగేశాడంతే!" అన్నాడు డాక్టర్.

"అదెలా లాగాడు? చేయి ట్రిగ్గర్ గార్డు వరకూ అందిందా?"

"లేదు. ఆ రీపర్ సహాయంతో చేశాడు. రైఫిల్‌ని ఒక చేతితో పట్టుకుని రెండో చేతిలోని రీపర్‌తో ట్రిగ్గర్‌ని వెనక్కి వత్తి పట్టాడు, అంతే!"

"అప్పుడు బ్రహ్మాండమయిన శక్తితో బుల్లెట్ అతని

బుర్రను బద్దలు కొట్టిందన్నమాట!"

"అంతే!"

"అందుకే బ్రెయిన్ చెల్లాచెదురయింది" అన్నాడు జాన్.

"ఆ వెంటనే రైఫిల్ వదిలేసి తల పట్టుకుని కుర్చీలోంచి పడిపోయాడన్నమాట!" లాల్ విస్మయంగా అన్నాడు.

"మిస్టేక్ మిస్టర్ లాల్!" అన్నాడు కృష్ణన్ మీసం దువ్వుతూ.

"చెప్పండి."

"తల పట్టుకోలేదు. అప్పుడు గ్లవ్స్‌కి రక్తం అంటేది!"

"ఓహ్. కానీ కుర్చీ కదలకుండానే కింద పడిపోయాడు కదూ?"

"కుర్చీ ఎందుకు కదల్లేదో నాకు తెలియదు."

"మీకు మరొకటి కూడా తెలియదు."

"ఏమిటి?"

"డెస్కు మీద రక్తం ఎందుకు లేదనేది?"

"అది నాకింకా స్ఫురించలేదు."

"కుర్చీ డెస్కుకి యెంత దూరంలో వుందో గమనించారా?"

"గమనించాను. అడుగు దూరంలో వుండొచ్చు. పూర్తిగా గోడ కానుకుని వుంది."

"వెల్. ఆ పొజిషన్‌లో, అంత దూరంలో కూర్చుని మీరు డెస్కు మీద వర్క్ చేసుకోగలరా?"

"కుర్చీని దగ్గరకు లాక్కుంటాను."

"కానీ హంతకుడు నూలకాయుడు!" డాక్టర్

అన్నాడు.

"డెస్కు కింద కాళ్ళు పట్టేంత స్థలం వుంది" అన్నాడు లాల్. "అతను కుర్చీని దగ్గరికి జరుపుకోకుండా డెస్కు మీద వర్క్ చేయలేదు. అతడా ఉత్తరం డెస్కు మీదే వ్రాశాడని నా నమ్మకం."

"డెస్కు మీదే కాల్చుకున్నాడు కూడా!" కృష్ణన్ అన్నాడు.

"ముందు దీనికి జవాబివ్వండి. అతను డెస్కు మీద ఉత్తరం వ్రాశాడంటే, కుర్చీని దగ్గరికి జరుపుకుని కూర్చున్నాడు అనేగా అర్థం?"

"అవును."

"కానీ యిప్పుడు కుర్చీ వెనక్కి జరిగి వుంది. అతను కింద పడిపోయి వున్నాడు. ఏమిటి యిప్పుడు దీని అర్థం?"

"అంటే....అంటే....అతను లేచాడంటారా?"

"అంతే!"

"నేను నమ్మను!"

"ఎందుకు నమ్మరు? తన్ను తాను కాల్చుకుంటే లేచే అవసరం లేదు. అలాగే కూర్చుని చనిపోవాలి. శరీరం బరువుకి కుర్చీ ఒరిగితే దానితో పాటు పడిపోవాలి. అలా జరిగిందా? అతడెందుకో హఠాత్తుగా లేచి—బుల్లెట్ తగిలే ముందు—కుర్చీని వెనక్కి తోసేసి పరుగెత్తాడు, కృష్ణన్."

"ఎందుకు? ఎందుకు పరుగెత్తాడు?"

"ముందు డాక్టరుగారు కొన్ని విషయాలు చెప్పాలి."

"ఏమిటి?" డాక్టర్ ప్రశ్న.

లాల్ అతన్నడిగాడు. "హంతకుడు రైఫిల్ మజిల్ని

నుదుటికి ఎత్తి పట్టుకొని, బట్ ని డెస్కు అంచున మోపి, ట్రిగ్గర్ లాగేసుకున్నాడన్నారు కదూ మీరు?"

"అవును."

"అంటే బుల్లెట్ కొంత కోణం చేస్తూ తగిలిందన్న మాట."

"అవును, తప్పకుండా కోణం చేస్తుంది. అది అంచనా కట్టాను. బల్ల వెడల్పు రెండున్నర, బల్లమీద నుంచి మృతుడి నుదుటికి ఎత్తు ఒకటిన్నర, రైఫిల్ మొత్తం పొడవు మూడడుగులు. ఈ లెక్కన అరవై డిగ్రీల యాంగిల్ వస్తుంది సుమారు...."

"ఇంకా ఎక్కువ రాదంటారా?"

"రాదు. బుల్లెట్ తగిలినప్పుడు అతని పొజిషన్ అది."

"అంటే అది కాంటాక్టు షాట్ అన్నమాట!"

"కావచ్చు...."

"కానీ కాదని మనకో ఆధారం వుంది, డాక్టర్. కుర్చీ ప్రక్కన ప్లయివుడ్ మీద రక్తపు మరకలూ, రంధ్రాలూ చూశారుగా? వెల్, ఆ రక్తం మరకలు అతను తల విదిల్చినప్పుడు ఏర్పడ్డవనుకోవచ్చు. అసహజం లేదు. కానీ ఆ రంధ్రాలు? అవెలా అయ్యాయి బోర్డు మీద? అది కాంటాక్టు షాట్ అయితే బుల్లెట్ రవ్వలు ప్రక్కలకి విరజిమ్మవు. కొంతదూరం-రేంజిలో వున్నప్పుడే అలా జరుగుతుంది. కాబట్టి అది కాంటాక్టు షాట్ అనుకోవచ్చా ఇప్పుడు?"

డాక్టర్ ఇబ్బందిగా చూశాడు.

"రేంజి నిర్ణయించడం కష్టమే, మిస్టర్ లాల్. అది కాంటాక్టు షాట్ కావచ్చన్నానుగానీ కచ్చితంగా

అనలేదు. హంతకుడు నే చెప్పిన విధానంలో గన్ని ఉప యోగించి వుంటాడన్న వూహాకే ఈ కాంటాక్టు షాట్ ఆధారమయింది.

వాస్తవానికి కాంటాక్టు షాట్లో గన్ పౌడర్, గేసెస్, మెటాలిక్ పార్టికల్స్ అన్నీ బుల్లెట్తో పాటే అది వెళ్ళిన ట్రాక్లోనే గాయంలో కల్సిపోతాయి. గాయం అయినచోట బర్నింగ్ స్పష్టంగా కనిపిస్తుంది. పాయింటాఫ్ ఎంట్రీ కూడా స్పష్టంగా వుంటుంది. గాయం లోపల, బుల్లెట్ ట్రాక్ వెంబడి కణాలు నారింజ రంగులోకి మారిపోతాయి, కార్బన్ మోనాక్సైడ్ వల్ల."

"నో, అది కాంటాక్టు షాట్ అయివుండదు. పైన చెప్పిన మార్పులేవీ జరుగలేదు. కొంత దూరంనుంచి షూట్ చేయబడింది. అందువల్లనే బుల్లెట్ రవ్వలు ప్రక్కలకు విరజిమ్మాయి. బోర్డులో రంధ్రాలను చేశాయి. ఆ దూరం ఎంత అన్నది ఈ సితిలో వున్న గాయాన్ని బట్టి సాధ్యంకాదు, మిష్టర్ లాల్. తల బద్దలయింది"

"మరి?"

"వూహామాత్రంగా చెప్పగలను. అది కాంటాక్టు షాట్ కాకపోతే క్లోజ్ షాట్ కావచ్చు. రేంజి కొన్ని అంగుళాలే వుండవచ్చు. మరొకటి, మజిల్ని పూర్తిగా తలకాన్చుకొని — అంటే కాంటాక్టు సితిలో రైఫిల్ ట్రిగ్గర్ లాగడానికి ఆతనికా రీపర్ అవసరంలేదు. ఆ మేరకు చెయ్యి అందుతుంది. మజిల్నుంచి ట్రిగ్గర్ గార్డు వరకు ఇరవైయెనిమిది అంగుళాలే. కాబట్టి ఇలా అతను రైఫిల్ని ట్రిగ్గర్ చేతికందినంత దూరంలో వుంచి పట్టు కున్నాడనుకోవచ్చు. అందుకే రీపర్ అవసరమైంది.

షాట్ తినగానే సహజంగానే ఆ రీపర్‌నీ, రైఫిల్‌నీ వెనక్కి నెట్టేశాడు. అవి కింద పడిపోయాయి...."

"కానీ డాక్టర్, అది క్లోజ్ రేంజి కూడా కాక పోవచ్చునుకుంటాను" అన్నాడు లాల్.

"ఓహ్, మరి? మీ రేమనుకుంటున్నారు?"

"అది క్లోజ్ రేంజి అనుకున్నప్పటికీ ప్రశ్న వుండనే వుంది-డెస్కు మీద, ఆ ఉత్తరంమీద, అతని బట్టలమీద, డెస్కు కింద, రక్తం మరకలు యెందుకు కాలేదు? రక్త మంతా అతను పడ్డచోటే ఎందుకుంది?"

"పడ్డచోటే దెబ్బతిన్నచోటు కాబట్టి!" జాన్ చెప్పాడు.

"వాట్ నాన్సెన్స్! ఇంత నాన్సెన్స్ నేనెప్పుడూ వినలేదు!" కృష్ణన్ రెచ్చిపోయాడు.

"మరి ఈ నాన్సెన్స్ నెలా సమర్థిస్తారు?" జాన్ విరుచుకుపడ్డాడు, "తండ్రి కాలంనాటి తుపాకీ తుప్పుపట్టి గోడకి వేలాడుతుంటే, తీసి అప్పటికప్పుడు తూటానింపి కాల్చుకున్నాడా? యెక్కడిదా తూటా? రైఫిల్ శుభ్రంగా తుడిచి వుంది. ఎప్పుడు క్లీన్ చేశాడు దాన్ని? ఆ సరంజామా ఏది? అతను క్లీన్ చేసినట్టు ఆధారా లున్నాయా? అత నెప్పుడు చావాలనుకుని ఈ ఏర్పాట్లన్నీ చేసుకున్నాడు? ఎక్కౌంట్స్ గుమాస్తా చూసినప్పుడు అతను మంచి కండిషనులో వున్నాడు. ఆ తర్వాత కొద్ది సేపటికే చచ్చిపోవాలని నిర్ణయించుకుని రైఫిల్‌ని సిద్ధం చేసుకున్నాడా? రాత్రికి రాత్రి తూటా సంపా యించాడా? ఓహ్, వాటె షీర్ నాన్సెన్స్!"

కృష్ణన్ కిటికీకేసి చూశాడు.

అతను తీవ్రంగా యోచిస్తున్నట్లు కనిపించాడు.

"అందుకే అతను కుర్చీలోంచి లేచి పరుగెత్తా డన్నాను" అన్నాడు లాల్.

"ఇప్పుడు సిట్యుయేషన్‌ని చూద్దాం: కొన్ని అంగుళా లుంటుందన్న డాక్టర్‌గారి రేంజి ఇప్పుడు కొన్ని అడుగు లుండవచ్చన్న డిటెక్టివ్ లాల్ రేంజిగా మార్పు చెందింది. అది కచ్చితంగా కొన్ని అడుగుల దూరం నుంచి షూట్ చేయబడింది. అది జరుగుతున్నప్పుడు అతను యాక్షన్‌లో వున్నాడు. అంటే లేచి వురుకుతున్నాడు. అందుకే డెస్కుమీద గానీ, కుర్చీమీద గానీ, అతని బట్టలమీద గానీ రక్తంలేదు. బుల్లెట్ తగలగానే కింద పడిపోయాడు.

ఇక బుల్లెట్ కోణాన్ని డాక్టరుగారు అరవై డిగ్రీలుగా చెప్పారు. ఆయన చెప్పిన పద్ధతిలో ఆ ఘటన జరుగలేదని ఇప్పుడనిపిస్తోంది గాబట్టి, ఆ యాంగిల్ కూడా అనుమానాస్పదమే అవుతుంది.

"ఎందుకంటే—అది రైఫిల్ పొజిషన్‌ని కిందినుంచి పైకి వాలుగా సూచిస్తుంది. అది నిజమైతే అప్పుడా బోర్డుమీద రంధ్రాలు అతని తలమీదుగా పైన ఏర్పడేవి. కానీ అవి నడుము ఎత్తులో కిందికే వున్నాయి.

కాబట్టి రైఫిల్ పొజిషన్ కిందినుంచి పైకి కాదు. పైనుంచి కిందికి వాలుగా వుందని దీన్నిబట్టి తెలుసుకో వచ్చు. అందువల్ల బుల్లెట్ యాంగిలు పెరుగుతుంది. చాలా పెరుగుతుంది.

ఇక ఈ యాంగిలునీ, రేంజినీ మనం ప్రాక్టికలుగా చూసి నిర్ధారించుకోవచ్చు. అంతవరకు ఈ చర్చని ఆపేద్దాం. మిస్టర్ కృష్ణన్, ఇప్పుడొకసారి మనం

అక్కడికి వెళ్దాం. నేననుకుంటున్నది ఎంతవరకు నిజమవు తుందో చూద్దాం. ఇస్కందర్ ఎక్కడున్నాడు? అతన్ని కూడా తీసికెళ్తే మంచిది—"

చెప్పి అక్కడ్నుంచి లేచాడు లాల్.

## 5

బాలస్టిక్స్ ఎక్స్‌పర్టు ఇస్కందర్ ఆ కేబిన్‌లో చుట్టూ చూసి, భుజాలెగరేశాడు.

"ఇక్కడ నేనేం చేయాలి, మిస్టర్ లాల్?" అన్నాడతను తికమకగా చూస్తూ.

లాల్ డెస్కు వెనక్కి అతన్ని తీసుకెళ్ళాడు. కృష్ణన్, జాన్‌లు కూడా వెళ్ళారు.

లాల్ అక్కడ ప్లయివుడ్ మీద చూపించాడు. "ఈ రంధ్రాలు దేనివో మీకు తెలుసు, ఇస్కందర్. వీటి సాయంతో మనమిప్పుడు రేంజిని తెలుసుకోబోతున్నాం. తద్వారా యాంగిలుని. యూ సీ, ఇస్కందర్, రైఫిల్ ఏ యాంగిలులో వుంటుందో ఈ రంధ్రాలూ అదే యాంగిలులో ఏర్పడతాయి. వీటిలోకి జాగ్రత్తగా మనం సూదులు—లేక పుల్లలు—అగ్గిపుల్లలు దూర్చామనుకోండి, ప్రతి పుల్లా ఒక కోణం చేస్తూ వలయాకారంగా నిలబడతాయి. అప్పుడు వాటన్నిటి చివరల్ని వెనక్కి పొడిస్తే అవన్నీ ఒక కేంద్రంవద్ద కలుసుకుంటాయి. ఆ కేంద్రం దేని దవుతుంది?"

"గన్ పాయింట్!"

"క్వయిట్ రైట్! ఈ రేఖలన్నీ కలుసుకునే బిందువు వద్ద గన్ వుంటుందన్నమాట!"

కృష్ణన్ ఆశ్చర్యంగా చూశాడు.

జాన్ నవ్వాడు అతన్ని చూసి.

"నా పార్ట్‌నర్ బ్రెయిన్" అన్నాడతను.

"మీ బ్రెయిన్ ఇలా వుండటానికి మీరేం తింటారూ?" ఓర్వలేక అరిచాడు కృష్ణన్.

"నేనేమీ తినను, అదే నన్ను తింటుంది" చెప్పి నవ్వాడు లాల్.

అతను జేబులో అగ్గిపుల్లల్ని చెక్కి అందిస్తోంటే, ఇస్కెందర్ వాటిని రంధ్రాల్లోకి దూర్చసాగాడు. కాస్సేపటికి అవన్నీ బోర్డుమీద వలయాకారంలో నిలిచాయి.

అవన్నీ పైకి బెండ్ అయివున్నాయి.

లాల్ అందించిన కాంపాస్‌తో ఇస్కెందర్ వాటి కోణాల్ని కొలిచి నోట్ చేసుకున్నాడు.

అవన్నీ అటు ఇటుగా నూటాముప్ఫై డిగ్రీలున్నాయి.

"డాక్టర్ అన్నదానికి రెట్టింపు" చెప్పాడు లాల్.

ఇస్కెందర్ ఆ వృత్తంలో కావల్సిన అంశాలు తీసుకుని పేపర్ వర్క్ చేశాడు కాస్సేపు.

అప్పుడు ఉద్రేకంగా లేచి చెప్పాడు.

"ఎనిమిది అడుగులు, మిస్టర్ లాల్!"

కృష్ణన్ విస్తుపోయి చూశాడు.

జాన్ వెంటనే మెజరింగ్ టేప్ తీసి లాల్ కదిం చాడు. లాల్ దాని మొదలు పట్టుకుని బోర్డుకి పెట్టాడు. జాన్ వెనక్కి జరుగుతూ ఎనిమిది అడుగుల దూరాన్ని తలుపవతల మొదటి మెట్టుమీద మార్క్ చేశాడు.

"గాడ్!" అన్నాడు కృష్ణన్.

"ఆ పాయింట్ దగ్గర ఎత్తు చెప్పండి, ఇస్కెందర్!" లాల్ అన్నాడు.

ఇస్కెందర్ టేపు తీసుకుని బోర్డుమీద రంధ్రాలనుంచి

కేలమట్టంవరకు దూరం కొలిచాడు. ఆ తర్వాత మళ్ళీ కాస్సేపు జామెట్రీ వర్క్.

చివరికి తేల్చాడు. "అయిదున్నర అడుగులు, మిస్టర్ లాల్!"

"ఓహ్, ఆ వ్యక్తి అరడుగులుంటాడన్నమాట!"

"భుజంమీద మోపి షూట్ చేసివుంటే!"

"ఓ.కే. జరిగింది హత్య అని తేలింది. ఇక హంతకుడ్ని తేల్చాలి!"

"అవును, లాల్" చెప్పాడు జాన్. "ఇలాగే తేలుతుంది. లేకపోతే జవాబు దొరకని ప్రశ్నలు. ఆ రైఫిలు కండిషన్, అందులో ఉపయోగించిన అమ్యూనిషన్ ఆధారంగా నా అనుమానం నిజమే అయింది—ఇది ఆత్మహత్య కాదని!"

"అవును.... రైఫిలు కండిషన్, అమ్యూనిషన్...." అటూ ఇస్కిందర్ వైపు తిరిగాడు లాల్. "ఈ రెంటినీ మీరు గమనించారనుకుంటాను?"

తలూపాడు ఇస్కిందర్. "గమనించాను. రైఫిలు చాలాకాలంగా ఉపయోగంలో లేదు. ఇటీవలే తీసి శుభ్రం చేయబడింది .... ముందు కిరోసిన్‌తో కడిగి, తర్వాత వైట్ వేజిలిన్‌తో క్లీన్ చేసినట్టు అన్పిస్తోంది... అసలు ఈ రకం గన్స్‌ని క్లీన్ చేసే అవసరముండదు, మిస్టర్ లాల్. 22 రకం గన్స్‌ని క్లీన్ చేయకున్నప్పటికంటే, చేసినప్పుడే దీనికెక్కువ హాని — బ్యారెల్లో వుండే అతి సున్నితమైన గ్రూవ్స్ అరిగి బుల్లెట్ వేగాన్ని హరిస్తాయి. తద్వారా ఇంపాక్ట్‌ని.

"ఈ రైఫిల్స్‌లో ఇప్పటి మోడరన్ అమ్యూనిషన్ నే ఉపయోగిస్తాం గనుక, ఈ బుల్లెట్స్ ఫైర్ అయినప్పుడు

వెలువడే గన్ పౌడర్, బ్యారల్ లోపల గ్రూవ్స్‌మీద ఆల్కలైన్ కోటింగ్‌ని ఏర్పరచి రక్షక కవచంగా వుంటుంది. కాబట్టి దీన్ని క్లీన్ చేయకపోవటమే మంచిది.

"కానీ మిస్టర్ లాల్, ఇప్పుడీ హత్యకు ఉపయోగించిన గన్‌లో మాత్రం వాడింది దానికి తగ్గ బుల్లెట్ కాదు. నాటు బుల్లెట్. అందుకే బ్యారల్లో గ్రూవ్స్ తుడిచిపెట్టుకుపోయాయి. ఈ బోర్డు మీద రంధ్రాలు నాటు తూటాలే. మోడరన్ అమ్యూనిషన్ అయితే రవ్వలు విరజిమ్మదు."

"అయితే రైఫిలులో ఇంతకుముందెన్నడూ నాటు బుల్లెట్స్ వాడలేదన్నమాట?" అడిగాడు లాల్.

"లేదు. నాటు బుల్లెట్స్ ఉపయోగిస్తే గన్ మొదటి రౌండ్‌కే దెబ్బతినిపోయేది. గన్ మళ్ళీ పని చేయదు. మొదటిసారిగా ఈ కేసులోనే ఉపయోగించడం జరిగింది. గన్ పనికి రాకుండా పోయింది."

"కాబట్టి ఈ నాటు బుల్లెట్ గన్ సొంతదారుడిది కాదన్నమాట!"

"కచ్చితంగా కాదు. అతని దగ్గర బుల్లెట్స్ అంటూ వుంటే అవి మోడరన్ అమ్యూనిషన్-నాన్ కరోసివ్‌వే అయివుంటాయి. నాటు బుల్లెట్స్ కావు."

"వెల్, అతని దగ్గర అవీ లేవనుకుంటాను ..." అంటూ కృష్ణన్‌ని చూశాడు లాల్.

"లేవు. అత నెప్పుడూ రైఫిలుని ఉపయోగించినట్టు లేదు. తండ్రిది. అలంకార ప్రాయంగా తెచ్చి ఇక్కడ పెట్టాడు. ఇక్కడగానీ, అతనింట్లోగానీ యెక్కడా అమ్యూనిషన్ మాకు కన్పించలేదు."

"అయితే బుల్లెట్‌ని హంతకుడే తెచ్చుకునివుంటాడు.

రైఫిలు క్లీన్ చేశాడు. అదెప్పుడు చేశాడు?"

"హంతకుడు ఇక్కడికి వచ్చిపోతున్నవాడై వుండాలి. రైఫిలుని యెప్పుడో రహస్యంగా పట్టుకుపోయి సిద్ధం చేసుకుని వచ్చి వుంటాడు."

"అది హతుడికి తెలియదా — గోడకు కన్పించక పోతే?"

కృష్ణన్ ఆలోచనలో పడ్డాడు.

"ఆ రైఫిలును ఎవరు, యెప్పుడు, ఎక్కడ క్లీన్ చేశారో తెలుసుకోవడం ప్రధానం. దానికి వైట్ వేజిలిన్ ఉపయోగించారన్నారు కాబట్టి అనుమానితు లందరి యిళ్ళల్లో దాని కోసం సెర్చి చేస్తాను. హతుని యింట్లో వెతకగా గన్ పర్మిట్ దొరికింది మిస్టర్ లాల్. ఇదే గన్ 1968లో తీసుకున్నది. మళ్ళీ మూడేళ్ళకు రిన్యూ చేయించలేదు. అమ్యూనిషన్ రికార్డులో 50 తూటాలకి పర్మిషన్ వుంది, ప్రతి మూడు నెలలకి. అందులో ఆఖరి ఎంట్రీ 69లో వుంది. ఆ తర్వాత లేవు. మొత్తం మూడు ఎంట్రీల్లో నూటాయాభై తూటాలు వున్నాయి. వాటన్నిటి ఖర్చు తేదీలతో సహా నోట్ చేసి వుంది. అప్పటికి నిల్వ యేమీ లేదు!

"పర్మిట్ లాప్స్ అయింది. కానీ గన్ దగ్గర ఉంచుకోవచ్చు! అసలు పర్మిట్ లేకుండా హంతకుడు ఫైరార్మ్ డీలర్స్ నుంచి అమ్యూనిషన్‌ని పొందలేదు కాబట్టి, దొంగ వర్తకుల్ని ఆశ్రయించివుంటాడని నా అనుమానం లాల్. ఆ తూటా మొరాదాబాద్ ప్రొడక్టు అని ఇన్స్పెక్టర్ అంటున్నాడు. మన కిక్కడ లోకల్ గన్ రన్నర్స్ ఎక్కువయ్యారీ మధ్య. ఇక వీళ్ళ మీదికి దండయాత్ర చేయాలనుకుంటాను."

"చేయండి!" అన్నాడు లాల్.

"ఇంక యిక్కడ పనేమీ లేదుగా?"

"లేదు" అన్నాడు లాల్ బయటికి కదులుతూ.

## 6

"కానీ మిస్టర్ లాల్, హంతకుడు ఎంతో తెలిసినవాడయితే తప్ప అలా హతుడి గదిలోకి వెళ్ళగలిగి, అతని రైఫిల్ తీసుకుని, అతన్నే షూట్ చేయలేడు! అవునంటారా?" అన్నాడు జాన్ ఆఫీసుకి తిరిగొచ్చాక.

"అవును మిస్టర్ జాన్" అన్నాడు లాల్ సిగరెట్ వెలిగించుకుంటూ. "హంతకుడు హతుడికి బాగా తెలిసినవాడు. అయితే ఇంకొకటి కూడా యదార్థం: ఆ రైఫిల్ అక్కడ్నించి అసలెప్పుడూ అదృశ్యం కాలేదు. నోట్ ది పాయింట్. హత్య జరిగే వరకూ హతుడి కనుసన్నల లోనే వుంది. హంతకుడు బహుశ అంతకు ముందు రాత్రే అక్కడకు రహస్యంగా ప్రవేశించి-మారు తాళాలతో—రైఫిల్ని సిద్ధంచేసి పెట్టుకొని వెళ్ళి వుంటాడు!"

"అంతే నన్పిస్తోంది మిస్టర్ లాల్!"

"అప్పుడు—నిన్న రాత్రి మళ్ళీ వచ్చి హతుడితో ఆ మాటా యీ మాటా మాట్లాడుతూ, ఓసారి రైఫిల్ని చూస్తానని అంటుకొని వుంటాడు. ఆ వెంటనే తూటా నింపి అతని మీదికి కాల్చి వుంటాడు!"

"అంతే! అది హతుడు-చలపతి వూహించనిది!"

"అప్పుడు పలాయనం చిత్తగించాడు ఆధారాలు సృష్టించి!"

"హంతకుడికి హతుడితో శత్రుత్వం లేదని దీనివలన తెలుస్తోంది. వాళ్ళిద్దరి మధ్య ఏ పేచీ వచ్చి వుండదు లాల్. హంతకుడు తన స్వార్థం, లాభం కోసమే చంపి

వుంటాడు. లేకపోతే హాతుడికి తెలియకుండా లోలోన పెరుగుతున్న కసితో చేసి వుంటాడు. హంతకుడ్ని తన శత్రువుగా ఎప్పుడూ అనుమానించి వుండడు హాతుడు. అందుకే అప్పుడు హంతకుడి చర్యల్ని శంకించ లేదు. లేకపోతే ఆ రైఫిల్ని అందుకోనిచ్చేవాడు కాదు. అసలు లోపలికి రానిచ్చేవాడు కాదు. అక్కడ ఘర్షణపడినట్లు ఏ సూచనలూ లేవు. హంతకుడు చివరిదాకా నమ్మించి దెబ్బతీశాడు లాల్. గొంతు కోశాడు తడి గుడ్డతో."

"మోటివ్ తెలుసుకోవల్సి వుంది!"

"మన కింకా అనుమానితులు కూడా ఎక్కువ మంది లేరు. ఉన్న ముగ్గురు పార్టనర్స్, గుమాస్తా వీళ్ళు నల్గురే ప్రస్తుతానికి. హాతుడి పరిచయస్తులు ఇంకెందరున్నారో తెలుసుకోవాలి. వాళ్ళని పరిశీలించాలి. హాత్యకు మోటివ్ లవ్ ఎఫైర్ కాదనిపిస్తోంది లాల్.

"ఎందుకలా అనిపిస్తోంది జాన్?"

"నా ఉద్దేశ్యం అసలు ఎఫైర్ లేదని కాదు—దాని కారణంగానే హాత్య జరగలేదని. హంతకుడు దాన్ని కారణంగా చూపిస్తున్నాడు—ఆ ఉత్తరాన్ని సృష్టించి. అతని మోటివ్ వేరు. ఆ మోటివ్ని చలపతి భార్య కలాపాల ఆధారంగా కప్పిపుచ్చుకొంటున్నాడు. చలపతి భార్య ద్రోహానికి అవమానంతో ప్రాణాలు తీసుకుంటున్నట్టు చక్కని ఆత్మహాత్యను సృష్టించాడు."

"నా కాశ్చర్యంగా వుంది జాన్! చలపతి వయసు యాభై లేదూ? భార్య కెంత వుండొచ్చు? నలభై పైనే! అవునా? ఈ వయసులో ఆమెకు ఎఫైర్ ఏమిటి? గాడ్, మనుషులు యిలా యెందుకు అయిపోతున్నారు?"

ఫోన్ మోగింది—

కృష్ణన్ పలికాడు అవతలి నుంచి లాల్ అందుకో గానే!

"ఫలించలేదు మిస్టర్ లాల్ సెర్చి. చిన్న ఆధారం కూడా లేదు. కావల్సిన వస్తువుల గూర్చి, నో వేజిలిన్, నో కిరోసిన్, మరకలంటిన గుడ్డలూ, వాసన తెలిపే కడ్డీలూ... నో నథింగ్. రైఫిల్ తుడిచిన సరంజామా ఏదీ లేదు ఈ నలుగురి యిళ్ళలోనూ!"

"తూటా!"

"లేదు! అదెందు కుంటుంది?"

"ఉంటుంది కాదు, ఉంటాయి. ఒకటి కాదు, చాలా. హంతకుడు ఆ ఒక్క తూటాతోనే వచ్చి కాల్చిపోయా డనుకుంటున్నారా మీరు? గురి తప్పవచ్చు! ఇంకేదో జరగవచ్చు! కాబట్టి కూడా ఇంకొన్నిటితో వస్తాడు!"

"ఓహ్! కానీ పనయ్యాక ఎందుకుంచుకుంటాడింకా?"

"మీకు సజెషన్ ఇచ్చానంతే కృష్ణన్!"

"ఓ!కే! థాంక్యూ! దృష్టిలో పెట్టుకుంటాను. గన్ రన్నర్స్‌ని తీవ్రంగా గాలిస్తోంది మా క్రైమ్ బ్రాంచి. ఇంతవరకు ఇద్దరే దొరికారు బారకాస్‌లో, కారవాన్‌లో ఇంకొకడు తప్పించుకొన్నాడు. వాడింట్లో ఏమీ లేదు. బారకాస్‌లో ఇద్దరు తామిప్పుడీ లైనులో లేమని వాదిస్తున్నారు. సోదా చేస్తే ఏమీ లేదు. ఇంకొకడి గురించి టిప్ అందింది అంబర్ పేటలో. ఏదైనా తెలిస్తే మీకు వెంటనే ఫోన్ చేస్తాను."

"ఎలిబీలు ఏమయ్యాయి కృష్ణన్?"

"ఈ నలుగురివీ పర్‌ఫెక్ట్ ఎలిబీస్!"

"పరస్పరం సహకరించుకున్నారా?"

"లేదు. వాళ్ళ యిళ్ళ దగ్గరే ఇరుగు పొరుగు యిస్తు

న్నారు!"

"ఎనీ డౌట్స్!"

"చెప్పానుగా, ఫర్ ఫెక్టు ఎలిబీస్. చెక్ చేశాం. వాళ్ళంతా హత్య జరిగిన సమయంలో యిళ్ళవద్దనే వున్నారు!"

"మరి చలపతి భార్య?"

"ఆమె ఇప్పుడు రావచ్చు! ఉదయమే ఆమె వూరికి ఫోన్ చేశాడు కామరాజు!"

"ఆమె—ఆమె ఎఫైర్ గురించి యేమయినా యిన్ఫర్మేషన్ క్రష్ణన్?"

"అదే చెప్పబోతున్నాను. చలపతి తన భార్య చెడ్డగా ప్రవర్తిస్తున్నట్టు చెప్పాడట జానకిరాంతో. జానకిరాం నాతో అన్నాడు."

"ఆమె వయసు అడిగారా?"

"నలభై రెండు!"

"సంతానం?"

"టూ ఈస్టు టూ రేషియో!"

"వెల్, చలపతి ఆమె ప్రవర్తనని అలా ఎలా నిర్ణయించాడట?"

"ప్రత్యక్షంగా చూశాడట!"

"ఎవరితో?"

"కామరాజుతో!"

"డియర్ మీ! కామరాజుతో!" అరిచాడు లాల్ జాన్ ఉలిక్కిపడి చూశాడు!

"అవును బ్రదర్! భానుమతి కామరాజు యింటి కెళుతున్నట్టు చూశాడట చలపతి. జానకిరాం అన్నాడు. ఉదయం కామరాజు ముందు, అందరి ముందూ చెప్పలేక

పోయాడట! చలపతికి వీళ్ళ సంగతి అన్నెల్లుగా తెలుసునట. కానీ ఏమీ చేయలేకపోయాడట! వాళ్ళని అదుపు చేసే మార్గం కన్పించలేదట!"

"ఎందుకట?"

"తమ విషయంలో జోక్యం చేసుకుంటే కామరాజుతో వెళ్ళిపోతానందిట భార్య. అతనికి పరువు ప్రతిష్ఠల భయం. సెన్సిటివ్ చాప్. ఉక్కిన పేనులా భరించాడట. చివరికి చూడలేక యిలా చేసుకున్నాడట!"

"పిల్లలున్నారు — ఆమె యింత యిదిగా యెందుకు ప్రవర్తిస్తోంది? కామరాజు వయసు కూడా పెద్దదే! ఈ వయసులో ఏం చూసి వాళ్ళు మోహంలో పడ్డారట?"

"మోహం పడపోరేళ్ళవాడి నుంచి పళ్ళూడిన వాడి వరకూ యెవరికయినా, యెప్పుడయినా, యెలాగయినా, యే సందర్భంలోనయినా యేర్పడవచ్చు బ్రదర్!"

"భానుమతి కామరాజు యింటి కొలుతుందన్నారు, అత నింట్లో యెవరూ వుండరా?"

"ఒంటరి!"

"ఎందుకని?"

"భార్య పోయాక పిల్లలు అతనితో పోట్లాడి వెళ్ళిపోయారట!"

"దేనికి?"

"భార్యని అతనే చంపాడట — అని వాళ్ళ అనుమానం! రుజువు లేదు. నిజమెంతో తెలియదు!"

"ఓహ్! మనస్సాక్షి ఒక్కటే ఆధారమయితే నిరూపణ కష్టమే! వాళ్ళ మనసులు బాగా తెలిసే వుండాలి. లేకపోతే అలా వెళ్ళిపోరు. యెన్నాళ్ళయింది యిది జరిగి?"

"పదేళ్ళయింది. కానీ అతన్ని చూస్తే భార్యా హంత కుడిలా లేడు!"

"చావు తప్పి కన్ను లొట్టపోయి బయట పడ్డాక — కృష్ణన్ — వెధవలు సాధువు లవుతారు. కామరాజు అప్పుడు శిక్షను తప్పించుకొని వుండొచ్చు — ఒక వేళ ఆ నేరం చేస్తే! కానీ ఈసారి మాత్రం అలా జరగదు."

"అంటే! ఏమిటి మీ ఠ నేది?"

"ఆ సూసైడ్ నోట్‌ని మీరేం చేశారు?"

"నా దగ్గరే వుంది. రిపోర్టు కోసం నాగపూర్ పంపాలి. టైం పడుతుంది!"

"పట్టనివ్వండి. ప్రతీదీ దానికి తగ్గ టైము తీసుకుం టుంది. నేను రెండు అవకాశాలు చూస్తున్నాను కృష్ణన్. మొత్తం అందర్నీ రెండు రకాల మోటివ్స్‌తో అనుమా నిస్తున్నాను. వీళ్ళందరి — ఈ నలుగురి దస్తూరీని కూడా పాత కాగితాల మీద సంపాదించి ఎక్స్‌పర్ట్స్‌కి పంపండి. ఆ ఉత్తరం ఫోర్జరీ అని తేల్చడం ఒక్కటే కాదు ఎక్స్‌పర్ట్స్ పని, ఆ ఫోర్జరీ యెవరి చేతితో జరిగింద నేది కూడా సర్టిఫై చేయాలి. దీనికి వీళ్ళ దస్తూరీలోని కొన్ని బేసిక్ క్యారెక్టరిస్టిక్స్ తోడ్పడతాయి ఎక్స్‌పర్ట్స్‌కి. ఏమంటారు?"

"అవును, ఇది వెంటనే చేస్తాను!"

"ఓ. కే. చెయ్యండి!" లాల్ ఫోన్ పెట్టేసి లేచి "కమాన్ జాన్, లెట్స్ గో!"

"ఎక్కడికి?"

"బ్యాక్ టు ది మర్డర్ ప్లేస్!"

"ఎందుకు? అక్కడి కెందుకు?"

"నా కిప్పుడే ఒకటి తట్టింది" అని బయటికి నడిచాడు లాల్.

# 7

కారు పోతూంటే జాన్ అడిగాడు అయోమయంగా, "నువ్వు—నువ్వింందాక రెండు అవకాశాలు చూస్తున్నా నన్నావు ఏమిటవి?"

"ఏమిటవి?" డ్రైవ్ చేస్తూన్న లాల్ తల తిప్పి చూసి నవ్వాడు. "ఓ.కే. ఇప్పుడున్న అనుమానితుల్ని రెండు వర్గాలుగా విభజిద్దాం—ఏం? జానకిరాం, జంగా రెడ్డి, జగపతిరావు ఒక వర్గం. కామరాజు, భానుమతి ఒక వర్గం.

"ఈ రెండు వర్గాల్లో ఏ ఒక వర్గమో హత్యకు పాల్పడిందనుకుంటే వీళ్ళ మోటివ్స్ యిలా వుంటాయి: బిజినెస్ ప్రయోజనాల కోసం మొదటి వర్గం, ప్రేమ కలాపాల కోసం రెండో వర్గం. అవునా?"

"వెల్, నువ్వింందాక ఆఫీసులో హత్యకు మోటివ్ లవ్ ఎఫైర్ కాదన్నావు. అది తెరగా ఉపయోగపడింది అన్నావు. అంటే నీ అనుమానం బలంగా మొదటి వర్గం మీద వుంది—అవునా?

"కానీ జాన్, మొదటి వర్గానికి వాళ్ళ మోటివ్‌తో ఎంత అవకాశముందో, రెండో వర్గానికీ వాళ్ళ మోటివ్‌తో అంతే అవకాశముంది. అందుకే రెండు అవకాశాలు చూస్తున్నానన్నాను.

రెండో వర్గం ఈ హత్యకు పాల్పడితే వాళ్ళ బండారాన్ని బయటపెట్టే ఆ ఉత్తరాన్ని ఎందుకు సృష్టిస్తారని నువ్వడగవచ్చు. అక్కడే వుంది కీలక మంతా! యూ సీ పార్ట్‌నర్! చిన్న తప్పును బయలు

చేసుకోవడం ద్వారా పెద్ద శిక్షను తప్పించుకోవచ్చు! నేరం చేసినవాడు తనమీదే ఆధారాలు సృష్టించుకుంటాడని సాధారణంగా ఎవరూ వూహించరు!"

"ఓ,హ్! అర్థమయింది! ఆ కోణం నుంచి చూస్తే అవకాశ ముంది" అన్నాడు జాన్ ఉద్రేకంగా.

కారు వేగం మరింత పెరిగి ఉరుకుతోంది.

"మనం ఎన్ని కోణాలు చూడగలిగితే అన్ని అవకాశాలుంటాయి" అన్నాడు లాల్. "సమస్య నిర్ధారణయిన అవకాశాన్ని ఎన్నుకోవడం దగ్గరే వస్తుంది. దాన్ని ఆధారాలతో పోల్చి చూసుకోవాలి."

"నువ్వింందాక ఏదో తట్టిందన్నావు—"

"దాని కోసమే వెళుతున్నాం మనం."

"ఏమిటది?"

"వెల్, నేరస్థుడు హత్యాస్థలంలో తిన ఆనవాలు లేకుండా జాగ్రత్తపడవచ్చు. కానీ దాని వెలుపలి పరిసరాల విషయంలో వేరుగా వుంటాడు. అంత పట్టించుకోడు!"

"అంటే?"

"హత్యాస్థలానికి హంతకుడు ఒక బయటి వస్తువుని తెచ్చాడు. అది వచ్చిన చోటుని మన మింకా చూడనే లేదు" అంటూ మరింత వేగం పెంచాడు అతను.

జాన్ తల గోక్కుంటూండగా కారు వెళ్ళి టింబర్ డిపో ముందు ఆగింది.

గేటు మూసి వుంది. చీకటి బాగా పడింది. లోపల ఒక షెడ్డు కింద లైటు వెలుగుతోంది. అక్కడ రెండు ఆకారాలు కూర్చుని వున్నాయి. బయట కారుని చూసి గబగబా లేచి వచ్చాయి. గేటు తెరచుకుంది—

"మళ్ళీ మీరా!" అన్నాడు కామరాజు.

లాల్ కారుని లోపలికి పోనిచ్చి ఆపాడు.

లోపలంతా నిశ్శబ్దంగా వుంది.

ఇద్దరూ కారు దిగి వాళ్ళిద్దర్నీ చూశారు.

"మీరేం చేస్తూన్నారిక్కడ?" అడిగాడు లాల్ కామరాజుని.

అతను తన పక్కనున్నతన్ని చూపించాడు: "రాజయ్య యిప్పుడే వచ్చాడు నన్ను రిలీవ్ చేయడానికి. రాత్రి యిక్కడే పడుకుంటాడు."

లాల్ రాజయ్యని చూశాడు. "మొన్న రాత్రి నువ్విక్కడే పడుకున్నావా?"

తలూపాడు రాజయ్య.

"ఎక్కడ?"

రాజయ్య తా మిందాక కూర్చున్న షెడ్డుకేసి చూపించాడు. అది తూర్పువైపు వుంది. సుమారు నలభై అడుగుల పొడ వుంది. దాని కింద రకరకాల సైజుల్లో చెక్కలూ, తయారయిన వస్తు సామగ్రీ, కొన్ని వర్క్ బెంచీలూ వున్నాయి.

దాని కెదురుగా, యివతల పడమర వయిపున మరో షెడ్డు వుంది. అది కూడా అదే సైజులో వుంది. దీని కింద సా మెషీన్, దుంగలూ వగయిరా వున్నాయి.

ఈ రెండు షెడ్లకి మధ్యగా దక్షిణాన కేబిన్ వుంది. ఉత్తరాన గేటు.

"నువ్విక్కడ ఏ ఉద్దేశ్యంతో పడుకుంటావు?" అడిగాడు తిరిగి అతన్ని చూస్తూ.

"దొంగతనాలూ అవీ జరక్కుండా!" అన్నాడు రాజయ్య.

"ఎప్పుడయినా జరిగిందా?"

"ఇంతవరకు లేదు."

"జరిగితే నీకు తెలుస్తుందా?"

"తెలుస్తుంది!"

"మొన్న రాత్రి జరిగింది—నీకు తెలుసా?"

"మొన్న రాత్రి జరిగిందా!"

"జరిగింది. ఆఫీసు రూంలోకి ఒక ఆగంతకుడు వెళ్ళాడు."

"ఎలా? ఎలా వెళతాడు?"

"నీ దొర తాళాలతో—లేక మారుతాళాలతో!"

"లేదు—ఏం చేశాడు వెళ్ళి?"

"నీ దొర తుపాకీ తుడిచిపెట్టాడు. ఆ తర్వాత వెళ్ళిపోయాడు. నువ్విక్కడ వుండి ఏమీ లాభం లేదు."

రాజయ్య ఉద్రేకంగా చూశాడు.

కామరాజు కలవరంగా చూడసాగాడు.

"మీరు—మీ రిది ఆత్మహత్య కాదంటున్నారా?"

"ముమ్మాటికీ కాదంటాను!"

"అయితే యిలా రండి మీతో మాట!"

అతను డిటెక్టివ్‌లను తీసుకుని దూరంగా నడిచాడు: "నాకీ అనుమానం ఉదయం నుంచీ వుంది. చెప్పే అవకాశం దొరకలేదు. చలపతిరావు పార్ట్‌నర్స్ ముగ్గురూ నీచులు!"

"అలాగా!"

"అవును! వాళ్ళే చేసివుంటారీ పని! వాళ్ళు దొంగ వ్యాపారానికి ముఠా కడుతున్నారు! కలప దొంగ రవాణా చేస్తారట! చలపతిరావు ససేమిరా వాళ్ళతో

చేరనన్నాడు—ఆయన సహకారం లేకపోతే యిక్కడ పనులు సాగవు—ఆయనకి వాళ్ళతో ఎప్పుడో చెడిసింది! అవకాశం చూసి వాళ్ళే దుర్మార్గానికి పాల్పడ్డారు!"

డిటెక్టివ్‌లు ఇద్దరూ మౌనంగా వుండిపోయారు!

"మరి మీరు? మీరు వాళ్ళతో చేరలేదా?"

"ఆ పని చేసే కంటే యెందులోనయినా దూకి చస్తాను!"

"మీ యజమానికే ద్రోహం చేస్తూంటే అలా అనిపించడం లేదా?"

కామురాజు ఉలిక్కిపడి సూటిగా చూశాడు: "నేను—నేనెవరికి ద్రోహం చేస్తున్నాను?"

"మీ యజమాని చలపతిరావుకి. ఆయన భార్యతో మీ వ్యవహారం అంత బాగా లేదు."

"ఎవరన్నారు?"

"ఇలాంటివి దాగవు. దాగుతా యనుకుంటారు దురభ్యాసం చేసే వాళ్ళు. కానీ దాగవు."

కామురాజు తల తిప్పుకుని యెటో చూడసాగాడు.

"దేవుడిలీలలు చిత్రమయినవి. దేనినీ దాగనివ్వడు" లాల్ అన్నాడు మళ్ళీ.

"కానీ ఆయన్ని చంపే అవసరం నా కేమిటి?"

"ఆయన పార్ట్‌నర్స్ కెంతో మీకూ అంతే వుంది!"

"అయితే తేల్చండి ఎవరు చేశారో!"

"తేల్చడానికే ఈ శ్రమ అంతా!" అని జాన్ వైపు తిరిగాడు లాల్. "కమాన్ జాన్, లెట్స్ గో అండ్ ఫైండ్ సంథింగ్ మోర్ ఇంక్రిమినేటింగ్!"

డిటెక్టివ్‌లు పోతూంటే కామురాజు, రాజయ్యా వాళ్ళ ననుసరించారు. డిటెక్టివ్‌లు పడమర షెడ్డు కింద

సా మెషీన్ దగ్గర కెళ్ళారు. అక్కడ లైట్లు వేశాడు రాజయ్య.

లైటు వెలుగులో అక్కడంతా స్పష్టంగా కనిపించింది. కానీ లాల్ దృష్టికి ఆశాజనకంగా లేదు. సా మెషీన్ దగ్గర కొన్ని దుంగలూ, కోసిన బెండులూ, జల్లపరుపు చెక్కలూ పేర్చి వున్నాయి. లాల్ వాటిలోకి నిశితంగా చూస్తూ పెదవులు చప్పరించాడు: "నో, యిక్కడ కాదు."

"ఏమిటి కాదు?"

"హత్యా స్థలంలో ఆ కొయ్య రీపర్ వచ్చింది ఇక్కడ్నించి కాదు!" అంటూ బయటికి కదిలాడు లాల్. కదులుతూ అన్నాడు మళ్ళీ, "ఆ షెడ్డులోంచి తెచ్చివుంటాడు హంతకుడు. అవును అక్కడ చాలా కన్పిస్తున్నాయి."

తూర్పు షెడ్డు కిందికి వెళ్ళి కలయ జూశాడు లాల్.

అక్కడ అన్ని సైజుల్లో చెక్కలు వున్నాయి. కార్పెన్టర్స్ పనిచేసే చోటు. ఆ చెక్కలన్నీ సైజుల వారిగా రాక్స్‌లో పేర్చి వున్నాయి. కొన్ని చాలా పెద్దవి కింద వున్నాయి. కింద వరండాలో మూడు వర్క్ బెంచీ లున్నాయి. వాటి మధ్యా, కిందా పొట్టూ, పనికిరాని ముక్కలూ కుప్పగా పడి వున్నాయి. రాక్స్ వారగా పనిముట్లు పడేసి వున్నాయి.

ఇవన్నీ చూస్తూ లాల్ అడిగాడు కామరాజుని: "ఉదయం కేబిన్‌లో మీరా రీపర్ చూశారు. ఆ సైజు గలవి యిక్కడెక్కడున్నాయి?"

కామరాజు వెంటనే చూపించాడు మధ్య రాక్‌ని. దాని మధ్య అరలో ఆ సైజువి పేర్చి వున్నాయి. వాటిని కదల్చకుండా చూడసాగాడు లాల్. "వెల్

ఇక్కడ్నించి తీశాడన్నమాట. తీసుకుని ఇలాగే వెనుక బెంచీల మధ్య నించి వెళ్ళిపోయాడా లేక వరండా చివరి దాకా వెళ్ళి బయటపడ్డాడా?"

"పార్ట్నర్, యిక్కడేమిటో వున్నాయి!"

"ఏమిటవి?"

"పుల్లలు—అగ్గి పుల్లలు!"

"రైట్! చీకట్లో తన కాక్కావల్సింది దొరకదు. లైటు వేయకూడదు. పుల్లలు గీశాడు. ఓ.కే.' అవేదయినా మార్గాన్ని చూపిస్తున్నాయా?"

"ఒకటి, రెండు, మూడు....అయిదు పుల్లలు పార్ట్నర్. ఈ రెండు బెంచీల మధ్య ఆగిపోయాయి. పార్ట్నర్ యిక్కడ రక్తం!"

"ఆ దుమ్ములోనా? అక్కడెలా వచ్చింది?"

"ఈ ముక్కని చూడు! దీనికెంత పెద్ద మేకు!"

"ఓహ్, కాల్లో దిగివుంటుంది....పీకిపారేశాడు."

"బాగయింది బాస్టర్డుకి!"

లాల్ కామరాజుని చూశాడు. అతను గాభరాగా చూస్తున్నాడు. లాల్ అతని కాళ్ళని చూశాడు. అవి బాగానే వున్నాయి. లాల్ అతని కాళ్ళ ప్రక్కనే వున్న పనిముట్లుకేసి చూశాడు. అతని కళ్ళు పెద్దవయ్యాయి.

ఒక్క విసురుతో వెళ్ళి అక్కడ వంగి చూశాడు. వెంటనే కర్చీఫ్తో దాన్ని పట్టుకొని తీశాడు.

జాన్ ఆశ్చర్యంగా అన్నాడు, "టార్చి! ఎవరిది?"

"నాకు తెలియదు — మాది కాదు!" అరిచాడు కామరాజు.

ఆ త్రీ సెల్ టార్చిని తిప్పి తిప్పి చూశాడు లాల్

అద్దం పగిలింది. లోన బల్బ్ పగిలింది.

"లాల్, హంతకుడు మొదట అగ్గిపుల్లలు గీయలేదు!"

"అవును."

"ఆ టార్చితోనే వచ్చి, కావల్సిన రీపర్ తీసు కున్నాడు. అప్పుడు వెళ్ళబోతూ ఈ మేకుని తొక్కాడు. ఆ బాధకి టార్చిని వదిలేసి—విసిరేసి కాలు పట్టుకొని వుంటాడు. అది వచ్చి ఇక్కడ పడింది. అద్దంతోసహా బల్బ్ పగిలింది. అప్పుడు పుల్లలు గీసి టార్చికోసం చూశాడు. అదిక్కడ పనిముట్లలో కలిసిపోయింది. బల్బ్ పగలకపోతే దొరికిపోయేది!"

లాల్ తలూపి, వెనుక మూత విప్పి మూడు బ్యాటరీలు బయటికి తీశాడు. టార్చిమీద ఏ గుర్తులూ చెక్కిలేవు. లాల్ దృష్టి ఆ మూత లోపల పడింది. అందులో స్ప్రింగ్ కింద మడిచి వున్న కాగితాన్ని సాలోచనగా తీశాడు....

"టార్చి చాలా పాతది, జాన్. స్ప్రింగ్ యాక్షను కోల్పోయింది. సైజు కూడా తగినంత లేదు. సపోర్టు కోసం ఈ కాగితం మడిచి పెట్టినట్లుంది...." అంటూ ఆ కాగితం విప్పి చూశాడు.

అది డాక్టర్ ప్రిస్క్రిప్షన్. ఏవో రెండు మందులు వ్రాసివున్నాయి. పైన పేషంట్ పేరుగానీ, డాక్టర్ పేరుగానీ లేవు. తేదీ మాత్రం పదిరోజుల క్రితానిది వుంది. అడుగున మెడికల్ స్టోరు రైటప్ వుంది. హరీ మెడికల్ హాల్, పంజాగుట్ట.

"వెల్, ఈ టార్చి యెవరిదో నిజంగా మీకు తెలియదా?" అడిగాడు లాల్ మళ్ళీ, వాళ్ళిద్దర్నీ సూటిగా చూస్తూ.

"తెలియదు, అలాటి టార్చి మాకు లేదు."

"ఓ.కే, ఇదెవరిదో మేం కనుక్కుంటాం. మీరిద్దరూ మాతో రండి."

"ఎక్కడికి?"

"హంతకుడు మాకు దొరికేవరకూ మీరు మా వెంట వుండాలి."

"ఎందుకు — హంతకుడితో నాకేం సంబంధం?"

"హత్య మీలో యెవరూ స్వయంగా చేసి వుండక పోవచ్చు — కానీ చేయించవచ్చు పరాయి వ్యక్తితో."

"అందుకని — ?"

"అందుకని మీరు మా వెంట వుండాలి, ఆ వ్యక్తిని ఎలర్టు చేయకుండా!" లాల్ చ క చ కా కారు కేసి నడిచాడు.

## 8

పంజాగుట్టలో 'హరీ మెడికల్ హాల్' ముందు కారు దిగారు డిటెక్టివ్‌లు. వాళ్ళిద్దర్నీ కార్లోనే వుండమని చెప్పి, షాపులోకి నడిచారు.

"ఇందులో మందులు కొంటే హరీ మంటారేమో!" అన్నాడు జాన్ బోర్డు చూసి.

లాల్ లోపలికి వెళ్ళి ఆ ప్రిస్క్రిప్షన్ ప్రొప్రయిటరుకి చూపించాడు. "ఇదెవరు రాశారో చెప్పగలరా?"

అతను ఎగాదిగా చూశాడు. "ఎందుకు? మీ రెవరు?"

"ఈ డాక్టర్‌ని మేం కలవాలి. చెప్పలేని అవసరం వచ్చింది."

"ఈ మందులు రాసింది నన్‌పారియా — డాక్టర్ నన్‌పారియా."

"గుడ్, యెక్కడ వుంటాడు?"

"ఇక్కడే...." ఆటో పంజగుట్టలోనే ఇంటి గుర్తులు చెప్పాడతను.

"థాంక్స్, ఇవేం మందులు?"

"విట్ న్యూరాన్ ఇంజక్షన్లు.... నార్జెసిక్ టాబ్లెట్లు."

"దేనికివి?"

"నరాల బాధకి .... మెడ నరాలు, ఛాతీ నరాలూ పట్టేసే రిలాక్సేషన్ కి...."

లాల్ మరోసారి 'థాంక్స్' చెప్పి జాన్‌తో బైటికొచ్చాడు.

కార్లో వాళ్ళిద్దరు ఆత్రుతగా చూశారు.

కారెక్కి లాల్ డాక్టర్ నన్ పోరియా అడ్రసుకి పోనిచ్చాడు. ఆ ఇంటిముందు కారాపి హారన్ కొట్టాడు. కానీ ఎవరూ రాలేదు. కారు దిగి జాన్‌తో ఇంటి తలుపుని చేరుకున్నాడు. తలుపు ప్రక్కన చిన్న బోర్డు మీద—డాక్టర్ నన్ పోరియా—అని వుంది.

లాల్ ముఖం చిట్లించాడు అది చూసి.

"ఇతనెవరో క్వాక్‌లా వున్నాడు, జాన్."

"అంటే?"

"బోర్డు చూడు—డిగ్రీలేదు, కనీసం ఆర్.ఎమ్.పి. కూడా కాదు. ఏ డాక్టర్ దగ్గరో కాంపౌండరీ వెలగబెట్టి వచ్చి తెర్చిచి వుంటాడు దుకాణం!"

తలుపు కొట్టాడు లాల్.

అప్పుడు తలుపుతీసి ఒక బక్కపలచగా, యాభై ఏళ్ళున్న మనిషి చూశాడు. అతను వెంటనే ప్రక్కకు తొలగి. "రండి!" అన్నాడు.

డిటెక్టివ్‌లు వెళ్ళారు.

డాక్టర్ నన్ పోరియా వాళ్ళని అనుమానంగా చూశాడు, తాగి ఎర్రబారిన కళ్ళతో.

"ఏమీ లేదు, మిష్టర్ నన్ పోరియా, చిన్న సహాయం. పేషంట్లం కాము. పదిరోజుల క్రితం మీ దగ్గరికొక రోగి వచ్చాడు. మీరిచ్చిన ఈ ప్రిస్క్రిప్షన్ చూసి అతనెవరో చెప్పండి—" అన్నాడు లాల్.

డాక్టర్ నన్ పోరియా ఆ చీటీ తీసుకుని చూశాడు. ఒక్క క్షణం అతను నిశ్చలంగా వున్నాడు. ఆ తర్వాత వెంటనే ముఖంలో రంగులు మారాయి.

డిటెక్టివ్‌లు కుతూహలంగా చూశారు.

అతను తల పైకెత్తి చూశాడు. పెదవులు వణికాయి.

"ఇతనెవరో గుర్తులేదు—" అన్నాడు చటుక్కున.

డిటెక్టివ్‌లు నిరాశగా చూశారు.

"గుర్తు చేసుకోండి, మిష్టర్ నన్ పోరియా. మీకు మంచిది. మీకిప్పుడే గుర్తొచ్చి పోయినట్లుంది....మళ్ళీ చేసుకోండి!"

"లేదు, ఇతనెవరో నాకు తెలియదు!"

"గుడ్, గుర్తున్నట్లు ఒప్పుకున్నారు. ఇక తెలియదని బుకాయించకండి! ఇతను హంతకుడు. డబ్బులిస్తే చంపి వస్తాడు. మీకెంతో అపురూపమైన క్లయంట్. మీరతన్ని కాపాడాలనుకుంటే ఈ హత్యలో మీరూ అక్సెసరీ అవుతారు."

"ఎవరి హత్య? ఎవరు మీరు?"

"ఒకరి హత్య. మేము పరిశోధకులం" జాన్ చెప్పాడు. అతను గాభరాగా చీటీని చింపేయబోతే జాన్ తీసుకున్నాడు.

"ఇతను క్వాక్ కాదు లాల్, క్రూక్‌లా వున్నాడు!"

"క్రూకెడ్ క్యాక్! కాల్ ది పోలీస్!"

"ఆగండి, చెప్తాను—"

"ఓ.కే! వెరీ వెల్, చెప్పండి...."

డాక్టర్ సన్‌పోరియా గుటకలు మింగుతూ చెప్పాడు "తోడేలు తమ్మయ్య!"

"తోడేలు తమ్మయ్యా? ఎవరతను?"

"వాడు రౌడీ! కిల్లర్!"

"ఎక్కడుంటాడు?"

"ఈ వీధిలోనే!"

"మొన్న రాత్రి వచ్చి కాలికి కట్టు కట్టించుకొని, ఇంజక్షను పుచ్చుకున్నాడు కదూ?"

"అవునవును—"

"పదండి, చూపించండి!"

"నేను రాను! నేను చూపిస్తే చంపుతాడు!"

"మీరు ఇల్లు చూపించి మా కార్లోనే వుండండి. అతను ఇంట్లో వుంటే మీరు కారు దిగి వెళ్ళిపోండి. లేక పోతే మాతోనే వుండాలి దొరికే వరకూ—కమాన్!"

## 9

తోడేలు తమ్మయ్య ఇల్లు ఆ వీధిలోనే చివర్లో వుంది. డిటెక్టివ్‌లు కారు దిగి తలుపు కొట్టిన వెంటనే లోపల అలికిడి వినిపించింది....

కొన్ని క్షణాల్లో తలుపు తెరచుకోగానే గుప్పున వేసిన వాసనకి వెనక్కి తొలగి డిటెక్టివ్‌లు అతన్ని చూశారు.

అతను మొద్దగా పలికాడు. "ఎవరు మీరు...."

"తోడేలు తమ్మయ్యా?" అడిగాడు లాల్.

"అవును...."

"నీ తోలు వూడొచ్చే రోజొచ్చింది!" అన్నాడు జాన్ రివాల్వర్ గురిపెట్టి.

అతను జాన్ని అమాంతంగా లేపేసి, లోపల గిరగిరా తిప్పసాగాడు.

"అ్రరె—లాల్! నన్ను కాపాడు!" జాన్ కంగారు పడి కేకేశాడు.

లాల్ ఆ వృద్ధకాయుడిమీదికి వెళ్ళేలోగానే, అతను జాన్ని అవతలి గదిలోకి అవలీలగా గిరవాటేశాడు. జాన్ అక్కడ దభీమని కిందపడగానే, కెవ్వున కేక వెలువడింది.

ఒక్క క్షణం స్తబ్ధంగా వుండిపోయి జాన్, వళ్ళు దులుపుకుంటూ లేచి, మంచంమీద వణికిపోతున్న ఆమెని చూశాడు.

"నువ్వు తిరిగ్గా లేచిరా!" అని ఏమీ జరగనట్టు బయటికొచ్చాడు.

అప్పటికి లాల్ తమ్మయ్యని కుర్చీలో కుదేసి రివాల్వర్ గురిపెట్టి నిల్చున్నాడు. జాన్ కట్టలు తెంచుకున్న కోపంతో వచ్చి అతని తుంటిమీదా, దవడమీదా రెండు గుద్దులు గుద్దాడు. తమ్మయ్య మెలికలు తిరుగుతూ మూలిగాడు.

లాల్ అతని కుడి కాలుకి కట్టుని చూసి జుట్టుపట్టి తల పైకెత్తాడు. "నువ్వు—తెలివిలోకిరా! నువ్విప్పుడు అరెస్టు కాబోతున్నావు."

"ఎందుకు—నేనేం చేశాను?"

"చాలా చేశావు. నువ్వో కిరాయి కిల్లర్వి. నిన్న రాత్రి చలపతిరావుని హత్య చేశావు."

"నేను—నేనెవర్నీ హత్య చేయలేదు!"

"నీ కాలికి కట్టేమిటి?"

"ఇది—గుచ్చుకుంది—గాజు పెంకు!"

"మేకు గుచ్చుకుంది. టింబర్ డిపోలో గీపర్ కోసం వెళ్ళినప్పుడు చూసుకోకుండా తొక్కావు. అక్కడ నీ రక్తం మరకలున్నాయి. ఆ కన్ఫ్యూజన్‌లో నీ టార్చి పోగొట్టుకున్నావు. అది దొరికింది మాకు. దానిమీద నీ వేలిముద్రలుంటాయి. ఈ కట్టు నువ్వు నిన్న రాత్రే కట్టించుకున్నావని నీ డాక్టర్ చెప్పాడు."

లాల్ మాటలు విని తమ్మయ్య బెదురు చూపులు చూశాడు.

"నువ్వింక తప్పించుకోలేవు. ఒప్పుకోవడం మంచిది. నిన్నెవరు పంపారు చంపమని?"

"నాకు —— నాకు తెలియదు!" నెర్వస్‌గా అన్నాడతను. "అతనెవరో నాకు తెలియదు. మూడు రోజుల క్రితం వచ్చి కోరాడు. చాలా డబ్బు ఆశపెట్టాడు, ఒప్పుకున్నాను. ఏదైనా జరిగితే నా బాధ్యత కాదని బాండ్ కూడా రాయించుకున్నాను...."

"గుడ్! అతనెలా వుంటాడు?"

"లావుగా, యెత్తుగా .... మళ్ళీ చూస్తే గుర్తుపడతాను."

"ప్రకాశరావు."

"ఓ.కే, అతనేం చేయమన్నాడో ఇక చెప్పు."

"అతను నాకు ఆరువేలు ఇచ్చాడు. చలపతిరావనే టింబర్ డిపో అతన్ని చంపాలన్నాడు. ఫోటో కూడా ఇచ్చాడు. యెలా చంపాలో అయిడియా ఇచ్చాడు. అది ఆత్మహత్యలా వుండాలన్నాడు. అతని తుపాకీతోనే కాల్చాలన్నాడు. ఆ తుపాకీని చూడడానికి నాకు మారు

తాళాలిచ్చాడు. నేను మొన్న రాత్రి వెళ్ళి దాన్ని చూశాను. అలాటిదే—అలాటిదే నా దగ్గర ఒకటుంది. నా రైఫిలుని అక్కడ తగిలించి, అతని రైఫిలుని పట్టుకొచ్చేశాను...."

"అప్పుడు?"

"దాన్ని క్లీన్ చేసి సిద్ధం చేసుకున్నాను. ప్రకాశరావు నాకో చీటీ కూడా ఇచ్చాడు. దాన్ని ఆఫీసులో టేబులు మీద పెట్టమన్నాడు. నిన్న రాత్రే ఒంటిగంట ప్రాంతాల వెళ్ళి పని పూర్తిచేయమన్నాడు. ఆ సమయంలో చలపతి అక్కడ వుండేలా చూస్తానన్నాడు. నేను వెళ్ళాను. చలపతి అక్కడే వున్నాడు. ఇంకెవరూ లేరు. తలుపు తెరిచే వుంది. నేను బయట మెట్టుమీద నిల్చుని గురిపెట్టాను. అప్పుడు అతను నన్ను చూసి లేచి పరుగెత్తబోయాడు. కానీ నేను తప్పించుకోనివ్వలేదు— టేబులు అవతలకి వెళ్ళగానే షూట్ చేసేశాను—"

"అప్పుడు?"

"ఆ ఒక్క రౌండ్ సరిపోయింది. అతను పడిపోగానే అతని రైఫిలుని కిందపడేసి, గోడకున్న నా రైఫిలుని తీసుకుని, చీటీ టేబులుమీద పెట్టేసి, రీపర్ కోసం షెడ్డులోకి వెళ్ళాను."

లాల్ అతన్ని జాలిగా చూశాడు: "నువ్వు ఆత్మహత్యని బాగానే సృష్టించావు. కానీ రీపర్ కోసం వెళ్ళి అగం చేసుకున్నావు."

తిమ్మయ్య మాట్లాడలేదు. నిట్టూర్చి వూరుకున్నాడు.

"ఆ బాండ్ చూపించు—ఎక్కడుంది?"

"అవి—అవి—నా పెట్లో వుంది!"

"అవి అంటున్నావు—ఎందరివి వున్నాయి?"

"చాలా—చాలా మందివి వున్నాయి."

జాన్ తాళాలు తీసుకుని గదిలో కెళ్ళి పెట్టె తెరిచాడు. మంచం మీద ఆమె యిప్పుడు మంచి స్థితిలో ఉంది.

జాన్ పెట్టె అడుగు నుంచి కొన్ని కాగితాలు తీసి చూస్తూ, ప్రకాశరావు సంతకం వున్న దాన్ని పట్టుకొని పరుగెత్తుకొచ్చాడు.

"లాల్! మై గాడ్! ఈ రైటింగ్ చూడు!"

లాల్ అందుకొని ఆ అక్షరాల్ని చూసి కొయ్యబారిపోయాడు.

## 10

"నో డౌట్! ఏ మాత్రం సందేహం లేదు. ఇది చలపతిరావు దస్తూరీ! ఈ సూసైడ్ నోట్ మీద, ఈ బాండ్ మీద రైటింగ్ ఒక్కరిదే! సూసైడ్ నోట్ ఫోర్జరీ అనుకుంటే, ఈ బాండ్‌ని హంతకుడి సమక్షంలో సరిగ్గా చలపతిరావు దస్తూరీతో ఆకువుగా ఎలా వ్రాసిచ్చేస్తాడు—ఈ ప్రకాశరావు అనే ఆతను?"

లాల్ మాటలకి కృష్ణన్ తలూపాడు: "అవును. ఈ రెండు పత్రాలూ ఫోర్జరీ కావు! చలపతిరావు స్వంత దస్తూరీ! నిపుణులు స్పష్టపరిచారు. మరి ప్రకాశరావు!"

"ప్రకాశరావే చలపతిరావు!" అని లాల్ సిగరెట్ వెలిగించుకొని పైకప్పు కేసి చూశాడు. "మై గాడ్! మళ్ళీ మొదటికే వచ్చింది కృష్ణన్! దీన్ని హత్య అనలేము! చలపతిరావు తనని తానే చంపించుకున్నాడు!"

"ఎందుకలా చేశాడు లాల్?"

"ఆ సూసైడ్ నోట్ చెపుతుంది."

"కానీ, త నెందుకు కాల్చుకోలేకపోయాడు?"

"గట్స్ లేక! చావడానికయినా ధైర్య ముండాలి. భార్య ప్రవర్తన తెలిసినప్పట్నుంచీ చచ్చిపోవాలన్న కోరిక వేధిస్తూ వుండి వుంటుంది. సన్నిటిల్ చావ్. కానీ ధైర్యం లేదు. అందుకే యిలా డబ్బిచ్చి ఎక్స్‌క్యూష నర్‌ని నియమించుకున్నాడు. రూపం మార్చుకొని వెళ్ళి వుంటాడు. హత్య చేసిన రాత్రి తోడేలు తమ్మయ్య పోల్చుకోలేకపోయాడు."

"ద్రోషి చలపతిరావే—దట్ పూర్, మైండ్ లెస్ ఫెలో!"

"మైండ్ లెస్ ఫెలో ముప్పు తిప్పలు పెట్టాడు!" అన్నాడు లాల్ అలసటగా లేస్తూ.

జాన్ కృష్ణన్‌కి గుడ్ నైట్ చెప్పాడు.

—: అయిపోయింది: —

సీరియల్

# విషసర్పిణి

## సికిందర్

(గత సంచిక తరువాయి)

ఆమె కిమ్మనలేదు.

"దీనికి శిక్షేమిటో నీకు తెలుసా?"

ఆమె పలకలేదు.

"నువ్విప్పుడు శిక్షకు సిద్ధమేనా? లాయర్ని పెట్టుకుంటావా?"

ఆమె అలాగే కూర్చుంది నిశ్చలంగా చూస్తూ.

సుహాసిని ముఖంలో నిర్లిప్తతా, నిరాసక్తతా స్పష్టమవుతున్నాయి. నీరసించిన శరీరంతో, చిరిగి రక్తం మరకలయిన బట్టలతో ఆమె కడు దైన్యంగా వుంది. ఆమె దేనికీ యిప్పుడు చలించడం లేదు. ఆమెలో స్పందన లేదు—యింట్లో ఎదురు చూస్తున్న ఆమె తండ్రి కాయానికి లాగే. అయితే ఈమె కాయానికి వూపిరి మాత్రం వుంది.

అసిస్టెంట్ కమీషనర్ యింటరాగేషన్ని ఆమె యేమాత్రం పట్టించుకోవడం లేదు. గదిలో అందరు అధికారులూ, డిటెక్టివ్ల మధ్య కూర్చున్న ఆమెకు యెలాంటి భయాందోళనలూ, గాభరా లేవు. డిటెక్టివ్

లా మెని విచిత్రంగా చూస్తున్నారు.

• • •

ఫోన్‌లో మాట్లాడిన మనిషి ఆ కేఫ్‌లో ఒక మూల కూర్చుని అసహనంగా యెదురుచూస్తున్నాడు, మాటి మాటికీ వాచీ చూసుకుంటూ.

కేఫ్‌లో రష్ యెక్కువగానే వుంది. సేట్ చాంద్ రామ్ తనని గమనించడం లేదు. ఇంకో రెండు నిమిషాలు కష్టంగా గడిచాక అప్పుడు లోపలి కొస్తూన్న మనిషిని చూసి ఉలిక్కిపడ్డాడు ఫోన్‌లో మాట్లాడిన మనిషి.

"హాయ్! బాలరాజ్!" అన్నాడతను లేస్తూ.

"హాయ్! స్టాలిన్!" అన్నాడా మనిషి గబగబా వస్తూ. అతను రెయిన్ కోటులో వున్నాడు.

ఫోన్‌లో మాట్లాడిన మనిషి స్టాలిన్, రెయిన్ కోటు మనిషి బాలరాజ్‌లు యెదురెదురుగా కూర్చున్నారు.

"ఆలస్యం చేశావ్!" అన్నాడు స్టాలిన్.

"ఏం చేయమంటావ్?" బాలరాజ్ విసుగ్గా చూశాడు. "పనులు. బిజీ! నీలాగా తిరుగుబోతుని కానుగా?"

"నేను మీ ఇన్ఫార్మర్‌ని, తిరగకేం చేస్తాను?"

"ఇప్పు డేమిటి యిన్ఫర్మేషన్ చెప్పు?"

స్టాలిన్ సిగరెట్ వెలిగించుకుని వెయిటర్‌ని పిలిచాడు. "దో పానా లావ్!" అన్నాడు.

బాలరాజ్ విసుగ్గా చూశాడు. "తొందరగా వెళ్లాలి స్టాలిన్!"

"చెప్తాను. మీకు ఒక అమ్మాయి అవసరమను కుంటాను!"

బాలరాజ్ కుతూహలంగా చూశాడు. "అవసరం కాదు, గాలిస్తున్నాం!"

"ఎవ్వరి. ఆమెని నేను చూశాను."

"ఎక్కడ? ఎక్కడుందిప్పుడు?"

స్టాలిన్ ఎదురు ప్రశ్న వేశాడు. "ముందు నా కెంత?"

బాలరాజ్ దీర్ఘంగా చూశాడతన్ని. "ఐసీ.... ముందు మనీ, తర్వాత నీ కహానీ అంటావు. అచ్ఛా! రెండు వేలు—సరేనా?"

"మూడు!" అన్నాడు స్టాలిన్.

"ఓ.కే. మూడు. ఇక చెప్పు యెక్కడుందామె? యెక్కడ చూశావ్?"

స్టాలిన్ షోనా తాగుతూ అయిదు నిమిషాల సేపు వివరించాడు.

బాలరాజ్ ముఖం వెలిగింది. "ఆమె కోసమే రాత్రంతా ప్రయత్నించాం స్టాలిన్! ఇప్పుడు పోలీసులకి చిక్కిందన్నమాట!"

బాలరాజ్ వంకరగా నవ్వాడు. "నువ్వు మంచి యిన్ఫర్మేషన్ యిచ్చావు స్టాలిన్. ఆయాం రియల్లీ హేపీ!"

"థాంక్స్! ఇక నా మనీ యిచ్చేయ్!"

బాలరాజ్ కళ్ళు చిత్రంగా మెరిశాయి. "అవును. నీ మనీ!" అంటూ జేబులో చెయ్యి పెట్టి గుప్పిట మూసి తీశాడు. దాన్ని టేబులు కిందుగా పోనిచ్చాడు. "ఇదుగో, తీసుకో నీ మనీ.... ఎవరయినా చూస్తారు మళ్ళీ!"

స్టాలిన్ చటుక్కున చేయి చాపాడు కిందనుంచి. అతని చేతి కేదో చిటుక్కున గుచ్చుకుంది అగచేతి

పైన.

అతను చెయ్యి వెనుకకు తీసేసుకుని మూలిగాడు బాధగా.

"అయాం సారీ ఫ్రెండ్!" బాలరాజ్ నవ్వుతూ లేచాడు, "బేరర్! బిల్లెంత?"

బిల్లు చెల్లించి, కుర్చీలో అప్పటికే కొయ్యబొమ్మలా కూర్చుని వున్న స్టాలిన్ నిర్జీవాకారాన్ని చూసి బయటికి కదిలాడు రెయిన్ కోటు మనిషి బాలరాజ్.

* * *

సాయం సంధ్య చీకట్లు ముసురుకుంటున్న వేళ అంబర్ పేట శ్మశాన వాటికలో మండి దగ్ధమవుతున్న తండ్రి మృతకాయాన్ని చూస్తూ నిర్లిప్తంగా నిల్చుంది సుహాసిని.

ఆమె నయనాల్లో తడి లేదు. పెదాలపై విషాదం లేదు. వదనంలో యెలాంటి భావాలూ లేవు. ఆమె మనిషిలా లేదు.

"భర్తృవిహీనయై, దానికి తోడు కూతురి దుస్థితికి మతి చాంచల్యం కలిగిన కాంత కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది.

ఇంకో వైపు ఒక మంచి నేస్తురాలిని పోగొట్టుకున్న దుఃఖంతో కుమిలి కుమిలిపోతున్నా రామె స్నేహితురాళ్ళు!

సతీష్ తండ్రి చితిని చెమ్మగిల్లిన కళ్ళతో చూస్తున్నాడు.

పోలీసు లింకా ఆగలేదు. సుహాసినిని జీపెక్కించారు. ఆమెని వదలకుండా పట్టుకున్న తల్లినీ, మిత్రురాండ్రనీ వేరుచేయడం కష్టమే అయింది. సతీష్ చెల్లెల్ని సమీపించి ఒక మాట అన్నాడు: "నీకు వాళ్ళు చేసిన దానికి

నువ్వు మంచి పని చేశావు. నిన్ను అభినందిస్తున్నాను సుహాసినీ. నాన్నకు జరిగిన దానికి వాళ్ళని నేను చూసుకుంటాను. నీమనసు గట్టిది. అయినా మన లాయర్ నిన్ను కాపాడే వరకూ చిక్కబట్టుకుని వుండమని కోరుతున్నాను."

జీపు కదిలింది.

సతీష్ తల్లితో తను కారు వద్దకి నడిచాడు.

స్నేహితురాళ్ళు అనుసరించారు. అంతా కారులో గృహోన్ముఖులైయ్యారు గుండెల్లో గంపెడు దుఃఖభారంతో.

ఇదంతా దూరం నుంచి గమనిస్తున్నాడొక ప్రేక్షకుడు.

అతడు నరేన్. నరేన్ కుమార్, మెడిసిన్ ఫైనల్.

• • •

హెచ్చరిక ప్రకారం మొదలవనే అయింది వర్షం అన్న సమయానికి.

జైహింద్ కేఫ్‌లో స్టాలిన్‌ని కలుసుకున్న మనిషి ఆనవాలు ఆధారంగా అతనే కామేశ్వరరావుని చంపిన హంతకుడిగా నిర్ధారణ అయింది. అయితే అతని వేలిముద్రలు అక్కడ లేవు. ఆ మనిషి అంతకుముందెప్పుడూ ఆ కేఫ్‌కి రాలేదు.

ఆ మనిషి జాడ తెలుసుకోవడం కోసం చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. అతనెలా వెళ్ళాడో అప్పుడెవరూ చూడలేదు. స్టాలిన్ వేలి ముద్రల్ని రికార్డ్స్‌తో తనిఖీ చేయడం జరిగింది. అదీ ఫలితం ఇవ్వలేదు. స్టాలిన్‌కి పోలీసు రికార్డు లేదు.

జైహింద్ కేఫ్ కో - ప్రొప్రయిటర్ చాంద్‌రాం

స్టాలిన్‌ని బాగా యెరిగున్న మనిషి. అయితే కేసులో యిరుక్కుంటానన్న భయంతో సాయంత్రం డిటెక్టివ్‌లు వచ్చి పలకరించే వరకూ అతను పెదవి విప్పలేదు.

లోపల తన ప్రైవేట్ రూంలో డిటెక్టివ్‌లతో ఏకాంతంగా బీరు సేవిస్తూ స్టాలిన్ గురించి తనకు తెలిసిందంతా చెప్పేశాడు.

డిటెక్టివ్‌లు స్టాలిన్ నివాసానికి బయలుదేరి వెళ్లారు.

పంజగుట్టలో ఒక మెయిన్ రోడ్డు మీదే వున్న ఆ పెంకుటింటి ముందు కారాపి దిగారు.

వర్షంలో తడుస్తూ వీధికే వున్న ఆ యింటి తలుపును మెట్లెక్కి చేరుకున్నారు.

తలుపు మూసి వుంది. దానికి తాళం వుంది.

డిటెక్టివ్‌లు అటూ యిటూ చూశారు. కుడి వైపు కొంత దూరంలో ఒక పాన్ షాపు వుంది. అక్కడ మంది యెవరూ లేరు వర్షానికి. షాపతను లోపల ముడుచుకుని కూర్చున్నాడు చలికి. లాల్ గబగబా అటు నడిచాడు. తడుస్తూ ఆ షాపుని చేరుకున్నాడు. షాపతను వినయంగా చూశాడు.

లాల్ ఒక సిగరెట్ ప్యాకెట్ తీసుకుని వంగి లోపలికి ఒక సిగరెట్ వెలిగించుకుని అతన్ని పరిశీలనగా చూశాడు. అప్పుడా యింటి వైపు చూపిస్తూ అడిగాడు

"ఆ యిల్లు స్టాలిన్ దేనా?"

"అవును సాబ్!"

"ఇంట్లో యెవరూ లేరా?"

"తెలీదు సాబ్!"

"స్టాలిన్‌కి భార్యా, పిల్లలు లేరా?"

"భార్య వుంది సాబ్!"

"ఆమె పేరు తెలుసా?"

"మార్గరెట్ సాబ్!"

"ఎక్కడుందామె?"

"తెలీదు సాబ్!"

"ఏం చేస్తుంటాడు స్టాలిన్?"

"బ్రోకరేజి .... సాబ్!"

"ఏం బ్రోకరేజి?"

"భూములూ అవీ....సాబ్!"

"ఆమె ఎప్పట్నించి లేదు?"

మధ్యాహ్నం నుంచీ లేదని చెప్పాడు పాపువాడు. మధ్యాహ్నం ఒంటి గంట ప్రాంతాల యెవరో మనిషి వెళ్ళాడట యింట్లోకి. అతను రెయిన్ కోటు తొడుక్కున్నాడు. ఎక్కడ్నించో దూరం నుంచి నడుచుకుంటూ వచ్చాడట. తిరిగి ఎప్పుడెళ్ళిపోయాడో తను చూడలేదన్నాడు.

లాల్ కదిలాడు. కదిలి వేగంగా తలుపు దగ్గర జాన్‌ని చేరుకున్నాడు. "సమ్‌థింగ్ డ్రాస్టిక్ హేపెండ్! కాల్ ది పోలీస్!"

జాన్ పరుగెత్తుకుంటూ యెదురుగా క్యాంటీన్‌లో దూరి ఫోన్ యెత్తాడు. ఫోన్ చేసిన అయిదు నిమిషాల్లో వచ్చి చేరుకున్నారు పంజగుట్ట పోలీసులు.

తాళం పగులగొట్టారు. తలుపు తెరచి లోపలకు ప్రవేశించారు.

ఇంకా లోపలికి వెళ్ళే అవసరం ఏర్పడలేదు.

మంచం మీద అస్పష్టంగా కనిపిస్తున్న ఆకారం, గదిలో లైటు వేసినప్పుడు బాగా కనిపించింది.

ఆమె ప్రశాంతంగా నిద్రిస్తున్నట్లుంది. ఆమెకు పాతికే

ఖ్కుంటాయి. కొంచెం మానిన తర్వాత ఆమె నిద్రలో అసహజత్వం దేని తాలూకో యిట్టే తెలిసిపోయింది.

మరో పాయిజనింగ్ డెత్!

ప్రక్కనే ఓ చీటి!

దానిమీద యిలా వుంది: 'మా జాడ తీయకండి.... చావులు తప్పవు తాయి!'

* * *

మొదటి ఆట సినిమా వదలగానే నజ్మా బేగం థియేటర్‌లో యింకా ఉండకుండా వచ్చేసింది గబగబా. బయట కుండపోతగా వర్షం కురుస్తుంది.

ఈ వర్షంలో తడుస్తుందని తెలుసు. అయినా ముందు యిల్లు చేరడం ముఖ్యం. లేకపోతే తల్లి గాభరా చెందుతుంది. ఈ వర్షం యెప్పుడు తగ్గుతుందో! రిక్షా యెక్కడానికి డబ్బులేవు ఆమె దగ్గర. బురఖా తనని కొంత వరకూ కాపాడగలిగినా, తమ్ముడు తడిసి ముద్దయిపోతున్నాడు. వాడికి జలుబు చేస్తే రేపు వైద్యానికి డబ్బులేవు.

డబ్బు....డబ్బు.... ఈ బీదరికంలో మగ్గుతూ ఎందుకీ సరదాలన్నీ? సినిమా చూడకపోతే ఏంపోయింది తనకు? ఆమె విసుక్కుంటూ గబగబా నడుస్తోంది తమ్ముడి చేయి పట్టుకుని.

ఆ థియేటరుకు రెండు ఫర్లాంగుల దూరంలో ఓ సందులో మాటు వేసిన మేనియక్ మసాన్, తాగిన వాసన కొడుతూన్న నోట్లోంచి ఆరిపోయిన బీడీ ముక్కని తీసిపారేసి గట్టిగా తిట్టుకున్నాడు. అతను ఆలస్యాన్ని భరించలేడు.

ఇంకో రెండు నిమిషాలు చూశాడతను.

నజ్మా వడివడిగా అడుగులేస్తోంది. తమ వెనుక ఎవరూ తోడుగా రాకపోవడం గుండెలో గుబులుగానే వుంది. ఇక్కడ్నించీ దారంతా చీకటే. పైగా వర్షం కాబట్టి జనసంచారం లేదు. కుడిపక్క పొడవయిన కాంపౌండ్ గోడ, ఎడమవయిపు కూలిపోయిన పాత యిళ్ళ వరుస. ఇవే ఆ వీధికి అలంకారాలు! లైటు స్తంభం వీధి మొదటికే పరిమితం. మిగతా దారంతా అంధాకారం. ఆమె తమ్ముడితో వేగంగా నడిచిపోతోంది.

అప్పుడు చూశాడు మేనియాక్ మస్తాన్ వీధిలోకి తిరుగుతున్న రెండు ఆకారాల్ని. లైటు స్తంభం వెలుగులో వాళ్ళని స్పష్టంగా గుర్తుపట్టాడు. అతని పెదవులపై వెంటనే విషపు నవ్వు విరిసింది. చేతులు రుద్దుకుని జేబులోంచి కత్తి తీశాడు.

అలా సాగిపోతున్న నజ్మాకి అనుకోకుండా ఏదో అడ్డు రావడంతో బెదిరి ఆగిపోయింది. కాస్సేపు ఆమె కేమీ కన్పించలేదు. అప్పుడు కంపు వాసన వేసింది. ఆమె అదిరిపడి కెవ్వు మనబోయింది. కానీ ఏదో అంతలోనే నోటికి అడ్డం పడింది—ఎవరో ఆమెని పట్టుకుని పక్కకి గుంజారు. ఆమె గింజుకుంటూ నోటిమీద చేతిని తీసేసింది. కెవ్వు మని అర్చింది.

ఆమె తమ్ముడు ఛోటూ తన అక్కకి జరుగుతున్నది గ్రహించి ఆ ఆకారం మీద పడి కసిక్కన చెయ్యి కొరికాడు, "ఛోడ్ దే ... మేరీ ఆపా కో ఛోడ్ దే!" అంటూ.

మేనియాక్ మస్తాన్ ఆమె చేతులు వదిలేసి ఛోటూని జాడించి తన్నాడు. వాడు కేక వేసి దూరంగా వెళ్ళి పడ్డాడు. నజ్మా, "ఛోటూ!" అని అరిచి తమ్ముడి వద్దకు

ఉరకబోయింది. మస్తాన్ వెనక్కి లాగి క్రూరంగా చూశాడు కత్తి చూపిస్తూ, "చల్ సాతీ, చల్ మేరేసాత్!"

ఆమె గజగజ వణికిపోయింది! మస్తాన్ లాక్కుపోతున్నాడామెని. ఆమె గొంతెత్తి "బచావో! బచావో!" అరిచింది. వినిపించుకునే నాథుడు లేడు. ఛోటూ పరుగెత్తుకొచ్చి అక్క చెయ్యి పట్టి లాగాడు.

"ఆపా!"

"ఛోటూ!"

"అంతే! విసురుగా కత్తి వచ్చి ఛోటూ కడుపులో దిగింది. అదక్కడలాగే వుండిపోయింది. వాడు కడుపు పట్టుకుని కింద పడ్డాడు.

తమ్ముడికేం జరిగిందో తెలియని నజ్మాని, పశుబలంతో లాక్కుపోతున్నాడు మస్తాన్ ఆ పాడుబడ్డ యింట్లోకి; "అబ్ చల్! కిదర్ జాయేగీతూ, సాలీ?" అంటూ.

మేనియాక్ మస్తాన్‌కి ఆరుగురు ముస్లిం కన్యల్ని చెరచిన చరిత్ర వుంది.

* * *

"ఈ రెయిన్ కోటు మనిషి ఎవడో ఘరానా స్టైల్లో మర్డర్స్ చేస్తున్నాడు. సైలెన్సర్ రివాల్వర్‌తో కాలుస్తున్నాడు; సయనేడ్ సూదుల్తో గుచ్చుతున్నాడు. వీ డెవడో, వీడి చరిత్రేమిటో, కథా కమామిషూ ఏమిటో బొత్తిగా తెలియడం లేదు. వీడ్ని చూసినవాళ్లు మాత్రం వీడు బూడిద రంగు కోటు కింద గాడిద రంగు ప్యాంటుతో వున్నాడనీ, ముసలి వెధవనీ చెపుతున్నారు" అన్నాడు జాన్ సిగరెట్ తాగుతూ.

"బ్లూ కలర్ మెటడార్స్ ఎక్కడ కన్పించినా ఆపి

చెక్ చేయమని ఆర్డర్స్ వెళ్ళాయి మిస్టర్ జాన్!" అన్నాడు కృష్ణన్.

"మరేమయింది?"

"చాలా వెహికల్స్ చెక్ చేశారు. ఫలితం లేదు. వాటి ఓనర్స్ అనుమానించదగ్గ వ్యక్తులుగా యింతవరకు తేలలేదు."

"వెల్, ఆ ముసలాడు జాగ్రత్తపడుతున్నాడు. ఎక్కడా వేలిముద్రలు వదల్లేదు. స్టాలిన్ భార్యని గుట్టుగా చంపేసి వెళ్ళిపోయాడు నోట్ వదిలి. వాడి జోలికి పోకపోతే చావులు తప్పతాయట! మనల్ని కని పెడుతున్నారా?"

"కనిపెట్టవచ్చు. చెప్పలేం!"

"కృష్ణన్, మనల్ని కనిపెట్టేకంటే వాడింకెక్కడో టిప్స్ ద్వారా తెలుసుకుంటున్నాడని నా అనుమానం" అన్నాడు జాన్. "మీ ఫోర్స్‌లో యెవరో కరప్ట్ ఆఫీసర్ వుండాలి. వాడికి యిన్ఫర్మేషన్ అందిస్తున్నాడు. అందుకే నిన్న రాత్రి మా కారుని అటకాయించాడు. లేకపోతే వాడికెలా తెలుసు, సుహాసినిని కిడ్నాప్ చేసింది వైట్ ఫియట్‌లోనే నని? అసలా కిడ్నాప్ గురించి యెలా తెలుసు? ఒక్కటే జవాబు—మీ డిపార్టు మెంట్ నుంచి యిన్ఫర్మేషన్ లీక్ అవుతోంది."

"ఓహ్! అలాంటి దాఖలాలు ఏవీ లేవింతవరకూ!"

"వేచి చూద్దాం యింకా!"

"కానీ సుహాసిని కోసం వాడెందుకు ప్రయత్నించి నట్టు?"

"నా కొక్కటే తోస్తోంది!" అన్నాడు జాన్.

"ఏమిటి?"

"అమ్మాయిల్ని అపహరించే ముఠా కావచ్చు వాడిది. అరబ్ దేశాలకి పంపుతూండవచ్చు వాళ్ళని."

"ఓహ్! కానీ అమ్మాయిలు తప్పిపోతున్నట్లు యింత వరకు రిపోర్ట్సు లేవు!"

"బహుశ వాళ్ళిప్పుడే మొదలు పెట్టి వుంటారు."

"అయితే యీ విషయం వెంటనే ప్రెస్ నోట్ రిలీజ్ చేయాలి."

"చేయండి. ప్రజలు జాగ్రత్తలో వుంటారు" అని లాల్‌ని చూశాడు జాన్, "ఏమంటావు పార్ట్‌నర్?"

లాల్ తల విదిలించాడు: "ఇన్‌ఫర్మేషన్ ఎవరూ లీక్ చేయడం లేదు - అదే అవుతూందనిపిస్తోంది."

"అంటే?"

"శత్రువుల దగ్గర ట్రాన్స్‌మిటర్ ఎక్విప్‌మెంట్ వుండొచ్చు. పోలీస్ వైర్‌లెస్ కమ్యూనికేషన్ అంతా యథేచ్ఛగా వినగలుగుతారు."

జాన్, కృష్ణన్‌లు గాభరాగా చూశారు.

"ఓహ్, అవును. ఆ అవకాశముంది. నేను ఎలర్ట్ చేస్తాను!" అన్నాడు కృష్ణన్.

"సుహాసినిని మేజిస్ట్రేటు ముందు ఎప్పుడు హాజరు పరుస్తారట?"

"రేపుదయం లాల్, పదకొండు గంటలకి."

బెయిల్ కవకాశముందా?"

"వాళ్ళ లాయర్ ప్రయత్నిస్తున్నాడు."

"మిస్టర్ కృష్ణన్, మన మొక విషయం తెలుసుకోవడం వదిలేశాం."

"ఏమిటది?"

"స్టాలిన్‌ని కలుసుకున్న ఆ రెయిన్‌కోటు మనిషి

జై హింద్ కేఫ్ కెలా వచ్చాడో తెలియదు. ఆ చోటు వాళ్ళు ముందే నిర్ణయించుకున్నారా లేక స్టాలిన్ అక్కడ్నించి ఫోన్ చేసి పిలిచాడా? ఈ రెండోది జరిగితే సేట్ చాంద్‌రాం ఏదయినా చెప్పవచ్చు—"

"ఏం చెప్పవచ్చు?"

"స్టాలిన్ డయల్ చేసిన నెంబరు."

"ఓహ్, యస్, యస్. మీరు వెళ్తున్నారా?"

"వెళ్ళాలి, లాల్ లేచాడు, ఆ రెయిన్‌కోటు మనిషిని పట్టుకోవాలి. వాడు మా కళ్ళముందే హత్య చేశాడు. నాకు మనశ్శాంతి లేదు. వాడ్ని వదలను."

"ఆ నెంబర్ చాంద్‌రాం చూసివుంటాడని ఏమిటి?" జాన్ అన్నాడు.

"యూ పూర్ పార్ట్‌నర్, నువ్వు పాజిటివ్ థింకింగ్‌ని అలవర్చుకోవాలి" అన్నాడు లాల్ బయటికి వెళ్ళిపోతూ.

• • •

జై హింద్ కేఫ్ ముందు కారు దిగాడు లాల్.

వర్షం పడుతూనే వుంది. రెండంగల్లో లోపలికెళ్ళి కౌంటర్ ముందాగాడు. కౌంటర్‌లో యెవరో కొత్త మనిషి వున్నాడు.

"మీ సేట్ యేడి?" అన్నాడు లాల్.

"నేనూ సేట్‌నే!" కఠినంగా వచ్చింది జవాబు.

"చాంద్‌రాం యేడి?"

"నేను నాథూరాంని. చాంద్‌రాం నా తమ్ముడు."

"ఆ తమ్ముడే యేడీ?"

"ఇంట్లో వున్నాడు. నైట్ డ్యూటీ నాది."

"ఫోనుందా ఇంట్లో?"

"లేదు. ఇంటిని గురించి మేం పట్టించుకోం."

"ఐసీ....అడ్రసు ఇస్తావా?"

"చాంద్‌తో మీకేం పని? మీరెవరసలు?" మళ్ళీ కఠినస్వరం.

లాల్ చెప్పాడు: "లాల్. డిటెక్టివ్. ఉదయం ఖూనీ. స్టాలిన్, రెయిన్‌కోటు మనిషి...."

"నాథూరాం అదిరిపడ్డాడు. "మీరు డిటెక్టివా? మీ గురించి చాంద్ చెప్పాడు! అవును, స్టాలిన్‌ని చంపారు. డిటెక్టివ్ సాబ్, స్టాలిన్‌ని ఎవరు చంపారు?"

"రెయిన్‌కోటు మనిషి."

"ఓహ్, అవును! వాడేనట—వాడి గురించి నాకేం తెలియదు! చాంద్ చెప్తాడు వెళ్ళండి ఇంటికి. మా యిల్లు...." గబగబా చెప్పాడు నాథూరాం. "క్షమించాలి సాబ్. మీ రెవరో ముందే చెప్పలేదు...."

"ముందే చెబితే మీ సహజ ప్రవర్తన తెలిసేదికాదు" అన్నాడు లాల్ వెళ్ళిపోతూ.

పది నిముషాల్లో ఆ ప్రాంతం చేరుకున్నాడు లాల్, కారులో.

కారు దిగి లాల్ చుట్టూ చూశాడు.

వర్షం తగ్గుతోంది. దోమల్‌గూడలోని ఆ చిన్న సందులో ఇళ్ళన్నీ నిశ్శబ్దంగా వున్నాయి. స్ట్రీట్ లైట్ల వెలుగులో ఆ వీధి దేదీప్యమానంగా వుంది. పదకొండున్నర దాటిన ఆ రాత్రి సమయంలో ఎవరూ బయట తిరగటంలేదు. చలికి, వర్షానికి, తలుపులేసుకుని ఇళ్ళలో వుండిపోయారు.

లాల్ తన కావల్సిన ఇల్లును వెతుక్కున్నాడు.

ఆ యింటి తలుపు సందుల్లో లైటు కాంతి ప్రస

రిస్తోంది.

అతను దగ్గర కెళ్ళి తలుపుమీద కొట్టాడు. ఎవరూ పలక లేదు. మళ్ళీ కొట్టి పిల్చాడు. అయినా జవాబు లేదు. తలుపుని నెట్టితే అది తెరుచుకుంది.

లాల్ సంకోచించాడు, లోపలికి చూస్తూ.

ఆ ముందు గదిలో ఎవరూ లేరు.

మరోసారి పిలిచి, లోపలికి అడుగు వేశాడు.

అప్పటికీ ఎవరూ రాలేదు.

ఎదురుగా ఇంకో గది కన్పిస్తోంది.... దాని తలుపులు తెరచి వున్నాయి.

"చాంద్ రాం!" పిలిచాడు లాల్ ఆ గదిలోకి తొంగి చూస్తూ.

అతను ఉలిక్కిపడ్డాడు. నిశ్చలంగా అలా చూస్తూండి పోయాడు.

"తేరుకుని. గబగబా లోపలి కెళ్ళిపోయాడు. ఎదురుగానే గోడ కానుకుని కింద కూర్చున్నతని సమీపించి నాడీ చూశాడు.

చెయ్యి వదిలేసి అతని కళ్ళలోకి చూశాడు. అవి ఎటో శూన్యంలోకి చూస్తున్నాయి. "చాంద్ రాం!" అని అప్రయత్నంగా పిలిచి, నుదుట్లో గాయాన్ని చూశాడు లాల్. రక్తం యింకా వస్తూనే వుంది.... అదింకా ముఖాన్ని వికృతం చేస్తోంది.

లాల్ భారంగా నిట్టూరుస్తూ నిలబడ్డాడు. అతనక్కడ్నించి కదలబోతున్న క్షణంలోనే వెనుకేదో అలికిడి విన్పించింది. గిరుక్కున తిరిగి చూసేంతలో....

"మిస్టర్, కదలకు. షూట్ చేస్తాను—" రెయిన్ కోటు మనిషి అన్నాడు, రివాల్వర్ గురిపెడుతూ.

లాల్ వెంటనే చేతులెత్తి నిలబడ్డాడు.

అతడా మనిషిని తీక్ష్ణంగా పరిశీలించాడు. అదే పోలిక. అదే ఆకారం, నిన్న తమ కారుని అటకాయించి కామేశ్వరరావుని హత్య చేసిన భారీ కాయం. అదే గొంతు, తమని అమ్మాయికోసం బెదిరించిన కర్కశ కంఠం. ఆ తర్వాత స్టాలిన్, అతడి భార్య మార్గరెట్, యిప్పుడీ చాంద్ రాంలని మట్టుబెట్టిన వృద్ధ హాంతకుడే వీడు!

అతను లాల్ ని కోపంగా చూస్తూ పళ్ళు నూరాడు: "మా జాడ తీయవద్దని హెచ్చరించాను, యెందుకు వచ్చావు?"

లాల్ గుటక మింగాడు. "నువ్వెందర్ని చంపగలవో చూద్దామని."

"ఓహో, లెక్క వేసుకో, ఇప్పుడు నిన్ను కూడా చంపబోతున్నాను."

"అంత పిచ్చిపని చేయబోవు."

"ఎందుకు చేయబోను?"

"ముహూర్తం బాగాలేదు, ఓల్డుమాన్."

"ఏమైంది దానికి?"

"మృత్యువు నీ వెనుకే వుంది. అటు చూడు...."

పాపం వృద్ధ హంతకులవారికి కొన్ని వృత్తిపరమైన మెళుకువలు తెలియనట్లుంది, లేక ఆ సమయంలో మనో మాంద్యం యేర్పడినట్లుంది, వారు ఉలికిపాటుతో వెనక్కి తిరిగి చూశారు—

అంతే—ఆ మరుక్షణంలో చూసుకుంటే చేతిలో రివాల్వర్ లేదు. స్టీలు బీరువా యెక్కి కూర్చుంది యెగిరి వెళ్ళి.

లాల్ అతనిమీదికి లంఘించి కంఠం పట్టుకున్నాడు. వెనక్కి వంచుతూ చాచి ఫెడీమని గుద్దాడు మొహం మీద! అతడలాగే వెనక్కి పడిపోయాడు గడపమీద! లాల్ అతనిమీద పడ్డాడు. ఆ బరువు! 'ఓ ఫోఫోఫ....' అన్నాడు వృద్ధహంతకుడు తన్నుకుంటూ.

లాల్ అతని ఛాతీమీద మోకాళ్ళు పెట్టి నొక్కేస్తూ "చెప్పు, ఎవరు నువ్వు? యెందుకిలా చంపుతున్నావ్? నీకేం కావాలి? కమాన్!" అని అరిచాడు.

షాక్ కి లోనయినప్పుడు ఎంతటి బలశాలియైనా నిస్సహాయుడవడం సహజమే. కోలుకుంటే వాళ్ళని ఎదుర్కోవడం అందరి తరమయ్యేది కాదు—

ఆ మనిషి అప్పుడే కోలుకున్నాడు. తనకేం జరుగుతోందో గ్రహించాడు. పరిణామాలు వూహించాడు. అంతే, అతడి వంట్లో ఎక్కడలేని బలమూ వచ్చేసింది! మోకాళ్ళతో నొక్కేస్తున్న లాల్ ని నడుము పట్టుకుని, వెనుకనుంచి కాళ్ళు లేపుతూ, అమాంతం పైకెత్తి తన మీదుగా వెనక్కి విసిరేశాడు. లాల్ వెళ్ళి ముందుగదిలో బోర్లాపడ్డాడు దభీమని!

ఆ మనిషి ఒక్క ఉదుటున లేచి స్టీలు బీరువా కేసి ఉరికాడు. లాల్ తల విదిలించేస్తూ లేచి అది చూశాడు. అతను లేచి పరుగెత్తేలోగానే ఆ మనిషికి రివాల్వర్ అందిపోయింది....

అతను పిచ్చికోపంతో లాల్ మీదికి కాల్చాడు. సకాలంలో కిందపడుకుని, బయటికి వెళ్ళిపోవడానికి బుల్లెట్ కి దారిచ్చాడు. సర్ ర్ ర్ ....మంటూ అది తలుపుపైనే గోడకు రంధ్రం చేసింది.

సైలెన్సర్ రివాల్వర్.

మళ్ళీ పేల్చేలోగా లాల్ తటాలున లేచి, మోకాలితో అతని పొట్టలో చాచి తన్ని, బీరువామీద పడగానే దవడ వాయగొట్టి, చెయ్యి మెలిదిప్పి పట్టుకున్నాడు. రివాల్వర్ రెండుసార్లు చకచక పేలింది. బుల్లెట్లు రెండూ గోడలోకి దూసుకుపోయాయి. రెచ్చిపోయి, తల లాల్ ఛాతీకి పెట్టి నెట్టివేస్తూ కింద పడదోసి, మీద పడ్డాడా వృద్ధ హంతకుడు. ఇద్దరి చేతుల్లో రివాల్వర్ నలిగిపోతోంది. ఒకరివైపు ఒకరు తిప్పుకోవడానికి బలప్రయోగం చేస్తున్నారు రొప్పుతూ రోజుకుంటూ. అలా దొర్లుకుంటూ తలుపువరకూ వచ్చారు. ఈలోగా మరి రెండుసార్లు పేలింది రివాల్వర్ — అప్పుడింకా గుళ్ళు లేవు.

ఆ రెండు గుళ్ళూ నోట్లోకి ఒకటి, నుదుట్లోకి ఒకటి వెళ్ళి ఇరుక్కున్నాయి. వాటిని లోపల ఇముడ్చుకోలేక గిలగిలా తన్నుకోసాగాడు. లాల్ లేచి ఆయాసంతో చూస్తూండగానే, రక్తం మడుగులో అత డెంతో సేపు గాకుండా కాళ్ళూ చేతులు వేలాడేసి, తల పక్కకు వాల్చేశాడు.

లాల్ యింకా వగరుస్తున్నాడు అతన్ని చూస్తూ. వేగంగా వూపిరి తీసుకుంటున్నాడు. అప్పుడు పక్కన కూర్చుని గబగబా రెయిన్‌కోటు బటన్స్ తీసి, ప్యాంటూ షర్టు జేబులు వెతికాడు. ప్యాంటు జేబులో కొన్ని కాగితాలు దొరికాయి. వాటిని చకచకా తిప్పుతూ పరిశీలించసాగాడు—

అతనికి తెలియదు—

ఆ వెనుకనున్న యింకో గదిలోంచి నిశ్శబ్దంగా తలుపు తీసుకుని ఓ నల్లటి ఆ ఆకారం రావడం.

ఆ ఆకారం చేతిలో ఇనుపకడ్డీ వుండడం.

అతను కాగితాలన్నీ చూసి, నిట్టూరుస్తూ లేవబోతున్నాడు—

ఇనుపకడ్డీ నెత్తిన పడింది. అతను ముందుకు పడ్డాడు. అంతే—కదలకుండా వుండిపోయాడు.

ఆ నల్లని ఆకారం వెంటనే గట్టిగా ఈల వేసింది.

ఆ వెనుక గదిలోంచే మరికొన్ని ఆకారాలు దూసుకొచ్చాయి.... మూడు.

అక్కడ శవాలు రెండింటినీ, ఒక సజీవ శాల్తినీ చూసి ఉద్రేకపడ్డాయి.

"గురూ! చచ్చాడు!" అరిచిందొక ఆకారం.

"ష్, అరవకు!" వారించింది నల్లని ఆకారం, "తీసికెళ్ళిపోవాలి, త్వరగా పదండి!"

ఆ ఆకారం వంగి రెయిన్ కోటు మనిషి కాళ్ళు పట్టుకుంది. ఇంకో ఆకారం చేతులు పట్టుకుంది. రెండూ శవాన్ని ఎత్తుకుని పరుగుతీశాయి.

ఇంకో రెండు లాల్ ని తీసుకుని పరుగెత్తాయి.

అన్నీ కలిసి వెనుక గదిలోంచి అవతలికి దౌడు తీశాయి—సన్నగా కురుస్తున్న వర్షంలో, బురదని చిమ్ముకుంటూ, జారిపడకుండా యెంతో నేర్పుగా.

• • •

"లేదు మమ్మీ. చెల్లెలికేమీ కాదు. నన్ను నమ్ము. దాన్ని విడిచిపెట్టేస్తారు నువ్వు చూస్తూండు...." తల్లిని ఓదారుస్తూ అంటున్నాడు సతీష్.

"నమ్మకు! అదింక తిరిగిరాదురా! దానికి బ్రతుకు తెల్లారిపోయింది!" అందామె వెక్కి వెక్కి ఏడుస్తూ.

"అంతే .. అంతేరా! అది అన్యాయమై పోయింది....
దాన్ని మనమిక చూడంరా, బాబూ!"

సతీష్ ఆమె కళ్ళు తుడిచాడు ఆవేదనగా. "నువ్వేడిస్తే నాకు ధైర్యముండదు మమ్మీ. నువ్విలా అయిపోకు. నేను చాలా పనులు చేయాలి. నాకు ధైర్యమివ్వు. చేయూత నివ్వు. చెల్లెల్ని రక్షిస్తాను. డాడీ హంతకుల్ని అంత మొందిస్తాను!"

"బాబూ!" ఆమె గాభరాగా అతన్ని పట్టుకుంది. "నువ్వలా అనకు! అలా మాట్లాడకు యింక! నువ్వూ నా కాకుండా పోతావు! వద్దు, ఆ హంతకుల జోలికి పోకు నువ్వు! నా మాట విని నువ్వింట్లోనే వుండు! యెక్కడికీ వెళ్ళకు—"

"వాళ్ళను చంపి అప్పుడు వస్తాను, మమ్మీ."

"నీకేం పట్టిందిరా! నువ్వేం చేస్తావు వాళ్ళని? అంత క్రూరుల్ని! వూరికే మీ నాన్నలా సినిమా మాటలు మాట్లాడకు! నువ్విళ్ళు కదిలితే నేనిప్పుడే—యిప్పుడే చచ్చి పోతాను—"

"ఓహ్ మమ్మీ, నీకు డాడీ హంతకులమీద కసి లేదా?"

"ఎందుకు లేదురా, కానీ ఆ పని నువ్వు చేయకూడదు. సమయం వస్తే నేనే చేస్తాను........" ఆమె కళ్ళు మెరిశాయి.

"భయపడ్డాడు సతీష్. "మమ్మీ....!"

"ఎక్స్‌క్యూజ్ మీ...."

వెనుక మాటలకి చటుక్కున తిరిగిచూశా రిద్దరూ.

జాన్ లోపలికొస్తూ అన్నాడు. "మీరిలా ఉద్రేక పడుతూ వుండడం మంచిదికాదు. శాంతించాలి, నెమ్మది

పడాలి. మాతో సహకరిస్తే చాలు, మీ రనుకు శేవన్నీ నెరవేరుతాయి. ప్లీజ్, మిస్టర్ సతీష్! మీ మమ్మీకి నచ్చ జెప్పండి. మీరూ నిదానించండి. మీరింత ఉద్రేకపడా ల్సిన అవసరంలేదు. సుహాసిని విషయం వేరు. ఆమె చేసిందీ సరయినదే, ఆ పరిస్థితుల్లో. కానీ మీ డాడీకి జరిగిందానికి చర్యతీసుకునే వాక్కు ఇప్పుడు చట్టానికే వుంది....ఆలోచించండి!"

వాళ్ళిద్దరూ ఒకర్నొకరు చూసుకున్నారు.

"వాళ్ళు మీ కళ్ళముందే చంపినా మీరేమీ చేయ లేకపోయారు!" అన్నాడు సతీష్ వెక్కిరింపుగా.

"అవును, దానికి చింతిస్తున్నాం. మీ డాడీ చావుతో మా పట్టుదల పెరిగింది. వాళ్ళని పట్టుకతీరతాం. వాళ్ళు శిక్షను తప్పించుకోలేరు!

"ఇప్పుడు—మిస్టర్ సతీష్—మీకో విషయం చెప్ప డానికి వచ్చాను. వాళ్ళని పట్టుకునేందుకు మేం విశ్వ ప్రయత్నం చేస్తున్నాం. వాళ్ళకి చేరువవుతున్నామనే మా నమ్మకం. అయితే అదే హంతకుడు ఈ రోజు ఇంకో రెండు హత్యలు చేశాడు—"

"ఎవర్ని?"

"అవి మీ డాడీ హత్యతో సంబంధమున్నవి కావు. వాళ్ళ ఉనికిని కాపాడుకోవడానికి. మీ డాడీని చంపిన కారణం వేరు. మీ చెల్లెల్ని వెతక్కుండా వుండేందుకు. ఎందుకని? వాళ్ళకామె అవసరం. ఆమె కోసమే నిన్న రాత్రంతా వాళ్ళు ప్రయత్నించారు. వాళ్ళకు మీ చెల్లెలులాంటి అమ్మాయిలు కావాలి. మా అనుమానం— ఆడపిల్లల్ని ఎత్తుకుపోయే ముఠా ఏదో ఇక్కడ పని చేస్తోందని.

"కాబట్టి, తమని పట్టిస్తారనే అనుమానమున్న వాళ్ళని చంపుతున్నారు. ఇంతవరకు ఇద్దర్నీ అలా చంపారు. తమ జాడ తీస్తే ఇంకా చంపుతామని హెచ్చరిక చేశారు.

"అయినా మా పద్ధతుల్లో మేం కృషి చేస్తూనే వున్నాం. రేపు అన్ని పత్రికల్లోనూ, రేడియోలోనూ హెచ్చరికలు వెలువడతాయి. అప్పుడు ఆడపిల్లలున్న వాళ్ళు జాగ్రత్తపడతారు.

"వాళ్ళని మేం పట్టుకునే వరకు మీరు ఓపిక వహించాలి. మీ సుహాసినికోసం మీరు చేయాల్సిన ప్రయత్నాలు చేయండి. ముందు ఆమెకు బెయిల్ తీసుకుంటే, కేసునెలాగో ఎదుర్కోవచ్చు. అలాంటి పరిస్థితిలో ఆమె చాలా తక్కువ శిక్షనుపొందే అవకాశముందని నేననుకుంటున్నాను. మేమూ మాకు చేతనయినంత సహాయం చేస్తాము. ప్రస్తుతం లాల్ అత్యవసర పనిమీద వెళ్ళాడు. అతన్నుంచి నాకింతవరకు ఏ కబురూ లేదు. అతనొచ్చేలోగా మిమ్మల్ని చూసిపోదామని వచ్చాను— మీరు నా సూచనల్ని అంగీకరిస్తారా?"

వాళ్ళిద్దరు తలూపారు వెంటనే.

"సతీష్‌కు ఆవేశం ఎక్కువ పీదేం ప్రమాదం తెచ్చుకుంటాడోనని భయపడుతున్నాను .... ఇప్పుడు మీరు చెప్పింది విన్నాక చల్లబడ్డాడనుకుంటాను" అంది సతీష్ తల్లి, అతన్నే చూస్తూ.

"సరే, మీకు తెలియకుండా ఏదీ చెయ్యను" అన్నాడు సతీష్.

"గుడ్, గుడ్ నైట్. ఇక దీనిగురించి ఆలోచించకండి!" అన్నాడు జాన్ అక్కడ్నుంచి కదుల్తూ.

* * *

సేడియం ప్రక్కన డ్రింక్ మోర్ బార్ ముందు కారాపి దిగాడా నల్లటి మనిషి.

బార్ మూసివుంది. వేళయిపోయింది. అతను తలుపు ముందాగి, దానిమీద కొట్టాడు. లోపల సంగీతం వినిపిస్తోంది సన్నగా. కొన్ని క్షణాలయ్యాక చటుక్కున తలుపు తెరచుకుంది.

ఆ పొట్టిగా, లావుగా వున్న తలుపు తీసిన మనిషి ఆశ్చర్యంగా, "నువ్వా, జింబో!" అన్నాడు.

నల్లటి మనిషి నోరు తెరిచి నవ్వాడు, "నేనే దారూ, లోనికి రానివ్వు."

"మూసేశాం!"

"తెరిచేసేయ్!"

దారూ సంకోచించాడు. క్షణం తర్వాత అయిష్టంగానే దారిచ్చాడు.

జింబో ఎలుగ్గొడ్డులా లోపలికి కదిలాడు. "ఒక ఫోన్ కాల్ చేయాలి, దారూ! అంతే, ఏమీ పుచ్చుకోనులే, మొహం తిన్నగా పెట్టుకో!"

"నా మొహాన్ని అనకు!" ఘీంకరించాడు పొట్టిమనిషి దారూ.

నల్లటి మనిషి జింబో కౌంటర్ దగ్గరికి నడిచి ఫోనెత్తాడు. అతను ఎంతో తాపీగా నెంబర్ తిప్పసాగాడు. అనేకసార్లు అలా ఫోన్ చేస్తున్నప్పుడు దగ్గరికి రానివ్వని జింబో, ఇవ్వాళ ఎందుకో పరధ్యానంగా కన్పిస్తూండడంతో అవకాశం తీసుకుని, దారూ అతని వెనుక చేరి ఆ తిప్పుతున్న నెంబర్ని గుట్టుగా తన బుర్రలో రికార్డు చేసుకున్నాడు.

చిక్కాడు నాయాల! అనుకున్నాడు ఆనందం

పట్టలేక.

జింబో డయలింగ్ పూర్తిచేసి అప్పుడు తేరుకొని, "సీక్రెట్, దారూ. అవతలకి వెళ్ళమ్మా!" అన్నాడు.

దారూ ఉలిక్కిపడి గబగబా వెళ్ళిపోయాడు బయటికి. అక్కడ నిల్చుని చలిలో వణకసాగాడు. అతడికా రోడ్డుమీద నల్లటి అంబాసిడర్ ఆగివుండడం కనిపించింది. అందులో కూర్చున్న ఆకారాలూ కనిపించాయి. అతని గుండె వేగంగా కొట్టుకుని, అప్రయత్నంగా ఒక అడుగు వెనక్కి—వేశాడు.

జింబో లోపల తగ్గు స్వరంతో అంటున్నాడు ఫోన్లో, "నేను బాస్, జింబోని సాడ్ న్యూస్ బాస్, గురూ చచ్చాడు."

"గురూ చచ్చాడా?"

"అవును, బాస్."

"ఎలా చచ్చాడు?"

జింబో గబగబా వివరించాడు.

"అప్పుడు మీరెక్కడ చచ్చారు?"

"ఇంటి వెనక బాస్, కారులో. వెళ్ళిన గురూ ఎంతకీ రాకపోతే వెళ్ళి చూశాం, బాస్. అలా కనిపించాడు."

"సరే, శవాన్ని పెట్రోలు పోసి తగలెట్టండి. ఆ డిటెక్టివ్‌ని తీసికెళ్ళి మీ క్యాంపులో కట్టిపడేయండి."

"అలాగే, బాస్. మరి రేపటి ఆపరేషన్ విషయం?"

"జరుగుతుంది. బాలరాజ్ చస్తే శంభూనాథ్ వస్తాడు. అతన్ని కలవండి. రేపటి ఆపరేషన్ అతనే హేండిల్ చేస్తాడు, ఓ.కే.?"

"ఓ.కే. బాస్."

"ఇక పెట్టేయ్."

జింబో పెట్టేశాడు ఫోను.

అతను అక్కడ్నించి వెళ్ళిపోతూ, అప్పుడే లోపలి కొస్తున్న దారాని చూసి ఆగిపోయాడు.

అదేమిటి దారూ, మొహం అలా అయిపోయిందేమ్మా?

నా మొహాన్ని అనకు!

జింబో నవ్వి అతని వీపు తట్టి బయటికెళ్ళిపోయాడు. దారూ గబగబా తలుపు దగ్గరికెళ్ళి కారు స్టార్టయి వెళ్ళి పోతూంటే, దాని నెంబర్ కూడా తన చురుకైన బుర్రతో రికార్డు చేసుకున్నాడు.

"చిక్కాడు నాయాళ్ళు!" అరిచి అతను సంతోషం పట్టలేక చప్పట్లు కొట్టుకుంటూ ఎగిరాడు. తలుపుమూసేసి వెనక్కి తిరిగాడు.

కాస్సేపటికి మళ్ళీ చప్పుడయింది తలుపు.

అతను కసురుకుంటూ వెళ్ళి తీసి, గాభరాగా చూశాడు.

"మిష్టర్ బార్ ఓవర్ కం పోలీస్ ఏజెంట్ దారూ మామా, ఫోన్ నెంబర్లూ కార్ల నెంబర్లూ నువ్వెన్ని సంపాదించావు చెప్పూ, చెప్పమ్మా ఎన్ని?"

లోపలి కొచ్చేస్తూన్న ఎలుగ్గొడ్డు ఆకారాన్ని చూసి గావుకేక వేయబోయాడు దారూ, నోరు మూశాడు జింబో.

దారూ నిలువునా వణికిపోసాగాడు, బెదురు కళ్ళతో.

"ఆనందం పట్టలేకపోయావు కదూ? చప్పట్లు కొట్టుకుంటూంటే చూశానమ్మా. వెనక్కి వస్తే బాగుంటుందనిపించింది...."

"నన్ను చంపకు, జింబో! నన్ను చంపకు!"

"నన్ను చావమంటావా?"

"నిన్నేమీ చేయను, జింబో! నమ్మ, నిన్నేమీ చేయను...."

జింబో తలుపు మూస్తున్నాడు.

"జింబో .... మేరేయార్, ఆగిపో! ఈసారికి వది లెయ్యి...."

దారూ వెనక్కి వెనక్కి జరుగుతున్నాడు.

"లేదు దారూ, ఈసారికే వచ్చేయ్!"

"జింబో. ప్లీజ్, నన్ను చంపకు....ప్లీజ్!"

"చంపనమ్మా. ఏదీ, ఊరికే మెడతిప్పి చూస్తాను..."

నల్లటి మనిషి జింబో, చేతులు చాపుతూ కదిలాడు ముందుకు.

• • •

తెల్లారింది.

వాన వెలిసింది. ఎండ కూడా వచ్చింది. వీధులూ రోడ్లూ తిరిగి యెప్పటి చైతన్యంతో కళకళలాడిపోతున్నాయి. జనంతో కిటకిట లాడిపోతున్నాయి.

కానీ జాన్ మనసు ఆందోళనగా వుంది—

అతను లాల్ కోసం తెల్లవార్లు జాగారం చేశాడు. జాడలేదు. ఆశ కాదుగదా కనీసం సూచనలు కూడా లేవు. ఒక ఫోన్ లేదు. ఒక కబురులేదు. యెక్కడి కెళ్ళాడు? ఏమైపోయాడు? మెదడు వేడెక్కి పోతోందే తప్ప సమాధానం దొరకడంలేదు.

అతను జైహింద్ కేఫ్‌కి వెళ్ళాడు, ఉదయమే అయిదుగంటలకి.

లాల్ గురించి చెప్పాడు నాథూరాం, కానీ వాళ్ళింటి కెళ్తే అక్కడ బయట తమ కారే వుంది, లాల్ లేదు.

లాల్ ఇంట్లో కూడా లేడు, అక్కడ చాంద్‌రాం

శవం మాత్రం కనిపించింది.

కొంత దూరంలో ఒక సైలెన్సర్ రివాల్వర్, ఖాళీది కనిపించింది.

అప్పుడు జాన్ పోలీసులకి ఫోన్ చేశాడు. కృష్ణన్ వచ్చి వ్యవహారం చూశాడు. లాల్ చాంద్ రాం హంత కుడ్ని వెతుక్కుంటూ వెళ్లాడా, లేక హంతకుడిచే అప హరించబడ్డాడా వాళ్ళకి తెలియలేదు.

సైలెన్సర్ రివాల్వర్ని చూసి రెయిన్ కోటు మనిషి స్ఫురించాడు.

తలుపు దగ్గర ఇంకో రక్తం మడుగుని చూసి రెండో హతుడెవరో సందిగ్ధంలో పడ్డారు.

అప్పుడు—ఇదిలా వుండగా—కృష్ణన్ కి ఇంకో కాల్ అందింది. స్టేడియం రోడ్ లోని డ్రింక్ మోర్ బార్ లో ప్రొప్రయిటర్ దారూవాలా చనిపోయి వున్నాడని.

ఆదరాబాదరా అక్కడికి చేరుకున్నారు—

ఎన్నో ఏళ్ళుగా బార్ నడుపుతూ, తన దగ్గరకొచ్చే ఎన్నెన్నో రకాల మనుషుల పోకడలని గమనిస్తూ, చర్యల్ని కనిపెడ్తూ, పోలీసులకి సమాచారాన్ని చేరవేసే సీక్రెట్ ఏజెంటుగా వ్యవహరిస్తూన్న దారూవాలా నేడు నేలకొరిగి వున్నాడు.

అధికారులందరి వదనాలు దుఃఖపూరితాలయ్యాయి అదిచూసి.

వాళ్ళంతా కోపోద్రేకులయ్యారు ఆ కిరాతకానికి.

అజాపజాలేని హంతకుడి జాడకోసం రెండుగంటలు అక్కడ శ్రమించారు. క్లూ ఒక్కటీ లేదు. ఈ హత్యని తమ దృష్టిలోని ఏ అనుమానితునికి అంటగట్టాలో అంతు బట్టలేదు. నిస్పృహతో అక్కడ్నుంచి కదుల్తూండగా

మాడావుడిగా బయల్దేరి అంతా చంద్రాయణ గుట్ట ప్రాంతానికి చేరుకున్నారు. అక్కడ లంబాడీ గుడిసెలకి కొంత దూరంలో, గుంపుగా చేరివున్న జనాన్ని చేరుకుని వెళ్ళి చూశారు.

ఒక శవం—సగం కాలింది—అక్కడ పడివుంది.

దాని ముఖం పూర్తిగా కాలిపోయింది. మిగతా దేహం అక్కడక్కడా దానికి దాదాపు సగం భాగం కాలిపోయిన రెయిన్ కోటు తొడిగి వుంది. అది బూడిద రంగులో వుంది.

శవంమీద ఏ వస్తువులూ లేవు.

జాన్, కృష్ణన్‌లు అపనమ్మకంగా చూశారు దాన్ని. రెయిన్ కోటు మనిషి. లేక ఇంకెవరిన్నో ఇలా ప్లాంట్ చేసి తన చావుని ఫేక్ చేసుకున్నాడా?

వెంటనే మార్చ్యురీకి తీసికెళ్ళి వేలిముద్రలు తీసుకున్నారు. అవి హత్యాస్థలంలో దొరికిన రివాల్వర్ మీది వేలిముద్రలతో సరిపోయాయి.

రెయిన్ కోటు మనిషిగానే నిర్ధారణ అయింది.

దీన్ని ప్రెస్‌కి రిలీజ్ చేయకుండా గోప్యంగా వుంచారు.

అప్పుడంతా అయ్యాక లాల్ అచూకీ విషయం మళ్ళీ మొదటికొచ్చింది.

ఆఫీసుకు తిరిగివచ్చేసి జాన్ పెరిగిన భయాందోళనతో ఇప్పుడు అశాంతిగా గడుపుతున్నాడు.

టైము పదిన్నర, ఇంకో అరగంటలో సుహాసినిని పోలీసులు మేజిస్ట్రేటుముందు హాజరు పరచబోతున్నారు. అక్కడకి జాన్‌కి వెళ్ళాలనిపించడం లేదు ఈ పరిస్థితిలో.

అతడలాగే గడుపుతున్న సమయంలో ఫోన్ మోగింది ఒక్కసారి.

ఎగిరిపడి, చటుక్కున చెయ్యిచాచి దాన్నెత్తాడు.

ఒక గొంతు పలికింది కఠినంగా. "నీ పార్ట్‌నర్ కోసం ప్రయత్నించవద్దు, జాన్. అతన్ని చంపేస్తాం. జాగ్రత్త, నిన్ను ప్రతిక్షణం కనిపెడ్తున్నాం—"

జాన్ ఉలిక్కిపడ్డాడు, "ఓహ్, ఎవర్నువ్వు?"

"మా పనులు పూర్తయ్యేవరకూ లాల్ మా అతిధిగా వుంటాడు" అందవతలి గొంతు, జాన్ మాటల్ని విన్పించుకోకుండా, "నువ్వతనికోసం ప్రయత్నిస్తే చచ్చిపోతాడు. నువ్వు అవివేకంగా ప్రయత్నించవు, ప్లీజ్.."

అవతల ఫోన్ పెట్టేస్తూంటే జాన్ నోరు తెరచి చూడసాగాడు.

ఉదయం ప్రాంతీయ వార్తల్లో — జంట నగరాల్లో జవ్వనుల్ని అపహరించే ముఠా తిరుగుతోందని—ఆకాశవాణి ప్రకటించింది.

ఇలాగే పత్రికలు కూడా అదరగొట్టాయి!

మొన్నా, నిన్నా జరిగిన చావులు, హత్యల సంఘటనలూ—మానభంగాలతో ముఖపత్రాలు నింపేశాయి!

ఇవన్నీ చూసి జనం ఆందోళనపడిపోయారు.

ఈ మానభంగాలూ, హత్యలే మతిపోగొడితే, ఆడపిల్లల దొంగల గురించిన హెచ్చరిక ఇంకా అదరగొట్టేసింది.

ఫలితంగా ఆడవాళ్ళు కన్పించడం మానేశారు బయట.

ఈ వివరాలన్నీ చదువుతూ నిట్టూర్చాడు నరేన్ కుమార్, మెడిసిన్ ఫైనలియ్యర్.

అతనప్పుడు పేపర్లో సుహాసిని ఫోటో నే తదేకంగా

చూడసాగాడు.

అతని ముఖభావాలు రకరకాలుగా మారుతున్నాయి. పూర్తి ముఖం విషాదభరితమైంది. కళ్ళు మూసుకుని తల వెనక్కి వాల్చేశాడు, ఆమె తలపుల్ని ఎన్నో రోజుల తర్వాత తిరిగి ఆహ్వానిస్తూ.

ఇన్నాళ్ళకు ఆమె తిరిగి అతనిలో అలజడి రేపు తోంది.

మర్చిపోయిన గతం మనసు అట్టడుగుపొరల్ని ఛేదించుకుని వెలుపలి కొస్తోంది....

అతని గుండె బరువెక్కింది. ఊపిరి భారంగా అందు తోంది.

సుహాసిని తనని కాదంది. ఆ తిరస్కారం బాధాకర మైన పద్ధతిలో జరిగిందనేది వేరే విషయం—ఆమె తత్వం అది. ఆ పరిస్థితిలో ఆమె అలాగే ప్రవర్తిస్తుంది.

ఆమె మనస్సు తను పూర్తిగా తెలుసుకోకుండా తొందరపడ్డాడు, అదే తప్పు. ఆమె పురుషద్వేషి అనుకో లేదు గానీ, ప్రేమ సంబంధమైన విషయాల్లో పూర్తిగా ఆమెకు ఆసక్తి లేదని తర్వాత గుర్తించాడు. ఆమె ఆలో చనలు, ఆశలు, ఆశయాలే వేరు. ఆమె లోకమే వేరు.

అది అప్పుడే తెలిసింది — యెప్పుడు? ఆమెతో మాట్లాడిన తొలిసారి—అదే చివరిసారి. అంతకుముం దెప్పుడూ ఆమెతో మాట్లాడలేదు. కనీసం పలకరించలేదు. చిరునవ్వు విసరలేదు. మనసులోనే ఇష్టపడ్డాడు. ప్రేమించాడు. ఆరాధించాడు—అంతా వన్ వే.

"మిస్ సుహాసినీ, మీరేమీ అనుకోకపోతే నేనొక మాట చెప్పాలనుకుంటున్నాను మీకు. మీతో నాకు ఎప్పుడూ పరిచయంలేదు. నేనెవరో మీకు తెలియదు.

ఇష్టం కలగగానే పరిచయం పెంచుకొనిపోయే తత్వం కాదు నాది. నిదానంగా ఆలోచించినమీదటే నిర్ణయం తీసుకుని ఏ పనైనా చేస్తాను. కోరిక తెలుపుతాను. పలకరింపులు లేకున్నా మీరు నన్నెప్పుడూ చూస్తూనే వున్నారు. నామీద మీకో అభిప్రాయం ఏర్పడే వుండాలి, ఏమంటారు? మీరు నాకు పూర్తిగా నచ్చారు. చెప్పండి, మరి మీరేమనుకుంటున్నారు నా గురించి? మీకు నేను నచ్చానా?"

ఛెళ్ — ఛెళ్ — చువ్ — చావ్ — ఫెడీమంది అప్పుడతని చెంప!

"బ్రూట్, యూ బ్లడీ బ్రూట్ నీకసలు మానర్స్ తెలుసా? సీనియర్వి నాకంటే, ఇదేనా నువ్వు నేర్చిన సంస్కారం? మర్యాద? వెళ్ళిక్కడ్నించి—యూ అగ్లీ ఆన్ ఎ బేన్డ్ క్రీచర్! మళ్ళీ ముఖం చూపించావంటే నల్గుర్లో నిలబెట్టి చెప్పందుకుంటాను - గెటవుట్ ఫ్రం హియర్, బుద్ధిహీనుడా!"

రాంగ్ అప్రోచ్, మైడియర్ మనసా! అనుకున్నాడప్పుడతను గదికొచ్చి.

మళ్ళీ ఆమెకు ముఖం చూపించలేదు.

వ్యథాభరిత హృదయంతో పారిపోవాలనుకున్నాడు దూరంగా ఎక్కడికైనా. నిర్మించుకున్న హార్మ్యాలన్నీ నేలమట్టమయ్యాయి. రంగుల కలలన్నీ చెదిరిపోయాయి. అధః పాతాళంలో పడ్డాడు. వీటన్నిటికీ తట్టుకుని తిరిగి మామూలు మనిషి కావడానికి చాలా కాలం పట్టింది. అపుడు చదువుమీద పూర్తిగా మనసులగ్నం కావడానికి ఇంకొంత కాలం పట్టింది ...గాయంమానింది. అప్పట్నించీ అతను ప్రేమ అనే రెండక్షరాల మాటని శాశ్వతంగా

మూర్ఛపోయాడు.

రెండేళ్ళు గడిచాయి ఇప్పటికి.

కాలం ఏమీ మార్పులు తీసుకురాలేదు ఇంతవరకూ. ఆమె వైఖరిలో ఏ మార్పూ రాలేదు. అవే ఆశయాలతో ఆమె అదే లక్ష్యానికి కట్టుబడి కృషి చేస్తోంది. గొప్ప డాక్టరు అయి, పెద్ద వైద్యశాల నెలకొల్పాలన్నదే ఆమె సంకల్పం, దృష్టి. అందులో కనీస వైద్య సహాయం అందక బాధలుపడే యెందరో బీదసాదలకి ఉచిత వైద్య దానం చేయాలన్నది ఆమె కంటున్న కల.

కానీ—యిప్పుడు పరిస్థితి తారుమారైంది.

ఇదామెకు వూహించని ఘాతం.

ఇప్పుడేం చేస్తున్నది సుహాసిని?

అభిమానంతో ఏదైనా అఘాయిత్యానికి పూనుకో బోతోందా?

నో, అలా జరక్కూడదు. తను ఆపాలి. తను వెళ్ళాలి. ఆమెను కలవాలి. ఈ పరిస్థితిలోనూ తననింకా అసహ్యం చుకోదుగా? ద్వేషించదుగా? తన రాకని మరో రకంగా అపార్థం చేసుకోదుగా? తన మనసులో యెప్పుడూ ఆమెపై హేళన భావం లేదని ఆమె అర్థం చేసుకుంటే చాలు. తనని అంగీకరిస్తే చాలు. ఆమె ఈ విషాదాన్ని మటుమాయం చేసి, మరిపించి, తిరిగి ఆమెని జయించ గలనన్న విశ్వాసం తనకిప్పుడుంది!

చటుక్కున కళ్ళు తెరిచాడు నరేన్.

ఆమె నాదే! సుహాసిని నాదవుతుంది....

హుషారుగా లేచాడతను పేపరు పడేస్తూ. అంత హుషారు అతనికెప్పుడూ రాలేదు.

• • •

ఫస్టుక్లాస్ మెట్రోపాలిటన్ మేజిస్ట్రేట్ కోర్టుముందు కోలాహలంగా వుంది. జనం ఇసుకవేస్తే రాలనంతగా వున్నారు. వాళ్ళంతా సమూహంగా చేరి ఎదురుచూస్తున్నారామెకోసం. ఉదయమే పత్రికలద్వారా తెలిసిన అభాగిని సుహాసిని.

ఆమె గాథ వాళ్ళకు మొదట షాకింగ్ న్యూస్ అయినా, ఇప్పుడామె పట్ల జాలి, బాధలతో పాటు గౌరవం కూడా కలుగుతోంది, ఆమె తెగింపును చూసి.

ముగ్గురు కీచకులచే ఘోరంగా చెరచబడి, అంత విహ్వలతలోనూ కోలుకొని, అంత దైన్య స్థితిలోనూ వాళ్ళని వెతికి, వెంటాడి, వేటాడి వధించిన ఆమె అసామాన్య పరాక్రమం వెనుక గొప్ప మానసిక బలం వుండాలనీ వాళ్ళంతా చెప్పుకుంటున్నారు. ఆమె చేసిందే న్యాయమని ఆమె పక్షం వహిస్తున్నారు.

ఉన్నట్లుండి వాళ్ళలో సంచలనం కలిగింది.

అక్కడ వచ్చి ఆగిందొక జీపు.

జనం దాన్ని కమ్మేస్తూంటే, జీపు దిగిన జవాన్లు లాఠీలతో వాళ్ళమీద పడ్డారు. సుహాసిని సహ విద్యార్థులూ, విద్యార్థినులూ పెద్దపెట్టున నినాదాలు చేశారు. వాళ్ళందర్నీ దూరంగా వుంచుతూంటే, జవాన్లు ఇద్దరు ఇన్స్పెక్టర్లు ముందు సీటుమీదనుంచి సుహాసినిని తీసుకుని దిగారు. ఆమె కిందికి చూస్తోంది, తలెత్తలేదు. నినాదాల స్థాయి మరింత పెరిగింది. ఆమెని చూస్తూనే ఒక్క క్షణం ఆమెనక్కడ వుంచకుండా గబగబా సాగిపోతున్నారు అధికారులు తీసుకుని.

రివ్వున వచ్చి రోడ్డుమీద ఆగిందొక బ్లాక్ అంబాసిడరప్పుడు—

అందులోంచి దబదబమని ఓ ఆరుగురు బయటపడ్డారు, ఆయుధాలు ధరించి: అందరి చేతుల్లో రివాల్వర్స్.

వాళ్ళు బోనులోంచి బయటపడ్డ సింహాల్లా దూసుకొచ్చారు ఆ జనంలోకి, రివాల్వర్స్ పేల్చుకుంటూ గాల్లోకి, భయోత్పాతాన్ని సృష్టిస్తూ. గావుకేకలు, కీచుకేకలు, హృదయవిదారక అరుపులతో జనం ఎటుపడితే అటు పరుగెత్తసాగారు. తోసుకుంటూ, కిందపడుతూ, దొర్లుకుంటూ, తొక్కుకుంటూ, కన్ఫ్యూజన్‌లో అక్కడక్కడే పరిగెడుతున్నారు.

రివాల్వర్స్ ఇంకా గర్జనలు చేస్తున్నాయి గాల్లోకి. వాళ్లు అడ్డం వచ్చిన ప్రతి ఒక్కర్నీ చావబాదుతూ రివాల్వర్ మడమతో, గుంపుని దాటడానికి ప్రయత్నిస్తున్నారు.

సుహాసినితో వెళుతున్న అధికారులు జరుగుతున్న దానికి ఒక్క క్షణం నివ్వెరబోయి, ఆమెని తీసుకుని పరుగెత్తసాగారు వేగంగా కోర్టు బిల్డింగ్‌లోకి. ఒక బుల్లెట్ దూసుకొచ్చింది. అది తిన్నగా ఒక అధికారి తలలోకి వెళ్ళిపోయింది. కూలిపోయాడతడక్కడే.

రెండో అధికారి, వెనక్కి తిరిగి రోషంగా రివాల్వర్ పేల్చాడు. అదెవరికీ హాని చేయలేదు కానీ బదులుగా ఒక బుల్లెట్ వచ్చి తగిలిపడిపోయాడు మెట్లమీదే. ఆయుధాలేని కానిస్టేబుల్స్ ముగ్గురు అసువులు బాసారెప్పుడో. మిగిలిన ఇద్దరూ ప్రాణాలు కాపాడుకోడానికి పారిపోయారు.

సుహాసిని సులువుగా చిక్కిపోయింది—ముష్కరులకి.

ఇదంతా చూస్తున్న సతీష్ తల్లి కళ్ళు తిరిగి కుప్పలా కూలిపోయింది. సతీష్ వెర్రిగా అరిచి ఆమె ప్రక్కన

కూలబడ్డాడు. జనం చాలావరకు అదృశ్యమయ్యారు.

విజయగర్వంతో శక్తికొద్దీ కారు దగ్గరకు వురుకు తున్నారు ముష్కరులు — పిచ్చిచూపులు చూస్తున్న సుహాసినిని తీసుకుని. కొంతదూరంలో, గోడవారగా, స్కూటరాపి ఇదంతా చూస్తున్న నరేష్‌కుమార్ ఇక ఆగలేకపోయాడు—

కిందపడ్డ ఓ పోలీసు లాఠీని అందుకున్నాడు నరేన్. దానితో విసురుగా వెళ్ళి ఓ ముష్కరుడి వీపులో పొడిచాడు. వాడు బాధగా అరిచి సుహాసినిని వది లేశాడు. నరేన్ వాడి పొట్టలో పొడిచి కింద పడేశాడు. రెండోవాడు షూట్ చేయబోయేలోగా ఫట్‌మని వాడి మొహంమీద బాదాడు. వాడు ముఖం పట్టుకుని రివాల్వర్ వదిలేశాడు, ఒక్క కేకతో. నరేన్ వంగి రివాల్వర్ అందుకుంటూ సుహాసిని చెయ్యిపట్టి లాగాడు. ఆమెను లాక్కుని వెళ్ళిపోతూ, లేచి వచ్చేస్తూన్న ముష్కరుడి మీదికి కాల్చేశాడు. ఈసారి వాడు శాశ్వతంగా నేల కూలాడు. నరేన్ ఆగకుండా పరుగుతీశాడు—

అతనో పరుగెత్తుతున్న సుహాసినిని చూడగానే మరింత వెర్రెత్తిపోయారు మిగిలిన దుండగులు. వరుసగా కాల్పులు జరిపారు వాళ్ళమీదికి. జనంలోంచి మరికొన్ని అరుపులు. ఒక చావు కేక!

జనంలో కలిసిపోయి దౌడు తీస్తున్న నరేన్ వెనక్కి చూడలేదు. స్కూటరు చేరుకొని దానిమీదికి ఆమెను తోశాడు. తను కూర్చుని వెంటనే స్టార్టు చేశాడు. క్షణంలో ఆమెతో దూసుకెళ్ళిపోయాడు ఆ రణరంగం నుంచి దూరంగా—

"ఆపరేషన్ ప్లాన్! ఫాలో దెమ్ ఫాలో!" గొంతు చించుకుంటూ అరిచాడు ముష్కర నాయకుడు శంభునాథ్ కారు దగ్గరికి పరుగెత్తుతూ.

జింబో తన దండుతో దౌడుతీశాడా కారు దగ్గరికి, "కమాన్, యూ బ్లడీ ఫూల్స్! ఫాస్ట్!"

• • •

కమీషనర్ ఆఫ్ సిటీ పోలీస్, ఇద్దరు అసిస్టెంట్ కమీషనర్లు, ఇంకొందరు ఇన్స్పెక్టర్లూ, రెండు వ్యాన్ల నిండా జవాన్లూ, డిటెక్టివ్ జాన్‌తో పాటు రెండు ఉస్మానియా అంబులెన్సులూ అక్కడికి చేరుకునేటప్పటికి ఆ రణరంగం హతులతో, క్షతగాత్రులతో పరమ భీకరంగా వుంది—

త్రొక్కిసలాటలో మూర్ఛిల్లిన వాళ్ళూ, గాయపడి మూల్గుతున్న వాళ్ళూ అక్కడ లెక్కలేనంతమంది.

రక్తపు మరకలకు మితమే లేదు.

ఒక కానిస్టేబులు తన రక్తంతో ఇలా వ్రాస్తూ ప్రాణాలొదిలాడు. **APT** 6878.

అది వెంటనే అన్ని పోలీస్ స్టేషన్లకీ, పాట్రోలింగ్ స్క్వాడ్స్‌కీ ట్రాన్స్‌మిట్ చేయబడింది—కారు రంగూ మేక్‌తో సహా.

స్ట్రెచర్ బేరర్లు గాయపడిన వారిని ఒక అంబులెన్స్‌లో చేరవేస్తున్నారు.

పోలీస్ ఫోటోగ్రాఫర్లు, ప్రెస్ రిపోర్టర్లూ ఆ దృశ్యాల్ని తమతమ కేమెరాల్లో రికార్డు చేసుకుంటున్నారు.

ట్రాఫిక్ అధికారులు రోడ్డుమీద ఇరువైపులా ట్రాఫిక్‌ని మరో దారికి మళ్ళిస్తున్నారు.

హతమైన ఆ ఇద్దరు ఇన్‌స్పెక్టర్ల చేతుల్లో రివాల్వర్స్ అలాగే వున్నాయి.

ముగ్గురు కానిస్టేబుళ్ళ శవాలు మూడు కోసలకి పడి వున్నాయి.

ఒక ముష్కరుడి శవం వెల్లకిలా పడివుంది, కాళ్ళు బార జాపుకుని.

హతులు మొత్తం ఆరుగురు. గాయపడినవారు పన్నెండుమంది. వీళ్ళంతా ప్రేక్షకులు.

తప్పించుకుని ప్రాణాలు కాపాడుకున్న ఆ ఇద్దరు కానిస్టేబుల్సు, ఇప్పుడు కమీషనర్ యెదుటకొచ్చి సంఘటనని వివరిస్తున్నారు....

వ్యాన్‌లో దిగిన జవాన్‌లూ, ఇన్‌స్పెక్టర్‌లూ సహాయ కార్యక్రమాలు చకచక నిర్వహిస్తున్నారు....

కమీషనర్ ఆదేశాలు వింటూ జాన్ పరాకుగా చూస్తున్నాడు. లాల్ సమస్య అతని మనసులోకి మరి దేన్నీ ఆహ్వానించడంలేదు.

అతని కొక్కటి తోచింది. శత్రువులిప్పుడు సుహాసిని కోసం గాలిస్తూంటే తన నిప్పుడు కనిపెట్టరు. పట్టించు కోరు.

ఈ ఆలోచన అతనికెంతో రిలీఫ్‌నిచ్చింది.

ఇప్పుడు తనేం చేయాలో ఆలోచిస్తూ, ఉలిక్కిపడి చటుక్కున కమీషనర్ దగ్గరికొచ్చాడు. "సర్ — ఆ నెంబర్ **APT** 6878 వాళ్ళ కారుదేనా?"

కమీషనర్ ముఖం చిట్లించాడు. "మరి గాకపోతే?"

"ఆమె యెక్కి వెళ్ళిన స్కూటరుదేమో?" అన్నాడు జాన్.

కమీషనర్ అప్పుడు కలవరపడ్డాడు, "యస్,

అవును. కానిస్టేబులు దేని నెంబర్ వ్రాశాడో చెప్పలేం! వాకబు చేయండి! ట్రాఫిక్ డిపార్టుమెంట్‌ని కన్సల్టు చేయండి!" అసిస్టెంట్లని ఆదేశించాడు, "ఈలోగా ఆ నెంబర్‌గల వెహికలు కారులేదా బ్లూ కలర్ స్కూటర్ అయివుండొచ్చని రీట్రాన్స్‌మిట్ చేయండి, క్విక్!"

అసిస్టెంట్లు దానికి వెంటనే పూనుకున్నారు.

కోర్టు వరండాలో ఇంకొకటి అటెండ్ చేయాల్సి వుంది వాళ్ళు—

అక్కడ స్పృహతప్పి పడిపోయిందనుకున్న సతీష్ తల్లి శాంత, ప్రాణాలే విడిచింది, అప్పటి షాక్‌ని తట్టుకో లేక.

* * *

అన్ని ప్రధాన మార్గాల్లోనూ ఏర్పాటయిన పోలీస్ బ్లాకేడ్స్‌వద్దా సులువుగా క్లియరెన్స్ తీసుకుంటూ సాగి పోతోంది బ్లాక్ అంబాసిడర్ ....శంభూనాథ్ అందో ళనగా కూర్చుని చూస్తున్నాడు. అనుచరులంతా ఉద్రే కంగా కూర్చున్నారు.

జి.పి.ఓ. దగ్గరికి రాగానే కారాపమని చెప్పి దిగాడు శంభూనాథ్. అనుచరుల్ని కార్లోనే వుండమని చెప్పి, బిల్డింగ్ లోకి నడిచాడు గబగబా....

లోపల హాల్లో ఫోన్ బాక్స్‌ని చేరుకుని, ఒక నెంబర్ తిప్పి, రెస్పాన్స్ రాగానే కాయిన్ వేసి, "బాస్, నేను శంభూని" అన్నాడు.

"హాలో, ఏమిటి శంభూ?"

"ప్లాన్ అయింది బాస్, అయాం సారీ, ఆమె తప్పించుకుంది...."

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 6 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

## ముసలివాడి హత్య?

డిటెక్టివ్ జంబు, అసిస్టెంటు టింగు ప్లాటుఫారం మీద నడుస్తూన్నారు. వారికేమయాన కేసులు లేక మెదడు మొద్దు బారిపోతుందని బయటకు బయలుదేరారు, గాలైన సేవించ వచ్చని.

సాయంత్రం మూలనా రోడ్డంతా రద్దీగా వున్నది.

డిటెక్టివ్ జంబు దృష్టి దూరంగా రోడ్డును క్రాసు చేసి అవతలి ప్లాటుఫారం మీదకు వెళ్ళింది.

అక్కడ....

ప్లాటుఫారం ప్రక్క ఒక శవం పరుండబెట్టి నిండా తెల్లగుడ్డ కప్పియున్నది. తలదగ్గర అగరవత్తులు వెలిగించి యున్నాయి. శవం ప్రక్కన పళ్ళెం—పళ్ళెం నిండా చిల్లర డబ్బులున్నాయి. శవం ప్రక్కగా తల మాసిన పొడుగాటి గెడ్డంగల వాడు "బాబూ! నా అయ్యపోయాడు! కర్మకు ధర్మం చెయ్యండి బాబు" అంటూ జాలిగొల్పే విధముగా ఏడుస్తూ అడుక్కుంటున్నాడు.

వచ్చేపోయే జనం తమకు తోచింది ఆ పళ్ళెంలో వేస్తున్నారు.

జంబు, టింగుతో ఆ ముష్టివాడి దృశ్యం చూపి "ఇటువంటి వార్ని ఒక కంట కనిపెడ్తూ వుండాలి. ఈ మధ్య

ఒక కేసు పేపరులో పడింది. ప్లాటుఫాం మీద పడుకున్న ముసలివాడ్ని గొంతు పిసికి చంపిన హంతకుడే అతని కొడుకుగా నటించి, అడుక్కుని, వచ్చిన డబ్బుతో పరారయ్యాడు, శవాన్నీ గాలికి వదిలేసి. ఇదంతా చూసిన మరో ముష్టివాడు పోలీసు రిపోర్టు యిచ్చాడు. కాబట్టి వీడ్ని ఒక పట్టుబడితే నిజం తెలియవచ్చు."

ఇద్దరూ రోడ్డుదాటి పేవ్‌మెంటు మీదకు వచ్చి నుంచున్నారు.

కార్లు, బస్సులు, లారీలు, ఆటోలు, సైకిళ్ళు రెండు చక్రాల శకటాలమీద బరువులను మోసుకెళ్ళే కష్టజీవులు, కొట్టుల్లో తమకు కావలసిన వస్తువులు బేరమాడి తీసుకునే గృహిణులు.... రోడ్డంతా హడావిడిగా గోలగా వున్నది. ఆ గోలలో హృదయవిదారకంగా నున్న గెడ్డంవాడి ఏడ్పు.

జనం దూరం నుండె శవం దగ్గర నున్న పళ్ళెంలో చిల్లర డబ్బులు విసురుతున్నారు. అవి చిన్న శబ్దం చేస్తూ పళ్ళెంలో నుండి గెంతి నేలమీద పడి పదిపైసలు.... పావలాలు.... అయిదుపైసలుగ గుర్తింపజేస్తున్నాయి.

దగ్గరగా వచ్చిన డిటెక్టివులను చూచి గెడ్డంవాడు "ధర్మ ప్రభువులు. ఎంతో కొంత ధర్మం చెయ్యండి బాబూ!" అన్నాడు తన మామూలు కంఠంతో.

జంబు వాడితో "ఏరా! అబ్బి వీడు నిజంగా నీ తండ్రేనా!" అన్నాడు. గెడ్డంవాడు ఆశ్చర్యపోయాడు. యింతవరకు ఎవరూ అలాంటి ప్రశ్న వెయ్యలేదు. దగ్గరకసలే రాలేదు. కూనిరాగం ఆగిపోయింది.

"అవును బాబు, నా అయ్యేనండీ! వాతం కమ్మి చచ్చిపోయాడు. మీరు ధర్మప్రభువుల్లా కనపడుతున్నారు. మీ

వంటి జాలి గుండెలు గలవారే వీడి కర్మకు సహాయం చేస్తారు" పొగడ్తలు నింపి ఏకరువు పెట్టసాగాడు.

రాని కన్నీళ్ళను భుజంమీద నున్న పాత గుడ్డతో తుడుచుకోసాగాడు.

"ఇక్కడ....ఎవరో మునలివాణ్ని గొంతు నులిమి చంపినట్లుగా మాకు తెలిసింది. అక్కడక్కడ ఎంక్వైరీ చేసి వచ్చాము. యిక్కడే హత్య జరిగినట్లుగా చూచాయిగా తెలుస్తున్నది. దీనికి నీవేమంటావు?" అన్నాడు కరకుదనం గల కంఠంతో.

గెడ్డంవాడు కూర్చున్న వాడల్లా స్ప్రింగులా లేచి "హత్యా! ....అయ్యబాబోయ్....! నాకు తెలీదండి. ఇంతకు మీరు....?" వణుకుతున్నాడు.

"మేము డిటెక్టివులం....వెనకాల పోలీసులు వస్తారు" అన్నాడు టింగు గర్వం నిండిన కంఠంతో.

ఈ గలాటా చూపి జనం పోగడ్డారు. 'విషయం ఏమిటా?" అని.

"అయ్యబాబోయ్! మీరు డిటెక్టివ్‌లా....?" అంటూ శవం కాలు త్రొక్కుకుంటూ దగ్గరలోనే వున్న సందులోకి వేగంగా పరుగెత్తాడు గెడ్డంవాడు.

ఎప్పుడైతే గెడ్డంవాడు కాలు త్రొక్కాడో శవం తాలూకు ఆకారం ఒక్క ఉదటున లేచి దుప్పటి అక్కడే వదిలేసి అతడుకూడా బుల్లెట్‌లా పరుగెత్తాడు.

ఎప్పుడైతె శవం ఆకారం లేచిందో అసిస్టెంటు జడుసుకుని జంబును కౌగలించుకోబోయాడు అయితే అప్పటికే జంబు చాలాదూరం పరుగెత్తిపోయాడు భయంతో.

—మూసాజీ, కాకినాడ.

